శ్రీమత్పరదేవతాయై నమః

# శ్రీ మహాలక్ష్మీ సామాన్య విశేష పూజాకల్పము



గ్రంథకర్త

## పీసపాటి లక్ష్మావధానులు

(శ్రీ గగనానందనాథదీక్షాభిఖ్యులు)

పాతగుంటూరు - గుంటూరు - ఆంధ్రప్రదేశ్

ప్రాప్తిస్థానము

[మూల్యము రు 10/—

శాలిశకము ౧౮౮౬
క్రోధి సం. జ్యేష్ఠమాసము

ప్రథమ ముద్రణము
౧౦౦౦ ప్రతులు

1964

మూల్యము
10/— (పదిరూప్యములు)

# ప్రస్తావము

శ్రేయోఽర్థులారా,

(1) మహాలక్ష్మి సామాన్య విశేష పూజాకల్పము స్త్రీ పురుషులకు, విద్యార్థులకు, అత్యంతోపయోగకరముగా నుండునట్లు వ్రాయబడినది.

(2) ప్రస్తుతము భారతీయప్రజలు సమృద్ధాహారలోపముతో, దారిద్ర్యముతో, రోగములతో, యుద్ధభయాదులతో, బాధితులై యుండుటను చూచి, ఏతన్నివారణోపాయమును వేదములందు చెప్పబడియున్న రహస్యాతిరహస్యవిషయములతో శ్రీమహాలక్ష్మి భగవతీ ప్రేరణచే గుర్తించి, నా శక్తికొలది యిందు ప్రచురించితిని.

(3) పూజాస్తోత్రాదు లన్నింటిలో నేతత్కల్పోక్త పూజాక్రమమునకు మహాయాగక్రమ మని పేరు. ఆకారణమున మహాయాగక్రమారాధ్యా అని లలితాసహస్రనామములయందు పేర్కొనబడినది. ఇట్టి ప్రమాణసిద్ధోత్కృష్టపూజకన్న నెక్కువైనపూజ మరియెందును లేన ట్లిందలి యైదు లక్ష్మీఅవతారచరిత్రలే విశదపఱచుచున్నవి. నూవులయందు తైలమువలె నీపూజాస్తోత్రాదులను ఉపనిషత్తులయందు జూపబడిన బహుదేవతాపూజలలో నిది సారభూత మని బహ్వృచోపనిషత్తు ఉద్ఘోషించుచున్నది.

(4) బీజాంకురరూపిణీ శక్తిః—అను ప్రమాణప్రత్యక్షానుభవముల ననుసరించి యీ గ్రంథమునందలి వేలబీజములను యంత్రము వేయుట అసాధ్యమగువిషయము. అందుచే నీగ్రంథమునకే పూజాదులు చేయుట ముఖ్యము. ఇట్లు చేయుట శాస్త్రీయము, సదాచారప్రచురమునై యున్నది. క్రొత్తదస్త్రములు పెట్టుకొనునప్పుడును, నూతనసంవత్సరాదియందును పుస్తకములకే పూజలు చేయుచున్నాము. మరియు శరన్నవరాత్రములయందు పుస్తకముల నుంచి సరస్వతీపూజయు చేయుచున్నాము. సిక్కులకు వేరు దేవతాలయములు లేవు. ఉత్తమగ్రంథములనే దేవతగా భావించి వారు వానికే పూజాదులు చేయుచున్నారు. అందుననే యీగ్రంథము హిందీలోగూడ అచ్చుకానున్నది.

(5) మనుష్యులకు నివసింప గృహమట్లు ఒక్కొక దేవతకొక్కొక దేవాలయము గృహస్థానీయమై యున్నది. ఈగ్రంథమన్ననో సర్వలోక దేవతాలయమై యున్నది. ఇందు పంచబ్రహ్మలు సమస్తప్రధాన దేవతలు పరివారములతో బీజాంకురములతో ఆహ్వానించబడియున్నారు. అందుచే నీగ్రంథము శ్రీమహాలక్ష్మికి నిత్యనివాసస్థానమైయుండుట సత్యము. శ్రీచక్రరాజనిలయా శ్రీమత్త్రిపురసుందరీ అను ప్రమాణముచే నీగ్రంథమునందు శ్రీచక్రనవావరణ దేవతలు సపరివారముగా సర్వదా నివసించియుందురు. ఈగ్రంథము సర్వదేవతా దేవాలయముగనుక నీగ్రంథమునకే నిత్య

పూజ చేయవలయును. శ్రీచక్రమునందును నిన్ని బీజములు వేసి పూజించుట సాధ్యముగానిపని. కాని సర్వబీజాక్షరాలయ మగునీగ్రంథమును బూజించుట సులభసాధ్యము. సంపూర్ణ ఫలము నొందుట కీగ్రంథమునే దేవీస్వరూపముగ భావించి పూజించుట సర్వశ్రేయస్కరము.

(6) ఈగ్రంథమునం దనేక పూజావిషయములు నిరూపింపబడినవి. భక్తులు వారివారి వీలువెంట వారివారికి గలయవకాశము ననుసరించి ఆయావిధానానుసారమే పూజచేసికొనుటకు తగినసూచనలు వ్రాయబడియున్నవి. ఈ పూజాపారాయణలకు విశేషనియమములతో నిమిత్తము లేదనియు, విధి తెలియక చేసినను తాను ప్రీతితో గ్రహించి భక్తులకోరికలనెల్ల ప్రసాదింతుననియు, ఇందెంతమాత్రము సందేహము లేదనియు దేవియే

శ్లో॥ జానతాఽజానతా వాపి బలిపూజాం తథాకృతామ్
ప్రతీక్షిష్యా మ్యహం ప్రీత్యా వహ్నౌ హోమం తథాకృతమ్॥

అని కంఠోక్తిగా ప్రత్యభయహస్తము నొసగుటయేగాక యట్లనుగ్రహించినటు దేవియొక్క అవతారచరిత్రలే సాక్ష్యమిచ్చుచున్నవి. కాన నిర్భయముగా యథాశక్తి స్త్రీపురుషు లెల్లరు తమప్రయోజనముల ననుసరించి దేవి నారాధించి, తదనుగ్రహపాత్రులు కాగలరని ఆసించుచున్నాను.

చరిత్ర చాటుచున్నది. ఈకల్పప్రకారము జీవితములో ఒక్కమారు పూజాదులు చేసినను ధన్యు లగుదు రనుట కెట్టి సందేహము లేదని 3 వ చరిత్ర 217 శ్లోకమున

"ప్రీతి ర్మే క్రియతే సాస్మిన్ సకృత్సుచరితే శ్రుతే।
శ్రుతం హరతి పాపాని తథాఽఽరోగ్యం ప్రయచ్ఛతి॥"

అని దేవి స్వయముగ చెప్పియున్నది.

(8) ఈగ్రంథముద్రణాదులకు ద్రవ్యసాహాయ్య మొనర్చిన మహాలక్ష్మీభక్తుల నామధేయములజాబితా విడిగా నిందు ప్రచురింపబడియున్నది. ఆయుదారమూర్తులకెల్లరకు నే నెంతయు కృతజ్ఞుడను. వారికి శ్రీమహాలక్ష్మి చిరాయురైశ్వర్యాభీష్టసిద్ధుల ప్రసాదించుగాక.

(9) శ్రీవిద్యోపాసకాదివిబుధలోకము శిష్టసంప్రదాయరహస్యానుసార మిం దేవేని ప్రమాదము లున్నట్లు భావించినచో నాయాస్థలములం దెట్లుండవలసినది సహేతుకముగ వ్రాసి పంపించిన నవి రెండవముద్రణమందు సవరించి ప్రచురించబడును.

(10) ఈపూజాకల్పగ్రంథములను యథాశక్తి దానముచేసిన, వారు చేయుపూజాపారాయణలలో కొంతఫలము వచ్చుటయేగాక లోకోపకారముగూడ గల్గి, దాతలకు నవగ్రహాదిదానసువర్ణాదిదానఫలములు సిద్ధించును.

(7) ఈపూజాకల్పమే దేవీశరన్నవరాత్రపూజాకల్పమును, మహాయాగక్రమపూజాకల్పమును, ఆపత్కాలమహాపూజాకల్పమును శుక్రవారపూజాకల్పమును, నవగ్రహాదిశాంతికల్పమును, సర్వరోగహరపూజాకల్పమును, సర్వసౌభాగ్యదాయకపూజాకల్పమును, సర్వాభీష్టప్రదపూజాకల్పమును, సర్వాపన్నివారకపూజాకల్పమును, అయియున్నది. (శ్రావణమంగళవారపూజలప్పుడును శ్రావణశుక్రవారపూజలప్పుడును, సత్యనారాయణవ్రతాదులు చేయునప్పుడును, ఈపుస్తకమును దేవతాభావనతో పూజించుటచే ప్రత్యక్షదేవతాపూజ చేసినట్లగును.) కనుక నితర పూజాదులతో నిమిత్తము లేకయే సర్వాభీష్టములు సర్వులు పొందుదురని దేవీచరిత్రలలో స్పష్టీకరింపబడియున్నందున నిందు వివరింపబడిన సర్వాంశములను శ్రద్ధతో చదివి తెలిసికొని, అమ్మవారి నారాధించి, ఇహపరశ్రేయస్సులు బడయదగును. ఇట్లని 3వ చరిత్ర నె 208 రు శ్లోకమున దేవి స్వయముగా చెప్పియున్నది. ఇందలి మహాలక్ష్మీపంచావతారచరిత్రలవలన ఈమహాలక్ష్మీపూజ దేవతల కొరకును, మనుష్యులకొరకును చెప్పబడియున్నట్లు సుస్పష్టము. కావుననే మనుజులలో సమాధియను వైశ్యుడు, సురథు డనురాజు దేవి నారాధించి కష్టములనుండి గట్టెక్కి సుఖవంతులైనట్లు నాల్గవచరిత్ర చాటుచున్నది. ధర్మరాజాదు లాచరించి తమకష్టములను దాటి సుఖించిన దైదవ

(11) ఈగ్రంథముద్రణమందు సహాయపడిన యస్మత్సోదరకల్పులు, నిష్కామకర్మానుష్ఠానపరులు, ఉభయభాషాభిజ్ఞులు నగు బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

విబుధలోక విధేయుడు,

గ్రంథకర్త.



గ్రంథకర్త
చతుర్వేదపరమరహస్య గ్రంథప్రణేత
శ్రీగగనానందనాథదీక్షానామ ప్రథిత
శ్రీ పీసపాటి లక్ష్మావధానులు





గ్రంథకర్తృ ధర్మపత్ని మహాపాదుకాంత దీక్షాపరురాలు
శ్రీ వరలక్ష్మమ్మగారు

# ప్రస్తావాది విషయసూచిక


1. పూజచేయు పద్ధతులు 1
(1) మూడుగంటలపూజ 1
(2) గంటపూజ 1
(3) అరగంటపూజ 1
(4) పదునైదునిమిషములపూజ 2
(5) అయిదునిమిషములపూజ 2
2. పారాయణ చేయుపద్ధతులు 2
3. ఇహజన్మ పూర్వజన్మకృత గృహాది సర్వదోష శాంతికి 5
4. భూతగ్రహాదిదోష శాంతికి 6
5. బాలగ్రహాదిశాంతికి 6
6. నవగ్రహములు చాలనప్పుడు తద్దోష నివృత్తిద్వారా ఏకాదశస్థానస్థిత శుభ ఫలప్రాప్తికి 7
7. దారిద్ర్యబాధానివృత్తికి-ధనప్రాప్తికి 9
8. స్త్రీలకు సర్వసౌభాగ్యప్రాప్తికి, యోగ్యుడగుభర్త లభించుటకు— పురుషులకు సర్వలక్షణసంపన్న, సాధ్వి యగుభార్య లభించుటకు 9
9. ఉద్యోగ రాజకీయ సర్వకార్యసిద్ధికి 10
10. సర్వరోగనివారణకు 11
11. మహామారీ, స్ఫోటకాదులు, కలరా మున్నగువ్యాధులనివారణకు 12
12. దారిద్ర్యాన్నక్షామనివారణకు 12

13. సర్వబాధానివృత్తికి 13
14. వ్యాపారలాభాభివృద్ధికి 14
15. గర్భిణీస్త్రీల సుఖప్రసూతికి 15
16. జ్వరములకు 15
17. సర్వశూలలనివృత్తికి 16
18. విద్యార్థులు మేధావంతులు, ప్రజ్ఞావంతులు, విద్యావంతులై పరీక్షలలో విజయ మొందుటకు 17
19. సర్పదోషనివృత్తికి 18
20. అభిషేకము 19
21. మహాయాగము 20
22. పుణ్యలోకప్రాప్తికి 22
23. కేవల మోక్షమునకు 22
24. నె 83 రు నవావరణార్చన ఫలవివరణము 23
25. నిత్య శుక్రవార పూజ 24
26. మహైశ్వర్యసంప్రాప్తికి 25
27. రాజచోరాగ్నిసింహవ్యాఘ్రాది సర్వోపద్రవ నివారణకు 25
28. సర్పవృశ్చికాదిమహావిషనివారణకు 26
29. సర్వైశ్వర్యములకు 26
30. పురుషసంతానాద్యైశ్వర్యప్రాప్తికి 27
31. పుత్రికాద్యైశ్వర్యమునకు 27
32. సంతాన నిరోధమునకు 28
33. యుద్ధదురాక్రమణాదిభయనివృత్తితో సంపూర్ణ విజయసిద్ధికి 28
34. చతుర్వేదపరమరహస్యము 32




# పూజాకల్ప విషయసూచిక


1. పరమేశ్వరధ్యానం 1
2. స్వర్ణాకర్షణమహాలక్ష్మీధ్యానం 2
3. రాజరాజేశ్వరీధ్యానం 2
4. మహాపాదుకాధ్యానం 3
5. హయగ్రీవధ్యానం 3
6. గురుపరంపరాధ్యానం 3
7. భూశుద్ధిః 5
8. భూతశుద్ధిః 5
9. అసనం 6
10. శిఖాబంధనం 6
11. దీపారాధనం 7
12. దీపదేవతాప్రార్థన 7
13. ఆచమనమ్ 8
14. ప్రాణాయామః 8
15. సంకల్పః 9
16. కలశారాధనం 10
17. గంగాధ్యానం 11
18. విఘ్నేశ్వరపూజా, విఘ్నేశ్వరధ్యానం 12
19. ఘంటాపూజా 13
20. శంఖపూజా 13
21. పీఠపూజా 14
22. మందిరార్చన 17
23. మహాకాళీధ్యానం 19
24. మహాలక్ష్మీధ్యానం 19

25. మహాసరస్వతీధ్యానం 20
26. రాజరాజేశ్వరీధ్యానం 20
27. ప్రాణప్రతిష్ఠ 21
28. ప్రమాణము 22
29. శ్రీసూక్తమహాలక్ష్మీన్యాసః 23
30. ఆవాహనం 26
31. పాద్యం 28
32. అర్ఘ్యం 28
33. ఆచమనీయం 28
34. మధుపర్కః 29
35. పంచామృతస్నానం 29
36. చతుష్షష్టికలాన్యాసావాహనపూజ అగ్నికళలు 31
37. సూర్యకళలు 33
38. చంద్రకళలు 34
39. బ్రహ్మకళలు 36
40. విష్ణుకళలు 37
41. రుద్రకళలు 38
42. ఈశ్వరకళలు 40
43. సదాశివకళలు 41
44. అభిషేకము 43

1. సద్యోజాత, 2. వామదేవ, 3, అఘోర, 4. తత్పురుష, 5. ఈశానమంత్రము.

45. త్రిపురోపనిషత్తు 44
46. దేవ్యుపనిషత్తు 47
47. బహ్వృచోపనిషత్తు 51
48. మహాలక్ష్మిఉపనిషత్తు 53
49. శుద్ధోదకస్నానం 56

50. చతుష్షష్ఠ్యుపచారపూజ 57
51. వస్త్రం 59
52. యజ్ఞోపవీతం 60
53. ఆభరణాని 60
54. గంధం 61
55. కుంకుమాక్షతాః 62
56. పుష్పాణి 62
57. బిల్వపూజ 63
58. షడంగపూజ 64
59. షడ్దర్శనపూజ 65
60. షడామ్నాయవిద్యేశ్వరీపూజ 66
61. నిత్యమహాలక్ష్మీషోడశకళాపూజ 68
(25 అవతారములు)
62. మహాకాళీపూజ 71
63. పంచపంచికామహాలక్ష్మీపూజ 72
64. సరస్వతీపూజ 77
65. చాముండాదేవీపూజ 77
66. చండీపూజ 79
67. నవదుర్గావతారపూజ 79
పాడ్యమి – శైలపుత్రీ
విదియ – బ్రహ్మచారిణీ
తదియ – ఛన్నఘంటా
చవితి – కూష్మాండ
పంచమి – స్కందమాతా
షష్ఠి – కాత్యాయనీ
సప్తమి–కాళరాత్రిదుర్గాదేవీ
అష్టమి – మహాగౌరీ
నవమి – సిద్ధిదుర్గా

నవార్ణవ - సప్తశతిదుర్గా
మహావిద్యావనదుర్గా
68. శ్రీ రాజరాజేశ్వరీ
పరాభట్టారికాం బాపూజ 81
69. గురుత్రయార్చన 86
70. గణపత్యర్చన 87
71. పీఠత్రయార్చన 88
72. భైరవార్చన 88
73. సిద్ధౌఘార్చన 89
74. వటుకత్రయార్చన 90
75. పదయుగార్చన 90
76. దూతీక్రమార్చన 91
77. మండలత్రయార్చన 92
78. చతుష్షష్టి యోగినీగణార్చన 92
79. వీరావళ్యర్చన 97
80. మాలిన్యర్చన 97
81. మంత్రరాజార్చన 98

ఎనిమిది మహావాక్యములు

82. గురువందనార్చన 99
83. నవావరణార్చన 100
ప్రథమావరణార్చన-త్రైలోక్యమోహాన
చక్రార్చన 100
ద్వితీయావరణార్చన-సర్వాశాపరి
పూరక చక్రార్చన 104
తృతీయావరణార్చన-సర్వసంక్షోభణ
చక్రార్చన 106
చతుర్థావరణార్చన-సర్వసౌభాగ్య
దాయక చక్రార్చన 108

పంచమావరణార్చన-సర్వార్థసాధక
చక్రార్చన 111
షష్ఠావరణార్చన-సర్వరక్షాకర
చక్రార్చన 113
సప్తమావరణార్చన-సర్వరోగహర
చక్రార్చన 115
అష్టమావరణార్చన-సర్వసిద్ధిప్రద
చక్రార్చన 117
నవమావరణార్చన-సర్వానందమయ
బైందవచక్రార్చన 121
(స్వర్ణాకర్షణమహాలక్ష్మ్యర్చన)
84. సర్వసౌభాగ్యసిద్ధిప్రదధ్యానం 123
85. శ్రీలక్ష్మీ సహస్రనామావళిః 126
86. శ్రీ లక్ష్మ్యష్టోత్తరశతనామావళిః 148
87. దుర్గాష్టోత్తరశతనామావళిః 151
88. శ్రీ లలితాష్టోత్తరశతనామావళిః 153
89. ధూపం 157
90. దీపం 157
91. మహానివేదనం 158
92. పానీయం 160
93. తాంబూలం 160
94. హిరణ్యసమర్పణం 161
95. విప్రసువాసిన్యర్చన 161
96. బలిప్రదానం 162
97. నీరాజనం 162
98. కుళదీపం 163
99. మంత్రపుష్పం 165

దుర్గాదేవీసూక్తం 166

100. నమస్కారః 170

101. మలశోధనం 171

102. శంఖాదితీర్థం 174

103. ఆత్మార్చనాహుతిత్రయం 174

104. సర్వదేవతాతృప్తి 176

105. ఆత్మారోపణం విసర్జనం 176

(యథాస్థానప్రవేశమంత్రః)

106. మహాలక్ష్మీదేవీ పంచావతార చరిత్రలు 178

(దేవీసప్తశతీపారాయణక్రమారంభము 178

నవార్ణవదుర్గా, మహావిద్యా-మూల మంత్రము, మంత్రబీజార్థము) 179

107. ప్రథమచరిత్ర(మూలము-తాత్పర్యము) 182

(1) విష్ణుమూర్తి కర్ణకమలమున బుట్టినమధుకైటభులు బ్రహ్మదేవుని చంపుటకు యత్నించినపుడు విష్ణుమూర్తినాభికమలమున నున్నబ్రహ్మదేవుడు దిక్కు-తోచక ఏకాగ్రచిత్తుడై యోగనిద్రా మహామాయాభగవతిని స్తుతించుట 185

(2) విష్ణుమూర్తి యోగనిద్రనుండి మేలుకొని మధుకైటభులను రాక్షసులతో అయిదువేలసంవత్సరములు యుద్ధముచేసి, వారిని చంపజాలక వారిచ్చిన వరముచే వారినే తనతొడయందు సంహరించుట 191

108 ద్వితీయచరిత్ర (మూలము తాత్పర్యము) 193

(1) నిండునూరుసంవత్సరములు దేవతాధిపతి యైన ఇంద్రునకును రాక్షసాధిపతి యైన మహిషాసురునకును జరిగినయుద్ధము 193

(2) బ్రహ్మేంద్రాది దేవతలు ఓడిపోయి శివమాధవులతో మహిషాసురవధో పాయము చింతింపదగినదని ప్రార్థించుట 195

(3) శివమాధవబ్రహ్మ దేవులముఖములనుండి అనిర్వాచ్య మైన తేజస్సుతో మహాలక్ష్మి దేవీరూపమున ఉద్భవించుట 196

(4) దేవతల తేజస్సులచే అమ్మవారి సర్వావయవములు నేర్పడుట. సర్వాభరణ ములు, సర్వాయుధములు దేవతలు అమ్మవారికి సమర్పించుట 197

(5) ఆమహాలక్ష్మి మహిషాసురుని యుద్ధమున సంహారించుట 204

(6) దేవతలు సంతోషముచే పులకాంకితసుందరశరీరులై శిరస్సులువంచి సాష్టాంగదండప్రణామము లొనర్చి, పూజలు చేసి అమ్మవారిని స్తోత్రముల చేయుట 206

(7) జగద్ధాత్రియైన దేవి మహానందమునొంది దేవతలయభీష్టములను కోరుకొనుడని చెప్పగా, దేవతలు వరముల నడుగుట; దేవి వరముల నిచ్చుట 219

109. తృతీయచరిత్ర 222

(1) బ్రహ్మేంద్రాది సమస్తదేవతలు శుంభనిశుంభులయుద్ధమున నోడి, వెళ్ళగొట్టబడి, సామాన్యమనుష్యరూపములతో భారతభూమియందు సంచరించుచు, పర్వతరాజైనహిమవత్పర్వతమువద్దకు వెళ్ళి, అక్కడ విష్ణుమాయా భగవతీదేవినిగూర్చి స్తోత్రములుచేయుట (7వ శ్లోకము ప్రారంభము) 225

(2) పార్వతీశరీరమునుండి ఒక తేజస్సుద్భవించి తొలుత అంబికయనుపేర బరగి, పిదప సర్వలోకములందు కౌశికి యని పిలువబడు అమ్మవారిచరిత్రప్రారంభము (39 వ శ్లోకము ప్రారంభము) 229

(3) శుంభనిశుంభరాక్షసులభృత్యులు, చండముండు లనువారు ఆకౌశికి అమ్మవారిని చూచి, విభ్రాంతులై ఆమెనువర్ణించి, మీయుభయులలో నొకరు ఆమెనువివాహము చేసికొనుమని బోధించుట 232

(4) మహాసురుడైనసుగ్రీవుని దూతగా దేవీసన్నిధికి పంపుట (హీరిసంభాషణ) 236

(5) ధూమ్రలోచను డనురాక్షససేనాధిపతిని అమ్మవారితలవెండ్రుకలు పట్టి యీడ్చుకొనిరమ్మని శుంభుడుపంపగా, వాడు ఆమె శిరోజములను పట్టుకొనుటకు పరుగెత్తగా అమ్మవారు కోపించి హుంకారముచేయగనే భస్మమగుట 244
(6) చండముండాది రాక్షసులు శుంభుని ఆజ్ఞప్రకారము అమ్మవారిని పట్టుకొనుటకు సమీపమునకు వెళ్ళగా అమ్మవారికి కోపమువచ్చుటచే అమ్మవారి నొసటనుండి కాళికాదేవి పుట్టి యుద్ధమున వారలశిరస్సులను ఛేదించి అమ్మవారిపాదములయం దుంచి నమస్కరించుట 247
(7) కాళికి అమ్మవారితో రక్తబీజుడు యుద్ధము చేసి మడియుట 251
(8) శుంభనిశుంభులు అమ్మవారితో యుద్ధముచేసి మడియుట 255
(9) శుంభనిశుంభులను అమ్మవారు సంహరించుటచే సంతోషముతో దేవతలు దేవిని స్తోత్రముచేయుట
(10) దేవి తనభవిష్యజ్జన్మలవృత్తాంతము చెప్పుట 277
(11) దేవి దేవతలకొరకును, మనుష్యులకొరకును వరదాభయహస్తములను ప్రసాదించుటచే దేవతలు పూర్వమువలె సర్వాధికారములను పొందుట 281

110. చతుర్థచరిత్ర

(1) సురథుడను రాజు, సమాధి యను వైశ్యుడు-రాజ్య, ధనభ్రష్టులై, మేధో నామక ద్విజఋషివర్యు ఆశ్రమము చేరి - వారివలన దేవీప్రభావమును, మహిమను వినుట 294

(2) ఆఋషిచే ఆజ్ఞాపించబడి వారిద్దరు ఆదేవి నారాధించగా దేవి ప్రత్యక్షమై, ఉత్తరజన్మయందుసురథరాజు మన్వంతరాధిపతియు, సమాధి యను వైశ్యుడు కేవలమోక్షమును పొందునట్లును వరమిచ్చుట 312

111. పంచమచరిత్ర

(1) ధర్మరాజువారు విరాటనగరప్రవేశము చేయుటకుముందు కష్టములను దాటుటకు యుద్ధమున జయము కలుగుటకు చేయుదుర్గాస్తవము 314

(2) అమ్మవారు ప్రత్యక్షమై నీవు కౌరవసేనావాహినినంతను సంహరించి, నిష్కంటకమైనరాజ్యమును, సుఖములను ననుభవింతువనియు, అట్లే తన్ను పూజించు మనుష్యులకును సుఖములు కల్గుననియు వరప్రదానముచేయుట 323

112. బాలాత్రిపురసుందరీధ్యానము 327
113. లలితామహాలక్ష్మీధ్యానమ్ 327

☞ ఇందు శ్రీచక్ర, మహాలక్ష్మి, చింతామణిగృహ, కామాక్షీ, దేవీ, గ్రంథకర్తల కలరుఫోటోలు గలవు.

ఈ గ్రంథముద్రణమునకు, కాగితమునకు, ద్రవ్యము సమర్పించిన మహాలక్ష్మీపరమానుగ్రహపాత్రములు, గుంటూరువాస్తవ్యులు నగు పుణ్య స్త్రీ పురుషుల పేర్లు.

1. మహారాజశ్రీ చక్కా సుబ్బారావుగారు, ఐరన్ మర్చంటు, బ్రాడీపేట—
ప్రింటింగు పేపరు, ఆర్టుపేపరు మొత్తము.
2. శ్రీమతి కంచర్ల భుజలక్ష్మమ్మగారు, బొంబాయిమేడ, అరండల్ పేట—
ముద్రణవ్యయము మొత్తము.

బ్లాకులు, బైండింగు మున్నగువానికొఱకు:—

3. మహారాజశ్రీ దేసు వెంకయ్యగారు, వేరుశనగఫ్యాక్టరీ, కొత్తపేట రు 150/-
4. మహారాజశ్రీ మానికొండ లక్ష్మణరావుగారు, ఆడిటర్, అరండల్ పేట రు 116/-
5. మహారాజశ్రీ శనగవరపు చలపతిరావుగారు, క్లాత్ మర్చంటు, బట్టలబజారు రు 116/-
6. సౌభాగ్యవతి రూపాకుల సరోజినమ్మగారు, (డాక్టరు ఆంజనేయులుగారి భార్య)
బ్రాడీపేట రు 116/-
7. శ్రీమతి మాజేటి అన్నపూర్ణమ్మగారు, అరండల్ పేట రు 100/-
8. శ్రీమతి మాజేటి వెంకటసుబ్బమ్మగారు, బ్రాడీపేట రు 50/-

# (1) పూజ చేయు పద్ధతులు

1. మూడు గంటల పూజ – ఈ కల్పప్రకారము చేయుపూజకు మహాయాగమని పేరు. (మహాయాగక్రమారాధ్యా యని ప్రమాణము) ఇట్లు సమగ్రముగ పూజచేయవలయునని యున్నది. సమగ్రముగ పూజచేయుటకు మూడుగంటలు పట్టును. దేవీనవరాత్రములయందు తొమ్మిది దినములు సమగ్రముగ చేయుట మంచిది. ఆపత్కాలములందు యుద్ధసమయములందు చేసినను, చేయించినను తప్పక జయములు సిద్ధించుననుటకు ఇందలిచరిత్రతే ప్రమాణములు. పూజానంతరము చరిత్రలతోగూడ నిత్యము కొంచెము కొంచెమైన పారాయణచేసికొనవచ్చును. ఉదయము కొంత పూజ మధ్యాహ్నము కొంతపూజ సాయంకాలము కొంతపూజ విభజించి చేసికొనవచ్చును. ఇట్లు చేయుటకు త్రైకాలికార్చన యని పేరు. సర్వదేవతలను ఒక్కపర్యాయమే పూజచేయవలెనని నిర్బంధము లేదు.

2. గంట పూజ – సంకల్పముచేసి, నవావరణార్చన (నం 83) (పేజి 100 – 123) చేసి షోడశోపచారపూజతో సమాప్తిచేయుట. పండుగాని, గుడశర్కరాదులుగాని నివేదన చాల్లును.

3. అరగంట పూజ – సంకల్పముతో నిమిత్తము లేకుండ చతుష్షష్ట్యుపచారపూజ

(నెం 50) (పేజి 57 – 59) 'చతుష్షష్ట్యుపచారాఢ్యా' అని లలితాసహస్రనామము ప్రమాణము.) చేసి ధూప దీప నివేదనలతో సమాప్తి. (పండుగాని, గుడశర్కరాదులుగాని నివేదన చాలును)

4. 15 నిమిషముల పూజ – సంకల్పముతో నిమిత్తము లేకుండ (నె 63 రు) పంచ పంచికామహాలక్ష్మిపూజ (పేజి 72 – 76) చేసి యథాశక్తి పండుగాని గుడ శర్కరాదులుగాని నివేదన చేసిన చాలును.

5. ఐదు నిమిషముల పూజ – సంకల్పముతో నిమిత్తము లేకుండ ఒక్క చాముండా దేవీపూజ చాలును. (నెం 65 రు) (పేజి 77 – 78) పండుగాని గుడశర్కరాదులుగాని నివేదన చాలును.

6. ఈపుస్తకమున సూచింపబడిన పూజావిధులలో తన కిష్టమైన దేవతాపూజ నొక్కదానినైన చేయవచ్చును, లేదా నిత్యము కొక్కటిచొప్పునను చేయవచ్చును. (ఇతరులెవరిచేతనైనను చేయించుకొనవచ్చును) (భార్యాపుత్రాదులును చేయవచ్చును) 3-4-5 నెంబరుపూజలను భావనాప్రధానముగా చేయవచ్చును – 'భావనామాత్రసంతుష్టా' అని లలితాసహస్రనామము ప్రమాణము.

## (2) పారాయణ చేయు పద్ధతులు

1. ఈ పారాయణకు అర్గళ కవచ కీలకాదులు చేయవలసినపని లేదు. అమ్మవారే

సప్తశతియందు కంఠరవమున 3వ చరిత్రలో తనచరిత్రను పారాయణచేయుమని చెప్పియున్నది. సురథరాజు, సమాధి యనువైశ్యుడు కేవలము దుర్గాదేవీసూక్తపారాయణ మొనర్చినట్లు 4వ చరిత్రయందు గలదు. దుర్గాదేవీసూక్తము (నెం 99 రు) (166 - 167) అయిదవచరిత్రలో గూడ ధర్మరాజు కేవలము దుర్గాదేవీస్తవమే చేసి కృతకృత్యుడైనట్లు తెల్పబడినది.

2. సప్తశతి సాంతము అన్ని అధ్యాయములు పారాయణచేయవలయునని నియమ మెక్కడను లేదు. ఇందుగల ద్వితీయచరిత్ర (నె 57 రు) శ్లోకములో 'భగవతీదుర్గా' అని స్మరించినమాత్రముననే సమస్తాపదలను దారిద్ర్యదుఃఖమును నశింపజేసి సర్వశుభముల నొసంగుచున్నావని దేవతలు ధ్యానించియున్నారు. అట్లు అమ్మవారు వర మిచ్చియున్నదని దేవతలు శుంభనిశుంభులవలన కల్గిన ఆపత్తును తొలగించుకొనుటకు ధ్యానము చేసినట్లు మూడవచరిత్ర చాటుచున్నది. అందుచే సురథసమాధులచరిత్ర ప్రత్యేకము విడదీసి 4వ చరిత్రగా వ్రాయబడినది. మఱియు అన్ని చరిత్రలు, అందరు దేవతలపూజలు ఒకేపర్యాయము చేయుమని యెక్కడను చెప్పియుండలేదు. ప్రతిదినము కొన్నిశ్లోకములు చొప్పున పారాయణ చేసినను చేయవచ్చును.

3. వేదములయందు గలమంత్రములన్నియు ఒకేపనికి ఉపయోగపడుట కుద్దేశింపబడి యుండలేదు.

కొన్ని యజ్ఞములకొరకు, కొన్ని స్మార్తకర్మలకొరకు, కొన్ని నిత్యకర్మలకొరకు అందును క్రమభేదము ననుసరించి ఉపయోగించుకొనుటకు ఉద్దేశింపబడియున్నవి. కొన్ని యెక్కడను ఉపయోగపడని మంత్రములు అక్కడ నిల్చియున్నవి. ఈచరిత్రలయందు విషయప్రాధాన్యము లేని సంకులయుద్ధచరిత్రలను వదలి దేవీమహిమ ప్రధానములగువానియాలయము తాత్పర్యము వ్రాయబడియున్నది. కనుక సమయావసరకార్యముల ననుసరించి పూజాపారాయణలు చేసికొనిన నెట్టిదోషములు లేవని శివ చరిత్రయందు శ్లో॥ ఏభిః స్తవైశ్చ మాం నిత్యం స్తోష్యతే యః సమాహితః తస్యాహం సకలాం బాధాం శమయిష్యా మ్యసంశయః - శ్లో॥ జానతాజానతావాపి బలిపూజాం తథా కృతాం ప్రతీక్షిష్యా మ్యహంప్రీత్యా వహ్నిహోమం తథా కృతం ॥ అని అమ్మవారె చెప్పియున్నందున విధినియమాదుల పాటించుటే ప్రధానమని తలపక స్వస్థచిత్తముతో నిశ్చయముగ పూజాపారాయణములు చేసికొని సర్వులు లక్ష్మీదేవ్యనుగ్రహ పాత్రులు కావచ్చుననుట కెట్టిసందేహము లేదు. కనుక వారివారిశక్తి భక్తి ప్రసక్తులనుబట్టి వారు పూజాపారాయణచేసికొనవచ్చును. యథాప్రకారము సప్తశతి పారాయణ చేసికొనదలచినవా రట్లు చేసికొనవచ్చును. ఈదేవీపూజాభిషేక పారాయణలకన్న గొప్పది నభూతో నభవిష్యతి. స్వయముగ చేసికొనలేనివారు తగినవారిచే

చేయించుకొనవచ్చును. స్త్రీ పురుష వర్ణజాతిభేదము లేక దేవీపంచావతార చరిత్రలను పారాయణ చేయవచ్చును. మూలశ్లోకముల పఠింపజాలనిచో తాత్పర్యము పారాయణము చేసికొనవచ్చును.

## (3) ఇహ జన్మపూర్వజన్మకృత గ్రహాదిసర్వదోషశాంతికి

తృతీయచరిత్రలో అమ్మవారు స్వయముగా నిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ శాంతి కర్మణి సర్వత్ర తథా దుఃస్వప్నదర్శనే
గ్రహపీడాసు చోగ్రాసు మాహాత్మ్యం శృణుయాన్మమ॥

ఈ పూజాపారాయణముల చేసినచో శాంతికమలాకరాది గ్రంథములయందు చెప్పబడిన విభిన్నానేకశాంతులతో నిమిత్తము లేకుండ సర్వదోషములు శాంతిజెందుననియు, భయంకరమైన నవగ్రహ, నక్షత్రగ్రహాది సర్వగ్రహదోషములు నివర్తించుననియు దేవి స్వయముగా పరమానుగ్రహమున శ్లో॥ ఉపసర్గాః శమం యాన్తి గ్రహపీడాశ్చ దారుణాః శాంతికర్మణి సర్వత్ర తథాదుఃస్వప్నదర్శనే ; అనియు ౧౨వ చరిత్రయందు 211, 212 శ్లోకములు చాటుచున్నందున ఇతరజపహోమాది శాంతులు చేయుటకన్న ఈపూజాపారాయణ గావించిన సర్వశాంతుల

లాభమును పొందవచ్చును. అందువలన ఈపూజాపారాయణ విధానము ఇక్కలి ప్రధాన మైయున్నది. దుస్వప్న నవగ్రహాది దోషములు సర్వము శాంతించుటయేగాక సుస్వప్న నవగ్రహా ఏకాదశస్థానస్థితి ఫలములును ప్రాప్తించును.

## (4) భూత గ్రహ దోష శాంతికి

ఇందలి (3) తృతీయచరిత్రలో శ్లో॥ దుర్వృత్తానా మశేషాణాం బలహానికరం పరం రక్షోభూతపిశాచానాం పఠనాదేవ నాశనమ్ ॥ రాక్షస, భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షసాది భూతములు. నాపూజాపారాయణలవలన నశించునని అమ్మవారు చెప్పియున్నందున 3వ చరిత్ర పారాయణయు, గ్రంథమునందలి (నెం 65, 66, 67 శ్లో) (పేజి 77 - 81) చాముండాచండీ నవదుర్గావతారపూజ చేసి నిత్యము నెం65 రు 21 యిరువదియొక్క పర్యాయము, జపముచేసిన శాంతించును.

## (5) బాలగ్రహాది శాంతికి

3వ చరిత్రలోనే శ్లో॥ బాలగ్రహాభిభూతానాం బాలానాం శాంతికారకమ్ - బాలగ్రహాముల

బాధయు, భయపడినను, దృష్టిదోషాదులచే క్షీణించుచున్నను నె 65 రు చాముండాదేవి పూజ 21 పర్యాయములు లేక 9–5–3 పర్యాయములు జపించి, విభూతి మంత్రించి యిచ్చిన శాంతించును. తీవ్రదోష మున్న యెడల 3వ చరిత్ర పారాయణచేసి తీర్థము నిచ్చిన శాంతించును.

**(5) నవగ్రహములు చాలనప్పుడు తద్దోష నివృత్తిద్వారా ఏకాదశస్థానస్థితశుభఫలప్రాప్తికి**

1. బృహస్పతి గ్రహమునకు:– నె 83 రు నవావరణార్చనలోని ప్రథమావరణార్చన, లేక పారాయణ. నె 109 రు తృతీయచరిత్ర పారాయణచేయవలయును.
2. అంగారక గ్రహమునకు :– నె 83/2 ద్వితీయావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయ చరిత్ర పారాయణ చేయవలయును.
3. శుక్ర గ్రహమునకు :– నె 83/3 రు తృతీయావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయచరిత్ర పారాయణచేయవలయును.
4. చంద్ర గ్రహమునకు :– నె 83/4 రు చతుర్థావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయచరిత్ర పారాయణ చేయవలయును.

5. శనైశ్చరగ్రహమునకు :- నె 83/5 పంచమావరణార్చన లేక పారాయణ. నె109 రు తృతీయచరిత్ర పారాయణ.

6. సూర్యగ్రహమునకు :- నె 83/6 షష్ఠావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయ చరిత్ర పారాయణ

7. బుధగ్రహమునకు :- నె 83/7 సప్తమావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయచరిత్ర పారాయణ.

8. కేతుగ్రహమునకు :- నె 83/8 అష్టమావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయచరిత్రపారాయణ.

9. రాహుగ్రహమునకు :- నె 83/9 రు నవమావరణార్చన లేక పారాయణ. నె 109 రు తృతీయచరిత్ర పారాయణ మరియు నె 46 రు దేవ్యుపనిషత్పారాయణ. నె 99 రు లోని దుర్గాదేవి సూక్తపారాయణగాని చేయుట విశేషము. ఏగ్రహము చాలనివారు ఆగ్రహావరణార్చన చేసికొనిగాని చేయించిగాని గ్రహానుగ్రహమును బడయవచ్చును. ఆ ఆవరణమంత్రములు జపమును చేసికొనవలెను. తృతీయచరిత్ర పారాయణ ప్రతిగ్రహశాంతికి చేయుట మిక్కిలి విశేషము.

గ్రహనక్షత్రరూపిణ్యై-గ్రహోపద్రవనాశిన్యై సూర్యచంద్రాగ్నిరూపాయై అని లక్ష్మీసహస్రనామము ప్రమాణము (వేదము నక్షత్రాణిరూపం.)

## (7) దారిద్ర్య బాధా నివృత్తికి - ధనప్రాప్తికి

1. నిత్యము నె 83/9 నవమావరణార్చన, శతాక్షరీమహాలక్ష్మీమంత్రము యథాశక్తి జపము చేసికొనవలయును. 108 మార్లు చేసికొనుట మంచిది.

2. ద్వితీయచరిత్రలోని నె57రు శ్లోకము యథాశక్తి చేతనయినన్నిసార్లు పఠించ వలయును.

3. నె63రు పంచపంచకమహాలక్ష్మి 25 అవతారమంత్రములపూజ లేక నిత్యపారాయణ శ్రేష్ఠము. ఇది తప్పక నిత్య మొకసారియైన పారాయణచేయుట.మంచిది. స్త్రీలుగూడ నె 63 రు పారాయణచేసికొనవలయును. (అవకాశమున్న నె83రు నవావరణార్చన చేయుటమంచిది.)

## (8) స్త్రీలకు సర్వసౌభాగ్యప్రాప్తికి యోగ్యుడగుభర్త లభించుటకు పురుషులకు సర్వ లక్షణ సంపన్న యగు సాధ్వి, భార్య లభించుటకు.

1. నె84రు సర్వసౌభాగ్యసిద్ధిప్రదధ్యానము నిత్యము పారాయణచేసికొనిన సౌభాగ్యవంతులుగనే

యుండును. వివాహం కానివారికి మంచిసంబంధము, ధనవంతుడు యోగ్యుడైనభర్త భార్య లభించును.
స్త్రీలు 'హ్రీం శివాయైనమః' అనుగౌరీ పంచాక్షరీ మంత్రజపము యథాశక్తి నిత్యము చేసికొనవలెను.

2. నెం13 లోని నాలుగవ ఆవరణ సర్వసౌభాగ్యదాయకచక్రార్చన లేక పారాయణ చేసికొనుచుండుట స్త్రీలకు కన్యలకు బ్రహ్మచారులకు శ్రేయస్కరము.

3. ధనవంతుడైనభర్త లభించవలయునన్నను భర్త ధనవంతుడు కావలయునన్నను నె 63 రు పంచ పంచక మహాలక్ష్మీపూజ లేక పారాయణయు చేసికొనవలెను.

4. అనుకూలదాంపత్యమునకు నె65రు చాముండా దేవీపూజ లేక పారాయణ నిత్యము 21, లేక 11, లేక మూడుపర్యాయములు చేసికొనవలయును. స్త్రీపురుషులు చేసికొనవచ్చును.

5. నె83/9 శతాక్షరీమంత్రజపము చేసికొనినవారికి సువర్ణాభరణములు విస్తారము లభించును.

## (9) ఉద్యోగ రాజకీయ సర్వకార్యసిద్ధికి

1. దేవీద్వితీయచరిత్రలోని 57వ శ్లోకము యథాశక్తి జపము, నె83/5 సర్వార్థసాధకచక్ర ఆవరణపూజ లేక పారాయణ, నె 65 రు చాముండాపూజ పారాయణ నిత్యము 21 మార్లు చేసికొనుట మంచిది; లేక యథాశక్తి చేసికొనవలయును.

2. సర్వకార్యసాధనకు వెళ్ళునప్పుడు పఠించి వెళ్ళవలయును. అక్కడే ఫలశ్రుతియున్నది చూడుడు. నెం66రు గూడ పారాయణచేయుట మంచిది.

## (10) సర్వరోగనివారణకు

నె 83/6, 83/7 సర్వరక్షకరచక్ర, సర్వరోగహరిషష్ఠ సప్తమావరణార్చన లేక పారాయణ దేవీతృతీయచరిత్ర పారాయణ, మరియు నెం65రు చాముండాదేవీపూజా లేక పారాయణ; 2వ చరిత్రలోని నెం57వ శ్లోకమును పఠించుడు. యథాశక్తి జపముచేసికొనవలయును. 3వ చరిత్రయందు దేవతలిట్లు ధ్యానము, చేసియున్నారు. శ్లో॥ రోగా నశేషా నపహంసి తుష్టా, అని. ఓదేవీ! నీవు ప్రసన్నురాలవయిన సర్వరోగములను హరింపచేయుచున్నావు (సర్వరోగములన శారీరక మానసిక దుఃఖములు.)

## (11) మహామారి, స్ఫోటకాదులు, కలరా మున్నగువ్యాధుల నివారణకు

1. ఇందలి తృతీయ చరిత్రలోనే శ్లో॥ ఉపసర్గా నశేషాంస్తు మహామారీసముద్భవాన్॥ తథాత్రివిధ ముత్పాతం మాహాత్మ్యం శమయే న్మమ॥ మహామారీ స్ఫోటకాది ఉపద్రవములు కలరా

మొదలగు వ్యాధులు. త్రివిధసంతాపములు (1) ఆధ్యాత్మిక (2) ఆధిభౌతిక, (3) ఆధిదైవికాది సంతాపములను నామమాహాత్మ్యపారాయణము నివారింపజేయును.

2. అట్టియుపద్రవాదులు గ్రామములకు కుటుంబములకు సంభవించినపుడు నె62కు కాళీ పూజ నె65కు చాముండా, నె66కు చండీ, నె67కు నవదుర్గావతారపూజ చేయవలయును, లేక పారాయణ చేయవలయును.

3. నె65కు పూజ పారాయణ ఎక్కువగా చేయవలయును. మూడవచరిత్ర పారాయణ చేయవలయును. పైశ్లోకము యథాశక్తిజపము చేయవలయును.

4. దేవాలయములందు గ్రామస్థులందరు కలిసి చేయించుట మంచిది.

5. యథాశక్తి ప్రతిగృహమున చేసికొనిన ఆయింటివారి కివి సంభవించవు.

ఆధ్యాత్మికదుఃఖములు = సర్వేంద్రియములవలన దేహములకు సంభవించుజ్వరాదులు.

ఆధిభౌతికదుఃఖములు = సింహ,వ్యాఘ్ర,సర్పాదులవలన సంభవించునవి.

ఆధిదైవికములు = గాలివాన, పిడుగు, గర్జనాగ్నిత్యాదులవలన సంభవించునవి.

## (12) దారిద్ర్యాన్నక్షామాదినివారణకు

1. తృతీయచరిత్ర శ్లో॥ తతోహ మఖిలం లోక మాత్మదేహసముద్భవైః॥ భరిష్యామి సురాః

శ్శాకై రావృష్టేః ప్రాణధారకైః ॥ దేవతలారా! పూర్వము వర్షము లేక అఖిలలోకముల యందు అన్నక్షామము సంభవించినప్పుడు వర్షములు కురిసి పంటపండువరకును ప్రాణములు నిలుచుటకు తగినశాకములను నా దేహమున పుట్టించి యిచ్చి అఖిలలోకములను రక్షించితినని దేవి యెరింగించినది గనుక నీశ్లోకమును జపము చేయవలయును.

2. నె6రు పంచపంచక మహాలక్ష్మీపూజలోని 20 నెంబరు అన్నపూర్ణామహాలక్ష్మీమంత్రము జపము చేయవలయును.

3. మూడవచరిత్రలో శ్లో॥ సర్వబాధావినిర్ముక్తో ధనధాన్యసుతాన్వితః। మనుష్యో మత్ప్రసాదేన భవిష్యతి న సంశయః॥ అని దేవి చెప్పియున్నందున నీశ్లోకమును జపముచేయవలయును.

4. నె48రు మహాలక్ష్మీఉపనిషత్పారాయణ చేయవలయును.

5. నె99రు మంత్రపుష్పములోని శ్రుతి - గావో హిరణ్యం ధన మన్నపానగ్ం సర్వేషాంగ్ శ్రియై స్వాహా - ఈమంత్రము నిత్యము 108నార్లు చేసిన శీఘ్రఫల మిచ్చును.

## (13) సర్వబాధానివృత్తికి

1. తృతీయచరిత్ర శ్లో॥ ఏభిః స్తవైశ్చ మాం నిత్యం స్తోష్యతే యః సమాహితః। తస్యాహం స

కలాం బాధాం శమయిష్యా మ్యసంశయః॥ ఏమనుజుడు భక్తి శ్రద్ధలతో నిత్యము నాయీపూజా స్తోత్రములచే స్తుతించునో వానిసకలబాధలను నేను నిస్సందేహముగా పోగొట్టుచున్నానని దేవి అభయహస్త మొసగుచున్నది. కాన పైశ్లోకమును యథాశక్తి జపము చేయవలయును.

2. నె84రు సర్వసౌభాగ్యసిద్ధిప్రదస్తోత్రపారాయణయు చేయవలయును. నె 65, 66, 67 ర్లు పూజలు లేక పారాయణ బాధలు నివర్తించువరకు నిత్యము చేయవలయును.

## (14) వ్యాపారలాభాభివృద్ధికి

1. నె83రు నవావరణార్చనలోని ద్వితీయచతుర్థపంచమావరణార్చనలు లేక పారాయణచేయవలెను.
2. నె99రు మంత్రపుష్పములోని మంత్రః - గావో హిరణ్యం ధన మన్నపానగ్ం సర్వేషాగ్ం శ్రియైస్వాహా అనుమంత్రము నిత్యము యథాశక్తి జపముచేసికొనవలయును.
3. నె63రు పంచపంచకమహాలక్ష్మీపూజ లేక పారాయణ యైనను చేసికొనవలయును.
4. వ్యాపారస్తులకు అమ్మకము హెచ్చుగ జరుగుటకు నె65,66రు చాముండాచండీపూజ లేక పారాయణ, నె48రు మహాలక్ష్మి ఉపనిషత్పారాయణ, వ్యాపారస్థలమునందు నిత్యము ఉదయము పారాయణచేసికొనుట,చేయించుకొనుటచే వ్యాపారము హెచ్చయి విశేషలాభము కల్గును.

## (15) గర్భిణీస్త్రీలసుఖప్రసూతికి

(ప్రమాణము మహావిద్య)

1. మంత్రః ॥ ఆం హ్రీం క్రోం హిమవత్యుత్తరే పార్శ్వే చపలానామ యక్షిణీ తస్యా నూపురశబ్దేన విశీర్ణా భవ (మమ) (తవ) గర్భిణీ – (సొంతముగా చేసికొనునప్పుడు "మమ" అని చెప్పుకొనవలెను.)
2. మహావిద్యయందు గల యీమంత్రమును నొప్పులు కనిపించిన వెంటనే ప్రారంభించి, 21 పర్యాయములు జపము చేసికొనవలయును.
3. ఇతరులును కాలుసేతులు కడుగుకొని వాడనినీరు ఒకగ్లాసులోనికి తీసికొని పైమంత్రము 21 సార్లు పఠించి, ఆశీర్వము నీయనచ్చును. లేక విభూతి మంత్రించి ఉదకమునందు వేసి యివ్వవచ్చును.
4. ఎక్కువబాధపడుచున్న 108సార్లు మంత్రించియిచ్చిన శీఘ్రముగా ఉపయోగపడును.

## (16) జ్వరములకు

(ప్రమాణము మహావిద్య)

1. ఆం హ్రీం క్రోం జ్వరపురుషాయ నమః ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక

పంచాహిక వాత పిత్త శ్లేష్మ సాన్నిపాతికాదిసకలజ్వరాన్ ఛింధి ఛింధి.

2. త్రిపాద్భస్మప్రహరణ త్రిశిఖారక్తలోచనః స మే ప్రీతిం సుఖం దద్యాత్సర్వామయపతిర్జ్వరః.

3. భస్మాయుధాయ విద్మహే తీక్ష్ణదంష్ట్రాయ ధీమహి తన్నో జ్వరః ప్రచోదయాత్, పైమంత్రాదులతో జపముచేసికొనవలెను లేక ఇతరులచేత చేయించి తీర్థముపుచ్చుకొనవలయును. మూడవ మంత్రముతో విభూతిని మంత్రించి యిచ్చిన సామాన్యజ్వరములు నివర్తించును.

4. నె83రు లోని సప్తమ సర్వరోగహరచక్రార్చన చేసికొనవలెను. లేక యథాశక్తి పారాయణ చేసికొనవలయును.

5. నె109రు దేవీతృతీయచరిత్ర పారాయణచేసికొనుటయు మంచిది.

## (17) సర్వశూలలనివృత్తికి

(ప్రమాణము మహావిద్య,

1. ఆం హ్రీం క్రోం నమో భగవతే శూలినే శిరశ్శూల అక్షిశూల కర్ణశూల ముఖశూల కంఠశూల హృదయశూల యోనిశూల లింగశూల గుదశూల పాదశూలాది సర్వశూలానాం

విస్ఫోటక ప్రభంజనీం స్వాహా. ఆం హ్రీం క్రోం నమో భగవతే దృష్టిశూలాం, ముష్టిశూలాం, పార్శ్వశూలాం నివారయ నివారయానంగాయ హుం ఫట్ స్వాహా. ఈ మంత్రమును కొన్ని పర్యాయములు యథాశక్తి జపముచేసికొనుచు, నొప్పి యుండుస్థలమునందు పై మంత్రములు చెప్పుకొనుచు చేతితో విభూతితో రాచుకొనుచుండిన సర్వశూలలు నివర్తించును. ఎక్కువగా నున్న 108 మార్లు జపము చేసికొనవలయును. మఱియు నె 65 రు చాముండాదేవీమంత్రము 3, 5, 7, 9 పర్యాయములు ...ంచుచు విభూతిని రాచుకొనిన శ్రేష్ఠము. శీఘ్రముగా తగ్గుచు.

## (18) విద్యార్థులు మేధావంతులు, ప్రజ్ఞావంతులు, విద్యావంతులై పరీక్షలలో విజయ మొందుటకు

1) ఆం హ్రీం క్రోం నమో భగవతే దక్షిణామూర్తయే-మహ్యాం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా—యథాశక్తి నిత్యము జపముచేసికొనిన మేధ, ప్రజ్ఞ అభివృద్ధి యగును. నె 3 రు రాజరాజేశ్వరీశ్లోకమును ధ్యానము చేయవలెను. ('దక్షిణామూర్తిరూపిణీ' అని ప్రమాణము) అమ్మవారే దక్షిణామూర్త్యవతారము.

2) ఆం హ్రీం క్రోం నమో భగవతే సర్వవిద్యాప్రదాయ హయగ్రీవాయ హుం ఫట్ స్వాహా. యథాశక్తి జపము చేసికొనవలెను.

3)

3) నె 64 రు సరస్వతీపూజ లేక నిత్యము పారాయణ లేక జపము చేసికొనవలయును.

4) పరీక్షలో ప్యాసగుటకు నలువదిదినములు ముందుగా నె 65 రు చాముండా దేవీపూజ లేక పారాయణ ఒక్కమారు నిత్యము చేసికొనుచు, పరీక్షకు వెళ్ళునాడు 21 పర్యాయములు పారాయణ చేసికొని వెళ్ళుట మంచిది; లేక యథాశక్తి చేసికొనియైన వెళ్ళవలయును.

5) పరీక్షలలో సరియైన సమాధానములు స్ఫురించుటకు, కష్టతరమైన ప్రశ్నాంశములు సులభముగా అర్థమగుటకు నె 66 రు చండీమంత్రము నిత్యము పారాయణ చేసికొనుడు. సమాధానము తోచనప్పుడు నె 66 రు చండీపూజామంత్రమును పఠించిన సరియైన సమాధానము స్ఫురించును. యథాశక్తి నిత్యము చేసికొనుచుండుట మంచిది.

## (19) సర్పదోష నివృత్తికి

1) గచ్ఛ గచ్ఛ తక్షక బ్రహ్మణే నమః అని అడవులయందు రాత్రికాలమునందు, బిగ్గరగా పఠించుచు వెళ్ళిన ఆశబ్దము వినినంతనే సర్పములు దూరముగా తొలగిపోవును. మినుములు మంత్రించి చల్లిన నిండ్లలోదూరిన సర్పములును బయటికి పోవును. తిరిగి అక్కడికి రావు.

(2) మంత్రః – నమో అస్తు సర్పేభ్యో యే కేచ పృథివీమను; యే అంతరిక్షే యే దివి తేభ్య స్సర్పేభ్యో నమః.

(3) మంత్రః—యే దోరోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషు; యే వా వటేషు శేరతే తేభ్య స్సర్పేభ్యో నమః.

(4) మంత్రః – యా ఇషవో యాతుధానానాం యే వా వనస్పతీగ్ంరను; యే వా వటేషు శేరతే తేభ్య స్సర్పేభ్యో నమః.

(5) పై 1, 2, 3, 4 మంత్రజపము చేసికొనవలయును. నె 83 రు లోని నవమావరణార్చన పూజ లేక పారాయణ చేసికొనవలయును. 3 వ చరిత్ర పారాయణ చేసికొనుట శ్రేష్ఠము. ఇట్లు చేసికొనిన ఎట్టి సర్పదోషమైనను పోవును.

## (20) అభిషేకము

(1) ఈ గ్రంథమునందు గల నె 36, 37, 38, 39, 40, 41, 42, 43 ర్లు అగ్ని, సూర్య, చంద్ర, బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ – కళలతో కలశమునందు ఆవాహన చేసిన నె 16 రు కలశారాధన యథావిధి చేసినట్లగును. సామాన్యదృష్టితో ధ్యానశ్లోకమును చదువుచున్నాముగాని యిట్లావాహన చేయుట లేదు. పై వానిని చతుష్షష్టికళావాహన యందురు. ఒక్క కళావాహనయేగాక ఆ దేవతల ఆత్మ అంతరాత్మ పరమాత్మల యావాహన గూడ నిందు చెప్పబడియున్నది. పై

యెనిమిది దేవతలు అనేక కోటి బ్రహ్మాండముల సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహకారణభూతులగుటచే పంచబ్రహ్మలనియు పేరు. ('పంచబ్రహ్మాసనాసీనా' అని ప్రమాణము.)

(2) మహాలక్ష్మి యీపంచబ్రహ్మలకు అధిష్ఠాత్రి యగు పరాశక్తి. ఆదేవి న స్త్రీ న పుమాన్', స్త్రీయును గాదు, పురుషుడును కాదు. కేవలమోక్షలక్ష్మియే యని యిందుగల నెంబరు త్రిపురోపనిషత్తు, నె 46 రు మహాలక్ష్మి ఉపనిషత్తు ప్రమాణమగుచున్నవి. మరియు నీమహాలక్ష్మి యథార్థస్వరూపము నె 81 రు మంత్రరాజార్చనలోని 8 మహావాక్యములు స్పష్టపరచును. ఉపనిషత్తులన వేదములకు శిరస్సని వేరుగా వ్రాయనక్కర లేదు. అందుచే కలశమునందు పైన చెప్పిన కళావాహన చేసిన ఉదకముతో కేవలమహాలక్ష్మికి చేయు అభిషేకము కన్న గొప్పఅభిషేకము న భూతో న భవిష్యతి; ఏలోకమునను లేదు. దీని ఫలము ఇట్టిది అట్టిది యని యెవరును నిరూపింపజాలరు. ఈ అభిషేకమువలన సమస్తైహికభోగములు లభించుటయేగాక, మోక్షముగూడ సిద్ధించుటలో నెట్టిసందేహము లేదని ఇందలి ఉపనిషత్తులే చాటుచున్నవి.

## (21) మహాయాగము

(1) ఈగ్రంథమునందు వ్రాయబడిన కల్పప్రకారము చేయుపూజకు మహాయాగమని పేరు. 'మహాయాగక్రమారాధ్యా' అని ప్రమాణము.

(2) సాధారణయజ్ఞాదుల కెక్కడను మహాయాగమని పేరు లేదు. అనగా యజ్ఞయాగాదులలోనికెల్ల గొప్పదని యర్థము — ఈయజ్ఞము దేవతలకును ముఖ్యమైనదని వారారాధించిరని 3 వ చరిత్రలో 35 శ్లోకము చాటుచున్నది.

శ్లో॥ స్తుతా సురైః పూర్వ మభీష్టసంశ్రయా
త్తథా సురేన్ద్రేణ దినేషు సేవితా।
కరోతు సా నః శుభహేతు రీశ్వరీ
శుభాని భద్రా, ణ్యభిహన్తు చాపదః.

అని దేవతలు స్తోత్రము చేసియున్నందున పరమప్రమాణము.

(3) ఇందుగల నాల్గు ఉపనిషదర్థ మిచ్చు యజ్ఞము వే రెందును లేదు.

(4) జీవితమునందు కనీస మొక్కపర్యాయమైనను ఈకల్పప్రకారము యాగముచేసిన సద్గతి తప్పక కలుగు ననుటకు లోగడి ఉపనిషత్తు ప్రమాణము. అట్లు 3 వ చరిత్రలో నె 217 రు శ్లోకమున అమ్మవారె చెప్పియున్నది. చూడుడు.

(5) ఈపూజకే చండీయాగమనియు దేవీయాగ మనియు పేర్లు. గ్రంథవిస్తరభీతిచే తద్విషయ మిందు విపులీకరించ లేదు.

## (22) పుణ్యలోకప్రాప్తికి

సర్వానందమయబైందవచక్రసహిత మగు నె 83 రు నవావరణార్చనయు, నె 68 రు శ్రీరాజరాజేశ్వరీపరాభట్టారికాంబార్చనయు గావించినచో మనుష్యానందము మొదలు బ్రహ్మానందమువరకు గల ఆనందములతో పుణ్యలోకప్రాప్తి గలుగును. వివరణము బృహదారణ్యతైత్తిరీయోపనిషత్తులందు గలదు. గ్రంథవిస్తరభీతిచే నిట వ్రాయుటలేదు.

## (23) కేవల మోక్షమునకు

నె 68 రు రాజరాజేశ్వరీఅర్చన, నె 83రు నవావరణార్చన, నె 81 రు మంత్రరాజార్చన లేక మహావాక్యార్చన, నె 45, 46, 47, 48, ఉపనిషత్పారాయణము గావించి, సాధనచతుష్టయసంపత్తి గల్గి, సద్గురుసన్నిధిని అర్థయుక్తముగా శ్రవణ, మనన, నిదిధ్యాసాదులుచేసి. అపరోక్షసిద్ధినొంది, బ్రహ్మనిష్ఠుడై ఉపరతి జెందిన, కేవలమోక్షము నొందదగును. ప్రమాణము, "సనకాదిసమారాధ్యా శివజ్ఞానప్రదాయినీ"—ఈదేవి నర్చించి సనకసనందనాదులు బ్రహ్మజ్ఞానులైనట్లు లలితాప్రమాణము చాటుచున్నది — అందుచే నిప్పటికిని, ఆచార్యపీఠస్థులు, యతులు, గృహస్థులు,

బ్రహ్మాచారులు పరాదేవి నర్చించుచున్నారు. ఇట్లు సంప్రదాయపరంపరగా వచ్చుచున్నది. శ్రీ శంకరాచార్యులవారు శారదాప్రతిష్ఠ చేసియుండుట లోకవిదితము.

ఈమహాదేవి కిట్టిశక్తి యింతమహిమ యుండుటచేతనే దేవమనుష్యులలో ఉత్తములారాధించుచున్నారు. మహాపాదుకాంతదీక్షాపరులును ఆరాధించుచున్నారు.

## (24) నె 83 రు నవావరణార్చనఫల వివరణము

(1) త్రైలోక్యమోహనచక్రార్చన – సర్వలోకవశీకరణమునకు–
(2) సర్వాశాపరిపూరకచక్రార్చన – సర్వాభీష్టములు సిద్ధించుటకు–
(3) సర్వసంక్షోభణచక్రార్చన – సర్వదుఃఖనివృత్తికి–
(4) సర్వసౌభాగ్యదాయక చక్రార్చన – సర్వసౌభాగ్యప్రాప్తికి–
(5) సర్వార్థసాధకచక్రార్చన — సర్వార్థసిద్ధికి — అనగా గోవులు, హిరణ్యము, అన్నపానాది సర్వైశ్వర్యములకు.
(6) సర్వరక్షాకరచక్రార్చన – సర్వవిధరక్షణలకు–
(7) సర్వరోగహరచక్రార్చన – సర్వరోగములు నివారించుటకు

(8) సర్వసిద్ధిప్రదచక్రార్చన – అణిమాద్యష్టసిద్ధులకు

(9) సర్వానందమయబైందవచక్రార్చన – మనుష్యలోకము మొదలు బ్రహ్మలోకము వరకు గలపుణ్యలోకములప్రాప్తికి –

## (25) నిత్య శుక్రవార పూజ

(1) ఈ గ్రంధమునందు గల శ్రీసూక్త, దేవీసప్తశతీశ్లోకసంపుటితో ధ్యానావాహనాది షోడశోపచారములు యథావిధి కావించుట.

(2) నె 63 రు పంచపంచకమహాలక్ష్మీ అవతారములు నె 63 రు పూజ ముఖ్యముగా చేయవలయును.

(3) నె 83 రు నవావరణార్చనలోని ఆవరణ పూజలలో యజమానునియభీష్టము ననుసరించి యేదైన నాచరించవచ్చును. శ్రావణమంగళవార, వరలక్ష్మీ, సత్యనారాయణాది పూజలయందును పై ప్రకార మాచరించుట ముఖ్యము.

(4) నె 86 రు లక్ష్మ్యష్టోత్తరశతనామపూజ.

(5) నె 84 రు సర్వసౌభాగ్యసిద్ధిప్రదధ్యానము.

(6) మంత్రపుష్పము (నె 99 రు సర్వము పఠించుట ముఖ్యము).

## (26) మహైశ్వర్యసంప్రాప్తికి

నె 2 రు స్వర్ణాకర్షణమహాలక్ష్మీధ్యానము చేసి, నె 83 రు నవావరణార్చన, శతాక్షరి నూరు బీజములమంత్రము, నిత్యము క్రమముగా అక్షరలక్ష జపము చేసి, తర్పణ, హోమములు, తత్తద్దశాంశము చేయుట, నిత్యము నె 48 రు మహాలక్ష్మీ ఉపనిషత్పారాయణ చేసిన తప్పక మహైశ్వర్యసంప్రాప్తి యగును. ఇహజన్మని, పూర్వజన్మని, పరజన్మని అని యున్నందున ఈజన్మయందు కోటీశ్వరుడు గాకపోయినను పరజన్మయందు తప్పక కోటీశ్వరు డగును. ఇందుకు నె 2 రు ధ్యానమే ప్రమాణము. 4 వ చరిత్రయందు సురథుడు ఉత్తరజన్మయందు మన్వంతరాధిపతి యైన ట్లున్నది.

## (27) రాజచోరాగ్ని సింహవ్యాఘ్రాది సర్వోపద్రవనివారణకు

(ప్రమాణము మహావిద్య)

ఓం హ్రీం క్రోం నమో భగవత్యై దుర్గాయై నమః — అచలం చల మాక్రమ్య మహావజ్రకవచాస్త్రాయ రాజ, చోర, సర్పసింహవ్యాఘ్రాగ్నిసర్వోపద్రవాన్ నాశయ నాశయ స్వాహా.

ఎట్టి ఉపద్రవము సంభవించినను పై మంత్రమును జపించుచుండిన అవియెల్ల నప్పుడే నివారణ యగును. నె 65 రు చాముండామంత్రమును పఠించుడు.

4)

## (28) సర్పవృశ్చికాదుల మహావిషనివారణకు

(ప్రమాణము మహావిద్య)

ఓం హ్రీం క్రోం గరుడాయ నమః—కాకకంకగృధ్రోలూకసర్పవృశ్చికాది మహావిషం క్షిప క్షిప నిర్విషం కురు కురు హుం ఫట్ స్వాహా. ఈ మంత్రమును నిత్యము జపముచేసిన వెంటనే ఫలము నిచ్చును. నె 65 రు చాముండామంత్రము పఠించుడు.

## (29) సర్వైశ్వర్యములకు

మంత్రః॥ గావో హిరణ్యం ధన మన్నపానగ్ం సర్వేషాగ్ం శ్రియై స్వాహా

పై మంత్రమును జపముచేయుచు దేవీతృతీయచరిత్రను నిత్యము పారాయణ చేయవలయును.

తాత్పర్యము = ఓ మహాలక్ష్మీ! నేను గావించిన నీపూజాపారాయణాదులచే నీవు సుప్రీతవై నాకు పుష్కలముగ గోవులు, బంగారము, ధనము, అన్నపానములు భోగ్యములగు సకల పదార్థములు గజాంతైశ్వర్యము అనుగ్రహించుము.

## (30) పురుషసంతానాద్యైశ్వర్యప్రాప్తికి

మంత్రః॥ శ్రీశ్చ లక్ష్మీశ్చ పుష్టిశ్చ కీర్తిం చానృణ్యతామ్। బ్రహ్మణ్యం బహుపుత్రతామ్ శ్రద్ధామేధే ప్రజ్ఞా తు జాతవేద స్సందధాతు స్వాహా-

ఈమంత్రమును జపముచేయుచు దేవీతృతీయచరిత్రను నిత్యము పారాయణ చేయవలయును.

తాత్పర్యము = సర్వవేద, వేదాంగ, శాఖాపురాణోత్పాదకురాలవగు ఓమహాలక్ష్మీ! నాకు రాజ్యలక్ష్మిని, మోక్షలక్ష్మిని, దేహారోగ్యమును. కీర్తిని, దేవ-ఋషి-పితృణవిముక్తిని, బ్రహ్మణ్యశ్రేష్ఠత్వమును, బహుపుత్రప్రాప్తిని, శ్రద్ధను, (ఆస్తిక్యబుద్ధిని) మేధను, (తెలివిని) కుశాగ్రబుద్ధి మున్నగువానిని నీవు అనుగ్రహించుము.

☞ ఈమంత్రమును విద్యార్థులు ముఖ్యముగా నిత్యము పఠించవలెను.

## (31) పుత్రికాద్యైశ్వర్యమునకు

మంత్రః॥ శ్రియంచ లక్ష్మీంచ పుష్టించ కీర్తిం చానృణ్యతామ్। బ్రహ్మణ్యం బహుపుత్రికామ్। శ్రద్ధామేధే ప్రజా స్సందధాతు స్వాహా.

తాత్పర్యము = ఓ మహాలక్ష్మీ! రాజ్యలక్ష్మిని, మోక్షలక్ష్మిని, శరీరారోగ్యమును త్రిలోకవిదితములగు సుగుణములు గలవాడనెడి కీర్తిని, దేవ, ఋషి, పితౄణవిముక్తిని, బ్రహ్మణ్యశ్రేష్ఠత్వమును, బహుపుత్రికల కలిగియుండుటను, శ్రద్ధామేధలను వీని నన్నింటిని అనుగ్రహించుము.

## (32) సంతాననిరోధమునకు

వేదమునందు ప్రక్రియ గలదుగాని; ఈ గ్రంథమునందు వ్రాయగూడదని దగుటచే వ్రాయలేదు. ఇంకను అనేక ప్రక్రియలు వేదమునందు గలవు, గ్రంథవిస్తరణభీతిచే వ్రాయలేదు.

## (33) యుద్ధదురాక్రమణాది భయనివృత్తితో సంపూర్ణవిజయసిద్ధికి

(1) ఈ కాలమునగాని, మఱియే కాలమునగాని ఎట్టి ప్రబలశత్రువులవలన నేని యుద్ధభయమేర్పడినను, దురాక్రమణాదిభయ మేర్పడినను మహాయాగక్రమమున అమ్మవారిపూజార్చనలు, చరిత్రపారాయణలు యోగ్యులచే విశేషముగ జరిపించి, వృథావ్యయప్రయాసలు, సైనికాదినాశములు లేకుండ సంపూర్ణవిజయమును బడయవచ్చును. స్వస్థితిలోగూడ దేశమున కెట్టియుపద్రవములు కలుగకుండుటకై నిత్యము సామాన్యపూజారాధనలు ఆయా రాష్ట్రములందలి సర్వదేవాలయములందును జరిపించుచుండవలెను.

(2) 3వ చరిత్రయందు

శ్లో॥ (201) శత్రుతో న భయం తస్య దస్యుతో వా న రాజతః
న శస్త్రానలతోయౌఘాత్ కదాచిత్ సంభవిష్యతి॥

శ్లో॥ (210) రిపవః సంక్షయం యాన్తి కల్యాణం చోపపద్యతే
నందతే చ కులం పుంసాం మాహాత్మ్యం మమ శృణ్వతామ్॥

శ్లో॥ (218) రక్షాం కరోతి భూతేభ్యో జన్మనాం కీర్తనం మమ
యుద్ధేషు చరితం యన్మే దుష్టదైత్యనిబర్హణమ్॥

శ్లో (223) పతత్సు చాపి శస్త్రేషు సఙ్గ్రామే భృశదారుణే
సర్వాబాధాసు ఘోరాసు వేదనాభ్యర్దితోఽపి వా॥

(నె. 224 శ్లోకమునుగూడ చూడుడు)

నాపూజాస్తోత్రాదులు చేసిన, చేయించిన శత్రువులవలనగాని దొంగలవలనగాని రాజులవలనగాని యెన్నటికి నెట్టిభయము గలుగదు. అంతియేగాక శస్త్రాస్త్ర, జలాగ్నులవలని భయముగూడ నెన్నటికిని గలుగదని 3వ చరిత్ర ధ్రువపరుచుచున్నది. ఈచరిత్రలలోని యుద్ధఘట్టములతో బోల్చుకొనిన

నిప్పటియుద్ధములు సామాన్యయుద్ధములని తోచును. మహాఘోరయుద్ధములలో దేవియనుగ్రహమున దేవతలు, రాజులు సంపూర్ణ విజయమును పొందినట్లు స్పష్టముగా నున్నది.

(3) దేవతలును, మనుష్యులలో సురధు డనుభూపతియు, సమాధి యను వైశ్యుడును, ధర్మరాజు మున్నగువారును మహాలక్ష్మీఅమ్మవారిని ఆరాధించి, యుద్ధములయందు విజయములు పొంది రనుటకు వేదప్రమాణదృష్టము లగునీచరిత్రలు పఠింపదగియున్నవి. ఇది వేదప్రమాణసిద్ధమని నిరూపించు నె 47రు బహ్వృచోపనిషత్తు ప్రమాణము. ఇంతటిప్రమాణసిద్ధమైన బహుసులభవిజయ సాధన భారతీయులకుతప్ప మరియే దేశస్థులకు లేదు. లక్ష్మీయన స్త్రీ, పుం, నపుంసక, శూన్యానతిరిక్తసామాన్యపరాశక్తిస్వరూప మని గ్రహించవలెను. ముఖ్యముగ భగవద్భక్తియుక్తు లగు భారతీయులకర్వకష్టములు తొలగుననుట కీగ్రంధమందలిసూక్తులే ప్రమాణము. కనుక ప్రభుత్వమువారు ప్రతిగ్రామదేవాలయమునందు అందలి దేవతామూర్తివిచక్షణతో నిమిత్తము లేకుండ, కొంతకాలము నిత్యమ్మీకల్పప్రకారము 'మహాయాగక్రమారాధ్యా' అనెడిప్రమాణమును గుర్తించి, మహాయాగములు చేయించి, దేశమును రక్షింపదగును. అట్లాచరింపజేసిన భారతీయులు యుద్ధభయము లేక, క్షామభయము లేక, కలరామారీస్ఫోటకాదివ్యాధిభయము లేక సుఖించెదరు. కనుక, అట్లు పూజాపారాయణలు చేయించుట ప్రభుత్వాధికారులముఖ్యకర్తవ్యమై యున్నది.

(4) ప్రతిగ్రామమునందు వసించుప్రజలును స్వల్పవ్యయముతో నొక మండలము. (40 దినములు) ఈ కల్పప్రకారము మహాయాగక్రమారాధన చేయించిన, ఆయాగ్రామప్రజలు

'సర్వబాధావినిర్ముక్తో ధనధాన్యసుతాన్వితః
మనుష్యో మత్ప్రసాదేన భవిష్యతి న సంశయః'

అని (శివ చరిత్ర) అమ్మవారు గావించినశపథముప్రకారము సంపూర్ణ క్షేమము నొందుదురు. మరియు సురథుడు, సమాధి, ధర్మరాజు మొదలగువా రెందరో కష్టములు తీరి, ధనధాన్యసుతులతో సుఖించినట్లు విస్పష్టమైయున్నందున ప్రభుత్వమువారు, ప్రజలు ఈమహాయాగక్రమారాధనలు చేయించి, చేసి, భారతీయసోదరప్రజలకు ఇహపర శ్రేయస్సుఖముల సమకూర్చి స్వరాజ్యమునకు శాశ్వతప్రతిష్ఠ గలిగింపదగును.

సర్వే జనా స్సుఖినో భవంతు.

రచయిత,
పీసపాటి లక్ష్మీ వధానులు,
'చతుర్వేదపరమరహస్య' గ్రంథకర్త.

# చతుర్వేద పరమ రహస్యము



(1) "చతుర్వేదపరమరహస్య" మను పేర నే నిప్పటికి కొన్ని సంవత్సరముల క్రిందటనే డెమ్మీసైజులో 550 పుటలు గలమహాగ్రంథమును వ్రాసి ప్రకటించియుంటిని. అందు నాల్గువేదములలో పూర్వాపరకాండమూలమున భగవాను డుపదేశించిన సర్వాంశముల పరమరహస్యమును (సారమును) శ్రుతి, స్మృత్యుక్తముగ వివరించియుంటిని. తాత్పర్యము తేటతెలుగున నుండుటచే సాధారణభాషాజ్ఞానము గల స్త్రీ పురుషులుగూడ చదివి తరించదగియుండును.

(2) ఈ గ్రంథమును ప్యారిస్‌లోని ఐక్యరాజ్యసమితిలైబ్రరీ అధికారులు తెప్పించుకొని తమలైబ్రరీలో పెట్టి గౌరవించియున్నారు. ఈ యపూర్వగంథమునుగుఱించి డాక్టర్ శ్రీ యస్. రాధాకృష్ణన్ (President, Indian Union), శృంగేరిపీఠాధిపతులు, శ్రీ ప॥ ప॥ శ్రీమదభినవవిద్యాతీర్థస్వాములవారును, బ్రహ్మీభూత శ్రీకల్యాణానందభారతీమాంతాచార్యస్వాములవారును, తర్క-వేదాంత విశారద - వేదాంతాచార్య బ్రహ్మశ్రీ ముదిగొండ వేంకటరామశాస్త్రిగారును— ఇత్యాదు లెందరో బ్రహ్మానందపడుచు తమయమూల్యాభిప్రాయముల నిచ్చియున్నారు. All India Radio, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికాధిపతులు మున్నగువారును చక్కగ విమర్శించి శ్లాఘించి

యున్నారు. ఈగ్రంథ మిట్లనేక మహావిద్వాంసులచేతను, పత్రికాధిపతులచేతను, ప్రశంస పొందియున్నది. అనేకులిప్పుడీగ్రంథము కావలయునని వ్రాయుచున్నను స్టాకు అయిపోయినందున నప్పయిచేయజాలమికి చింతిల్లుచు, ఇప్పుడా గ్రంథమును పునర్ముద్రణ చేయుటలో యాజ్ఞవల్క్యతత్త్వ రహస్యసర్వస్వమును, ఛాందోగ్యబృహదారణ్యాదిగ్రంథములయందు బ్రహ్మవిద్యకు సంబంధించిన ఉపాసనలును, ఇంక ననేకనూతనవిషయములును, బ్రహ్మగీత, సూతగీత వ్యాఖ్యానముతో చేర్చి వేయి పుటలకు మించుగ్రంథమును ముద్రించుచున్నాను. కాని 500 ప్రతులుమాత్రమే అచ్చగుచున్నవి. ఇదివరకు గ్రంథము ఖరీదు రు 10-00. ఇప్పుడు అచ్చగుచున్నగ్రంథము వెల రు 25-00. ముందుగా రు 20/- మనియార్డరు పంపి అడ్వాన్సుబుక్కింగు చేసికొనువారికి అచ్చుపూర్తియైన వెంటనే గ్రంథము పంపించబడును. ఇప్పటికే కొంత అడ్వాన్సుబుక్కింగు అయియున్నది. సంఖ్య పూర్తియైనతర్వాత వచ్చుమనియార్డర్లు రిటర్న్ చేయబడును. పోస్టేజి ప్రత్యేకము.

Address :—

'చతుర్వేద పరమరహస్య' గ్రంథకర్త,
పీసపాటి లక్ష్మావధానులు,
'మహాలక్ష్మీ సామాన్య విశేష పూజాకల్ప' గ్రంథరచయిత,
పాతగుంటూరు.
గుంటూరు (ఆంధ్రప్రదేశ్)



శ్రీచక్రరాజము



మహాకాళీ, మహాసరస్వతీ, శ్రీరాజరాజేశ్వరీ
పరాభట్టారికాంబాద్యనేక నామరూప విఖ్యాత
శ్రీమహాలక్ష్మీదేవి

శ్రీ గురుభ్యో నమః హరిః ఓమ్
శ్రీ మహాగణాధిపతయే నమః

# మహాలక్ష్మీ సామాన్య విశేష పూజా కల్పము



శ్రీం హ్రీం క్లీం శ్రియుం కురు కురు స్వాహా

## ఇష్టదేవతా ప్రార్థనాదికమ్

### (1) పరమేశ్వర ధ్యానం

శ్లో॥ ఐశ్వరం పరమం తత్త్వ మాదిమధ్యాంతవర్జితమ్
ఆధారం సర్వలోకానా మనాధార మవిక్రియమ్.

శ్లో॥ అనంతానందబోధాంబునిధి మద్భుతవిక్రమమ్
అంబికాపతి మీశాన మనిశం ప్రణమా మ్యహమ్.

శ్లో॥ మన్మాయాశక్తిసంక్లుప్తం జగ త్సర్వం చరాచరమ్
సాపి మత్తః పృథ జ్మాయా నా స్త్యేవ పరమార్థతః.

శ్లో॥ శివో దాతా శివో భోక్తా శివ స్సర్వ మిదం జగత్
శివో యజతి యజ్ఞైశ్చ య శ్శివ స్సోఽహ మేవ హి.

## (2) స్వర్ణాకర్షణ మహాలక్ష్మీ ధ్యానం

శ్లో॥ శతాక్షీ శతానందీ । శత మాయుష్యవర్ధినీ
శతకోటిధనం దద్యాత్ । శాంకరీ శాంతరూపిణీ.

## (3) రాజరాజేశ్వరీ ధ్యానం

శ్లో॥ యా విద్యా శివకేశవాదిజననీ, యా వై జగన్మోహినీ,
యా బ్రహ్మాదిపిపీలికాంతజగదానందైకసంధాయినీ,

యా పంచప్రణవద్విరేఫనళినీ, యా చిత్కళామాలినీ
సా పాయాత్పరదేవతా, భగవతీ, శ్రీరాజరాజేశ్వరీ.

## (4) మహాపాదుకా ధ్యానం

శ్లో॥ సంచింతయామి చరణౌ, కులరంధ్రపీఠే । శంభోరశేషజననస్థితినాశహేతూ,
పష్ఠ్యుత్తరత్రిశతదివ్యమరీచికానా । మంతే పదోపరి షడన్వయరక్తశుక్లా.

## (5) హయగ్రీవ ధ్యానం

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్,
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

## (6) గురుపరంపరా ధ్యానం

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.

శ్లో॥ నారాయణం, పద్మభువం, వశిష్ఠం, శక్తిం చ, తత్పుత్రపరాశరం చ,
వ్యాసం, శుకం, గౌడపదం మహాంతం, గోవిందయోగీంద్ర మథాస్య శిష్యమ్;

శ్లో॥ శ్రీశంకరాచార్య, మథాస్య పద్మపాదం చ, హస్తామలకం చ, శిష్యమ్;
తం తోటకం వార్తికకార మన్యా నస్మద్గురూ న్సంతత మానతోఽస్మి.

శ్లో॥ శ్రుతిస్మృతిపురాణానా మాలయం కరుణాలయమ్
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్.

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్
సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః.

శ్లో॥ నారాయణసమారంభాం విద్యాశంకరమధ్యమామ్
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్.

శ్లో॥ వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరమ్
రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః.

## (7) భూశుద్ధిః

(పూజాగృహాంతః ప్రవిశ్య)

పుండరీకాక్ష ! పుండరీకాక్ష ! పుండరీకాక్షాయ నమః

(అని యుదకము ప్రోక్షించిన, ఎంగిలిస్థలములు, వంటయిండ్లు, పొయ్యిలు మొదలగు సర్వస్థలములు శుద్ధియగును.)

శ్లో॥ బ్రహ్మరంధ్రగతే చంద్రమండలేఽమృతవర్షిణీమ్
భవానీం భూమిశుద్ధ్యర్థం భావయే దమృతేశ్వరీమ్.

(ఇతి విభావ్య ఉదకేన సంప్రోక్ష్య భూశుద్ధిం కృత్వా.)

## (8) భూతశుద్ధిః

పుండరీకాక్ష ! పుండరీకాక్ష ! పుండరీకాక్షాయ నమః

శ్లో॥ అపసర్పంతు యే భూతా యే భూతా భూమిభారకాః
యే భూతా విఘ్నకర్తారః తే నశ్యంతు శివాజ్ఞయా.

(హస్తేన జల మాదాయ పుండరీకాక్ష పుండరీకాక్ష పుండరీకాక్షాయ నమః ఇత్యుక్త్వా, స్వాసనస్థలం పూజాస్థలం చ సంప్రోక్ష్య, ఆసనం పరికల్పయేత్.)

## (9) ఆసనం

శ్లో॥ పృథ్వీ త్వయా ధృతా లోకే దేవి! త్వం విష్ణునా ధృతా
త్వం చ ధారయ మాం దేవి! పవిత్రం [illegible] కురు.

(ఇత్యాసనం ప్రవిత్రీకృత్య, ఉపవిశ్య.)
(చిత్రాసనం=చిత్రం చిత్రఫలప్రదం)

## (10) శిఖాబంధనం

శ్లో॥ తీక్ష్ణదంష్ట్ర! మహాకాయ! కల్పాంతదహనోపమ!
భైరవాయ నమ స్తుభ్య మనుజ్ఞాం దాతు మర్హసి.

(ఇతి శిఖాబంధనేన భైరవానుజ్ఞాం గృహీత్వా)

## (11) దీపారాధనం

మంత్రః॥ ఉద్దీప్యస్వ జాతవేదోఽపఘ్నన్నిర్ ఋతిం మమ పశూగ్ంశ్చ మహ్య మావహ జీవనం చ దిశో దశ.

ఓం ఐం హ్రీం శ్రీం మహాదీపతేజోవత్యమోఘజ్ఞానప్రభామాలినీ భగవతీ. ఐం విచ్చే క్లిన్నే నమః. (దీపం ప్రజ్వాల్య) (అలంకృత్య.) దీపదేవతాభ్యో నమః ధ్యానావాహనాది షోడశోపచారపూజాం సమర్పయామి. (అని అక్షతలు వేసిన నిత్యకృత్యములో చాలును.) (నవరాత్రాది విశేషపూజయందు ధ్యానావాహనాదిపూజ యథావిధి చేయవలయును.)

## (12) దీపదేవతా ప్రార్థన

శ్లో॥ భోదీప! దేవిరూప స్త్వం కర్మసాక్షీ హ్యవిఘ్నకృత్
యావత్కర్మ సమాప్తి స్స్యా త్తావ త్త్వం సుస్థిరో భవ.

శ్లో॥ దీపం జ్యోతిః పరం బ్రహ్మ దీపం జ్యోతిః పరాయణమ్
దీపే నాహరతే పాపం తస్మై సర్వాత్మనే నమః.

## (13) ఆచమనమ్

ఆచమ్య॥ కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా, గోవిందాయ నమః, విష్ణవే నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

## (14) ప్రాణాయామః

ఓమ్ భూః, ఓమ్ భువః, ఓగ్ం సువః, ఓమ్ మహః, ఓమ్ జనః, ఓమ్ తపః, ఓగ్ం సత్యం.

(1) ఓమ్భూః అని చెప్పుచు ఊర్ధ్వముఖముగా దృష్టి నుంచి, యెడమనాసికను మూసి, కుడినాసికద్వారా వాయువును పైకి పీల్చి, ఓముఖ్యప్రాణమా! నన్ను భూలోకమును పొందించుమని ప్రార్థించి, యెడమనాసికద్వారా వాయువును వదలవలయును. (2) ఓమ్ భువః=భువర్లోకమును పొందించుమనియు, (3) ఓగ్ం సువః=సువర్లోకమును పొందించు మనియు,

(4) ఓమ్ మహః = మహర్లోకమును పొందించుమనియు, (5) ఓమ్ జనః = జనోలోకమును పొందించుమనియు, (6) ఓమ్ తపః = తపోలోకమును పొందించుమనియు, (7) ఓగ్ం సత్యం సత్యలోకమును (బ్రహ్మలోకమును) పొందించుమనియు– పైన చెప్పినప్రకారము 7 ప్రాణాయామములు చేయవలెను.

(శ్రుతిః – సప్తవై శీర్షణ్యాః ప్రాణాః)

ఇట్లు ప్రతిదినము 7 ప్రాణాయామములు చేయవలెను.

మంత్రః॥ తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్. ఓం ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువ రోమ్.

## (15) సంకల్పః

స్వయముగ చేసికొనుచో– 'మమ ఉపాత్తదురితక్షయద్వారా' అనియు, ఒకరికొఱకు పనుడు చేయుచో 'యజమానస్య.....గోత్రస్య.... నామధేయస్య....సకుటుంబస్య' అనియు ప్రారంభించి– తరువాత ఉపాత్తదురితక్షయద్వారా శ్రీమహాలక్ష్మీ ముద్దిశ్య శ్రీమహాలక్ష్మీ ప్రీత్యర్థం, మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ శ్రీరాజరాజేశ్వరీ పరాభట్టారికాజ్ఞాప్రవర్త



2]

మహోత్సాహాయై
మహాదేవబలోదయాయై 835
ఢాకినీడ్యాయై
శాకినీడ్యాయై
సాకినీడ్యాయై
సమస్తజుషే
నిరంకుశాయై 840
నాకివంద్యాయై
షడాధారాధిదేవతాయై
భువనజ్ఞాననిఃశ్రేణయే
భువనాకారవల్లర్యై
శాశ్వత్యై 845
శాశ్వతాకారాయై
లోకానుగ్రహకారిణ్యై

సారస్యై
మానస్యై
హంస్యై 850
హంసలోకప్రదాయిన్యై
చిన్ముద్రాలంకృతకరాయై
కోటిసూర్యసమప్రభాయై
సుఖప్రాణిశిరోరేఖాయై
సదదృష్టప్రదాయిన్యై 855
సర్వసాంకర్యదోషఘ్న్యై
గ్రహోపద్రవనాశిన్యై
క్షుద్రజంతుభయఘ్న్యై
విషరోగాదిభంజిన్యై
సదాశాంతాయై 860
సదాశుద్ధాయై

గృహచ్ఛిద్రనివారిణ్యై
కలిదోషప్రశమన్యై
కోలాహలపురస్థితాయై
గౌర్యై 865
లాక్షణిక్యై
ముఖ్యాయై
జఘన్యాకృతివర్జితాయై
మాయాయై
అవిద్యాయై 870
మూలభూతాయై
వాసవ్యై
విష్ణుచేతనాయై
వాదిన్యై
వసురూపాయై 875

వసురత్నపరిచ్ఛదాయై
ఛాందస్యై
చంద్రహృదయాయై
మంత్రాయై
స్వచ్ఛందభైరవ్యై 880
వనమాలాయై
వైజయంత్యై
పంచదివ్యాయుధాత్మికాయై
పీతాంబరమయ్యై
చంచత్కౌస్తుభాయై 885
హరికామిన్యై
నిత్యాయై
తథ్యాయై
రమాయై

రామాయై 890
రమణ్యై
మృత్యుభంజన్యై
జ్యేష్ఠాయై
కాష్ఠాయై
ధనిష్ఠాంతాయై 895
శరాంగ్యై
నిర్గుణప్రియాయై
మైత్రేయాయై
మిత్రవిందాయై
శేష్యశేషకలాశయాయై 900
వారాణశీవాసలభ్యాయై
ఆర్యావర్తజనస్తుతాయై

జగదుత్పత్తిసంతానసంహార
త్రయకారణాయై
తుభ్యం
అంబాయై 905
విష్ణుసర్వస్వాయై
మహేశ్వర్యై
సర్వలోకానాం జనన్యై
పుణ్యమూర్తయే
సిద్ధలక్ష్మ్యై 910
మహాకాళ్యై
మహాలక్ష్మ్యై
సద్యోజాతాదిపంచాగ్ని
రూపాయై
పంచకపంచకాయై

యంత్రలక్ష్మ్యై 915
భవత్యై
ఆదయే
ఆద్యాద్యాయై
సృష్ట్యాదికారణాకారవితతయే
దోషవర్జితాయై 920
జగల్లక్ష్మ్యై
జగన్మాత్రే
విష్ణుపత్న్యై
నవకోటిమహాశక్తిసముపాస్య
పదాంబుజాయై
కనత్సౌవర్ణరత్నాఢ్యసర్వా
భరణభూషితాయై 925
అనంతసత్యమహిష్యై

ప్రపంచేశ్వరనాయక్యై
అత్యుచ్ఛ్రితపదాంతస్థాయై
పరమవ్యోమనాయక్యై
నాకపృష్ఠగతారాధ్యాయై 930
విష్ణులోకవిలాసిన్యై
వైకుంఠరాజమహిష్యై
శ్రీరంగనగరాశ్రితాయై
రంగనాయక్యై
భూపుత్ర్యై 935
కృష్ణాయై
వరదవల్లభాయై
కోటిబ్రహ్మాండసంసేవ్యాయై
కోటిరుద్రాదికీర్తితాయై

మాతులుంగమయం
ఖేటం బిభ్రత్యై 940
సౌవర్ణచషకం బిభ్రత్యై
పద్మద్వయం దధానాయై
పూర్ణకుంభం బిభ్రత్యై
కీరం దధానాయై
వరదాభయే దధానాయై 945
పాశం బిభ్రత్యై
అంకుశం బిభ్రత్యై
శంఖం వహంత్యై
చక్రం వహంత్యై
శూలం వహంత్యై 950
కృపాణికాం వహంత్యై
ధనుర్బాణౌ బిభ్రత్యై

అక్షమాలాం దధానాయై
చిన్ముద్రాం బిభ్రత్యై
అష్టాదశభుజాయై 955
మహాష్టాదశపీఠగాయై
లక్ష్మ్యై
భూమినీళాదిసంసేవ్యాయై
స్వామిచిత్తానువర్తిన్యై
పద్మాయై 960
పద్మాలయాయై
పద్మిన్యై
పూర్ణకుంభాభిషేచితాయై
ఇందిరాయై
ఇందిరాభాక్ష్యై 965
క్షీరసాగరకన్యకాయై

భార్గవ్యై
స్వతంత్రేచ్ఛాయై
వశీకృతజగత్పతయే
మంగళానాంమంగలాయై 970
దేవతానాం దేవతాయై
ఉత్తమానా ముత్తమాయై
శ్రేయసే
పరమామృతాయై
ధనధాన్యాభివృద్ధయే 975
సార్వభౌమసుఖోచ్ఛ్రయాయై
ఆందోళికాదిసౌభాగ్యాయై
మత్తేభాదిమహోదయాయై
పుత్రపౌత్రాభివృద్ధయే
విద్యాభోగబలాదికాయై 980

ఆయురారోగ్యసంపత్తయే
అష్టైశ్వర్యాయై
పరమేశవిభూతయే
సూక్ష్మాత్సూక్ష్మతరాగతయై
సదయాపాంగసందత్తబ్రహ్మేం
ద్రాదిపదస్థితయే 985
అవ్యాహతమహాభాగ్యాయై
అక్షోభ్యవిక్రమాయై
వేదానాం సమన్వయాయై
వేదానా మవిరోధాయై
నిశ్శ్రేయసపదప్రాప్తిసాధనాయై
నిశ్శ్రేయసపదప్రాప్తిఫలాయై
శ్రీమంత్రరాజరాజ్ఞ్యై

శ్రీవిద్యాయై
క్షేమకారిణ్యై
శ్రీంబీజజపసంతుష్టాయై 995
ఐంహ్రీంశ్రీంబీజపాలికాయై
ప్రపత్తిమార్గసులభాయై
విష్ణుప్రథమకింకర్యై

క్లీంకారార్థసవిత్ర్యై
సౌమంగల్యాధిదేవతాయై
శ్రీషోడశాక్షరీవిద్యాయై
శ్రీయంత్రపురవాసిన్యై
సర్వమంగళమాంగల్యాయై
శివాయై

సర్వార్థసాధికాయై
శరణ్యాయై
త్ర్యంబకాయై
దేవ్యై
నారాయణ్యై నమః 1000

శ్రీలక్ష్మీసహస్రనామావళిః సమాప్తా.

## (86) శ్రీ లక్ష్మ్యష్టోత్తరశతనామావళిః

ప్రకృత్యై నమః
వికృత్యై
విద్యాయై
సర్వభూతహితప్రదాయై

శ్రద్ధాయై 5
విభూత్యై
సురభ్యై
పరమాత్మికాయై

వాచే నమః
పద్మాలయాయై 10
పద్మాయై
శుచయే

స్వాహాయై
స్వధాయై
సుధాయై
ధన్యాయై
హిరణ్మయ్యై
లక్ష్మ్యై
నిత్యపుష్టాయై
విభావర్యై
అదిత్యై
దిత్యై
దీప్తాయై
వసుధాయై
వసుధారిణ్యై
కమలాయై

కాంతాయై
కామాక్ష్యై
క్రోధసంభవాయై
అనుగ్రహపదాయై
బుద్ధయే
అనఘాయై
హరివల్లభాయై
అశోకాయై
అమృతాయై •
దీప్తాయై
లోకశోకవినాశిన్యై
ధర్మనిలయాయై
కరుణాయై
లోకమాత్రే

పద్మప్రియాయై
పద్మహస్తాయై
పద్మాక్ష్యై
పద్మసుందర్యై
పద్మోద్భవాయై
పద్మముఖ్యై
పద్మనాభప్రియాయై
రమాయై
పద్మమాలాధరాయై
దేవ్యై
పద్మిన్యై
పద్మగంధిన్యై
పుణ్యగంధాయై
సుప్రసన్నాయై

ప్రసాదాభిముఖ్యై
ప్రభాయై
చంద్రవదనాయై
చంద్రాయై
చంద్రసహోదర్యై
చతుర్భుజాయై 60
చంద్రరూపాయై
ఇందిరాయై
ఇందుశీతలాయై
ఆహ్లోదజనన్యై
పుష్ట్యై 65
శివాయై
శివకర్యై
సత్యై

విమలాయై
విశ్వజనన్యై 70
పుష్టయే
దారిద్ర్యనాశిన్యై
ప్రీతపుష్కరిణ్యై
శాంతాయై
శుక్లమాల్యాంబరాయై
శ్రియై
భాస్కర్యై
బిల్వనిలయాయై
వరారోహాయై
యశస్విన్యై 80
వసుంధరాయై
ఉదారాంగాయై

హరిణ్యై
హేమమాలిన్యై
ధనధాన్యకర్యై 85
సిద్ధయే
స్త్రైణసౌమ్యాయై
శుభప్రదాయై
నృపవేశ్మగతానందా [యై
వరలక్ష్మ్యై 90
వసుప్రదాయై
శుభాయై
హిరణ్యప్రాకారాయై
సముద్రతనయాయై
జయాయై 95
మంగళదేవ్యై

విష్ణువక్షస్స్థలస్థితాయై
విష్ణుపత్న్యై
ప్రసన్నాక్ష్యై
నారాయణసమాశ్రి [తాయై
దారిద్ర్యధ్వంసిన్యై
దేవ్యై
సర్వోపద్రవవారిణ్యై
నవదుర్గాయై
మహాకాళ్యై
బ్రహ్మవిష్ణుశివాత్మికా [యై
త్రికాలజ్ఞానసంపన్నా
భువనేశ్వర్యై నమః [యై

శ్రీలక్ష్మ్యష్టోత్తరశత
నామావళిః సమాప్తా

# (87) దుర్గా అష్టోత్తర శతనామావళిః

శ్రీం హ్రీం క్లీం

దుర్గాయై నమః
శివాయై
మహాలక్ష్మ్యై
మహాగౌర్యై
చండికాయై 5
సర్వజ్ఞాయై
సర్వలోకేశాయై
సర్వకర్మఫలప్రదాయై
సర్వతీర్థమయాయై
పుణ్యాయై 10
దేవయోనయే
అయోనిజాయై

భూమిజాయై
నిర్గుణాయై
ఆధారశక్త్యై 15
అనీశ్వర్యై
నిర్గుణ్యై
నిరహంకారాయై
సర్వగర్వవిమర్దిన్యై
సర్వలోకప్రియాయై 20
వాణ్యై
సర్వవిద్యాధిదేవతా
పార్వత్యై [యై
దేవమాత్రే

వనీశాయై 25
వింధ్యవాసిన్యై
తేజోవత్యై
మహామాత్రే [యై
కోటిసూర్యసమప్రభా
దేవతాయై 30
వహ్నిరూపాయై
సదౌజసే
వర్ణరూపిణ్యై
గుణాశ్రయాయై
గుణమధ్యాయై 35
గుణత్రయవివర్జితాయై

కర్మజ్ఞానప్రదాయై
కాంతాయై
సర్వసంహారకారిణ్యై
ధర్మజ్ఞానాయై 40
ధర్మనిష్ఠాయై
సర్వకర్మవివర్జితాయై
కామాక్ష్యై
కామసంహర్త్ర్యై
కామక్రోధవివర్జితాయై
శాంకర్యై
శాంభవ్యై
శాంతాయై

చంద్రసూర్యాగ్ని
లోచనాయై
సుజయాయై 50
జయభూయిష్ఠాయై
జాహ్నవ్యై
జనపూజితాయై
శాస్త్రియై
శాస్త్రమయ్యై 55
నిత్యాయై
శుభాయై
చంద్రార్ధమస్తకాయై
భారత్యై
భ్రామర్యై 60
కల్పాయై

కరాళ్యై
కృష్ణపింగళాయై
బ్రాహ్మ్యై
నారాయణ్యై 65
రౌద్ర్యై
చంద్రామృతపరిస్రు
జ్యోత్స్నాయై [తాయై
ఇందిరాయై
మహామాయాయై 70
జగత్సృష్ట్యాది
కారిణ్యై
బ్రహ్మాండకోటి
సంస్థానాయై
కామిన్యై

కమలాలయాయై
కాత్యాయన్యై 75
కళాతీతాయై
కాలసంహారకారిణ్యై
యోగనిష్ఠాయై
యోగగమ్యాయై
యోగిధ్యేయాయై 80
తపస్విన్యై
జ్ఞానరూపాయై
నిరాకారాయై
భక్తాభీష్టఫలప్రదాయై
భూతాత్మికాయై 85
భూతమాత్రే
భూతేశాయై

భూతధారిణ్యై
స్వధానారీ
మధ్యగతాయై
షడాధారాదివర్తిన్యై
మోహదాయై
అంశుభవాయై
శుభ్రాయై
సూక్ష్మాయై
మాత్రాయై 95
నిరాలసాయై
నిమ్నగాయై
నీలసంకాశాయై
నిత్యానందాయై
హరాయై 100

పరాయై | అనంతాయై | దుర్లభరూపిణ్యై 105 | సర్వగీతాయై
సర్వజ్ఞాన ప్రదాయిన్యై | సత్యాయై | సరస్వత్యై | సర్వాభీష్టఫలప్రదాయై

( దుర్గాష్టోత్తరశతనామావళిః సమాప్తా )

## (88) శ్రీలలితాష్టోత్తర శతనామావళిః

ఐం హ్రీం శ్రీం రజతాచల
శృంగాగ్రమధ్యస్థాయై నమః
హిమాచలమహావంశ
పావనాయై [యై
శంకరార్ధాంగసౌందర్యశరీరా
లసన్మరకతస్వచ్ఛవిగ్రహాయై
మహాతిశయసౌందర్య
లావణ్యాయై
శశాంకశేఖరప్రాణవల్లభాయై

సదాపంచదశాత్మైక్య
స్వరూపాయై
వజ్రమాణిక్యకటకకిరీటాయై
కస్తూరీతిలకోల్లాసనిటలాయై
భస్మరేఖాంకితలసన్మస్తకాయై
వికచాంభోరుహదళలోచనాయై
శరచ్చాంపేయపుష్పాభ
నాసికాయై [యై
లసత్కాంచనతాటంకయుగళా

మణిదర్పణసంకాశకపోలాయై
తాంబూలపూరిత
స్మేరవదనాయై
సుపక్వదాడిమీబీజరదనాయై
కంబుపూగసమచ్ఛాయ
కంధరాయై [యై
స్థూలముక్తాఫలోదారసుహారా
గిరీశబద్ధమాంగల్యమంగళాయై
పద్మపాశాంకుశలసత్కరాబ్జాయై

పద్మకైరవమందార
సుమాలిన్యై [యై
సువర్ణకుంభయుగ్మాభసుకుచా
రమణీయచతుర్బాహు
సంయుక్తాయై [యై
కనకాంగదకేయూరభూషితా
బృహత్స్వర్ణసౌందర్య
వసనాయై
బృహన్నితంబవిలసజ్జఘనాయై
సౌభాగ్యజాతశృంగార
మధ్యమాయై [యై
దివ్యభూషణసందోహరంజితా
పారిజాతగుణాధిక్యపదాబ్జాయై
సుపద్మరాగసంకాశచరణాయై

తామకోటిమహాపద్మపీఠస్థాయై
శ్రీకంఠనేత్రకుముదచంద్రికాయై
సచామరరమావాణీ
రాజితాయై [యై
భక్తరక్షణదాక్షిణ్యకటాక్షా
భూశాలింగనోద్భూతపుల
కాంగ్యై
అనంగజనకాపాంగవీక్షణాయై
బ్రహ్మోపేంద్రశిరోరత్న
రంజితాయై [యై
శచీముఖ్యామరవధూసేవితా
లీలాకల్పితబ్రహ్మాండ
మండలాయై [యై
అమృతాదిమహాశక్తిసంవృతా

ఏకాతపత్రసామ్రాజ్య
దాయికాయై [యై
సనకాదిసమారాధ్యపాదుకా
దేవర్షిభిస్స్తూయమాన
వైభవాయై
కలశోద్భవదుర్వాసపూజి
తాయై [యై
మత్తేభవక్త్రషడ్వక్త్రవత్సలా
చక్రరాజమహాయంత్ర
మధ్యవర్తిన్యై
చిదగ్నికుండసంభూత
సుదేహాయై [యై
శశాంకఖండసంయుక్తమకుటా
మత్తహంసవధూమంద
గమనాయై

వందారుజనసందోహ
వందితాయై
అంతర్ముఖజనానందఫలదాయై
పతివ్రతాంగనాభీష్టఫలదాయై
అవ్యాజకరుణాపూర
పూరితాయై [యై
నితాంతసచ్చిదానందసంయుక్తా
సహస్రసూర్యసంయుక్త
ప్రకాశాయై [యై
రత్నచింతామణిగృహమధ్యస్థా
హానివృద్ధిగుణాధిక్యరహితాయై
మహాపద్మాటవీమధ్యనివాసాయై
జాగ్రత్స్వప్నసుషుప్తీనాం
సాక్షిభూతాయై

మహాతాపౌఘపాపానాం
వినాశిన్యై
దుష్టభీతిమహాభీతిభంజనాయై
సమస్తదేవదనుజప్రేరకాయై
సమస్తహృదయాంభోజ
నిలయాయై [యై
అనాహతమహాపద్మమందిరా
సహస్రారసరోజాతవాసితాయై
పునరావృత్తిరహితపురస్థాయై
వాణీగాయత్రీసావిత్రీసన్ను
తాయై [బ్రాయై
రమాభూమిసుతారాధ్యపదా
లోపాముద్రార్చితశ్రీమ
చ్చరణాయై

సహస్రరతిసౌందర్యశరీరాయై
భావనామాత్రసంతుష్ట
హృదయాయై
సత్యసంపూర్ణవిజ్ఞానసిద్ధిదాయై
శ్రీలోచనకృతోల్లాసఫలదాయై
శ్రీసుధాబ్ధిమణిద్వీపమధ్యగాయై
దక్షాధ్వరవినిర్భేదసాధనాయై
శ్రీనాథసోదరీభూతశోభితాయై
చంద్రశేఖరభక్తార్తిభంజనాయై
సర్వోపాధివినిర్ముక్తచైత
న్యాయై [యై
నామపారాయణాభీష్టఫలదా
సృష్టిస్థితితిరోధానసంక
ల్పాయై [యై
శ్రీషోడశాక్షరీమంత్రమధ్యగా

అనాద్యంతస్వయంభూత
దివ్యమూర్త్యై [యై
భక్తహంసపరీముఖ్యావియోగా
మాతృమండలసంయుక్త
లలితాయై [యై
భండదైత్యమహాసత్వనాశనా
క్రూరభండశిరచ్ఛేదనిపుణాయై
ధాత్రచ్యుతసురాధీశసుఖ
దాయై [యై
చండముండనిశుంభాదిఖండనా
రక్తాక్షరక్తజిహ్వాదిశిక్షణాయై
మహిషాసురదోర్వీర్యనిగ్ర
హాయై [ణాయై
అభ్రకేశమహోత్సాహకారి

మహేశయుక్తనటనతత్పరాయై
నిజభర్తృముఖాంభోజచింత
నాయై
వృషభధ్వజవిజ్ఞానభావనాయై
జన్మమృత్యుజరారోగభంజ
నాయై
విధేయముక్తవిజ్ఞానసిద్ధిదాయై
కామక్రోధాదిషడ్వర్గ
నాశనాయై
రాజరాజార్చితపదద్వంద్వ
సరోజాయై
సర్వవేదాంతసంసిద్ధ
సుతత్వాయై
శ్రీవీరభక్తవిజ్ఞానవిధానాయై

అశేషదుష్టదనుజసూదనాయై
సాక్షాచ్ఛ్రీదక్షిణామూర్తి
మనోజ్ఞాయై
హయమేధాగ్రసంపూజ్యమహి
మాయై
దక్షప్రజాపతిసుతావేషాయై
సుమబాణేక్షుకోదండమండితా
ఢ్యాయై
నిత్యయౌవనమాంగల్య
మంగళాయై
మహాదేవసమాయుక్తశరీరాయై
మహాదేవరత్యౌత్సుక్యమహా
దేవ్యై నమో నమః 108

మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ, శ్రీరాజరాజేశ్వరీ, పరాభట్టారికాంబాదేవతాయై నమః
నానావిధ పరిమళపత్రపుష్పపూజాం సమర్పయామి నమః
( శ్రీలలితాష్టోత్తరశతనామావళిః సమాప్తా. )

---

## (89) ధూపం

(మంత్రః) య శ్శుచిః ప్రయతో భూత్వా జుహుయా దాజ్య మన్వహమ్‌-
శ్రియః పంచదశర్చం చ శ్రీకామ స్సతతం జపేత్.

శ్లో॥ చందనాగరుకర్పూరసాంగుగ్గులుసంయుతమ్
ధూపం గృహాణ దేవేశి! మహాలక్ష్మి! నమోఽస్తుతే॥
మహాలక్ష్మ్యై నమః ధూప మాఘ్రాపయామి.

## (90) దీపం

(మంత్రః) పద్మాసనే పద్మఊరు పద్మాక్షి పద్మసంభవే!
త్వం మాం భజస్వ పద్మాక్షి యేన సౌఖ్యం లభా మ్యహమ్.

శ్లో॥ యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః॥
కపిలాఘృతసంయుక్తం దీపకార్పాసవర్తికమ్
కర్పూరరేణుసంయుక్తం సర్వబంధవిమోచనమ్॥

మహాలక్ష్మ్యై నమః ధూపం దర్శయామి. ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి.

## (91) మహానివేదనం

(' దధ్యన్నాసక్తహృదయా గుడాన్న ప్రీతమానసా '- అని లలితాసహస్రనామమం దున్నందున వీనిలో దేనినైన నైవేద్యము చేయవలయును. )

(మంత్రః) అశ్వదాయీ చ గోదాయీ ధనదాయీ మహాధనే
ధనం మే జుషతాం దేవి సర్వకామార్థసిద్ధయే.

శ్లో॥ పార్ష్ణిగ్రాహం కుశగ్రాహిం యోధఘంటాసమన్వితాన్
సమాదా యైకహస్తేన ముఖే చిక్షేప వారణాన్॥
తథైవ యోధం తురగై రథం సారథినా సహ
నిక్షిప్య వక్త్రే దశనై శ్చర్వయం త్యతిభైరవమ్॥

నానాదివ్యాన్నసంయుక్తం నానాఫలసమన్వితమ్
శర్కరామధుసంయుక్త మాజ్యాద్యైః పరిపూరితమ్॥

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్. (పగలు) సత్యం త్వర్తేన పరిషించామి (రాత్రి) ఋతం త్వా సత్యేన పరిషించామి. అమృత మస్తు అమృతోపస్తరణ మసి॥

(1) శ్రీం హ్రీం క్లీం ఐం పరాయై పాదుకాయై సాంగాయై సాయుధాయై సపరివారాయై శ్రీమహాలక్ష్మ్యై నమః నైవేద్యం గృహాణ గృహాణ స్వాహా (2) శ్రీం హ్రీం క్లీం క్లీం అపరాయై సాంగాయై సాయుధాయై సపరివారాయై శ్రీమహాలక్ష్మ్యై నమః నైవేద్యం గృహాణ గృహాణ స్వాహా (3) శ్రీం హ్రీం క్లీం సౌః పరాపరాయై పాదుకాయై సాంగాయై సాయుధాయై సపరివారాయై శ్రీమహాలక్ష్మ్యై నమః నైవేద్యం గృహాణ గృహాణ స్వాహా (4) శ్రీం హ్రీం క్లీం ఐం క్లీం సౌః కిశోరమహాలక్ష్మ్యై నమః పాదుకాయై సాంగాయై సాయుధాయై సపరివారాయై శ్రీమహాలక్ష్మ్యై నమః నైవేద్యం గృహాణ గృహాణ స్వాహా (5) శ్రీం హ్రీం క్లీం సౌః క్లీం ఐం శ్రీమహాలక్ష్మ్యై నమః పాదుకాయై సాంగాయై సాయుధాయై సపరివారాయై నానావిధనైవేద్యం గృహాణ గృహాణ స్వాహా. ఓం ప్రాణాయ స్వాహా అపానాయ స్వాహా వ్యానాయ స్వాహా ఉదానాయ స్వాహా

సమానాయ స్వాహా॥ (చక్షుషీ నిమీల్య, క్షణం నిశ్శబ్దం స్థిత్వా, దేవీం భుక్తవతీం విభావ్య, ఉత్తరాపోశన ముఖప్రక్షాళన గండూషణాని సమర్పయేత్.)

## (92) పానీయం

(మంత్రః) పుత్రపౌత్రధనం ధాన్యం హస్త్యశ్వాజావిగోరథం
ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతు మాం.

శ్లో॥ తతః క్రుద్ధా జగన్మాతా చండికా పాన ముత్తమమ్
పపౌ పునఃపునశ్చైవ జహాసారుణలోచనా.
పానీయం పావనం శ్రేష్ఠం గంగాదిసరిదుద్భవమ్
హస్తప్రక్షాళనం దేవి! శుద్ధ్యర్థం ప్రతిగృహ్యతామ్.

(శ్రీమహాలక్ష్మ్యై నమః పానీయం సమర్పయామి.)

## (93) తాంబూలం

(మంత్రః) చంద్రాభాం లక్ష్మీ మీశానాం సూర్యాభాం శ్రియ మీశ్వరీం
చంద్రసూర్యాగ్ని వర్ణాభాం శ్రీమహాలక్ష్మీ ముపాస్మహే.

శ్లో॥ భక్షయంత్యాశ్చ తా న్యుగ్రా న్వైప్రచిత్తాన్ మహాసురాన్
రక్తదంతా భవిష్యంతీ దాడిమీకుసుమోపమా॥
కర్పూరఖండసంయుక్తం కర్పూరీపూగసంయుతమ్
ముక్తాచూర్ణసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥
శ్రీమహాలక్ష్మ్యై నమః తాంబూలం సమర్పయామి.

## (94) హిరణ్యసమర్పణం

శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం హేమ బీజం విభావసోః
అనంతపుణ్యఫలద మత శ్శాంతిం ప్రయచ్ఛ మే॥
శ్రీమహాలక్ష్మ్యై నమః హిరణ్యం సమర్పయామి.

## (95) విప్రసువాసిన్యర్చన

'విప్రప్రియా విప్రరూపా' అనియు, 'సువాసిన్యర్చనాప్రీతా' అనెడి లలితా సహస్రనామ ప్రమాణము ననుసరించి యీపూజలు చేయవలయును. (దేవీబుద్ధ్యా) సువాసిన్యర్చన పసుపు

కుంకుమగంధపుష్పఫలతాంబూలవస్త్రాదులచే, దక్షిణ యథాశక్తి మఱియు, గంధపుష్పఫల తాంబూలవస్త్రదక్షిణలతో నొక బ్రాహ్మణునిగూడ యథాశక్తి పూజించవలయును.

## (96) బలిప్రదానం

స్వవామభాగే (తనయెడమప్రక్క, కలశోదకముకానియుదకముతో భూమిని ప్రోక్షించి త్రికోణవృత్తభూబింబమండలమును లిఖించి) ఇం వ్యాపకమండలాయ నమ ఇతి త్రికోణేషు సంపూజ్య (అక్షతలు వేసిన చాలును. మహానివేదనాన్నముతో ఒక చిన్నముద్దచేసి) దక్షిణ హస్తసర్వాంగులీభిః శ్రీం హ్రీం క్లీం ఐం హ్రీం శ్రీం సర్వభూతేభ్య స్సర్వభూతాధిపతిభ్య ఇమాం పూజాం బలిం దదామి. గృహ్ణంత గృహ్ణంత స్వాహా - అని చెప్పుచు ఆయన్న పిండమును త్రికోణయంత్రమధ్యమం దుంచవలెను. (చేయి కడుగుకొని కొంచెము పసుపుకుంకుమ వేసి ఒక పండు నివేదన చేయవలయును.

## (97) నీరాజనం

(మంత్రః) ధన మగ్ని ర్ధనం వాయు ర్ధనం సూర్యో ధనం వసుః
ధన మింద్రో బృహస్పతి ర్వరుణం ధన మశ్నుతే.

శ్లో॥ అతీవ తేజసఃకూటం జ్వలంతమివ పర్వతమ్
దదృశు స్తే సురా స్తత్ర జ్వాలావ్యాప్తదిగంతరమ్॥
అతులం తత్ర త త్తేజః సర్వదేవశరీరజమ్
ఏకస్థం త దభూ న్నారీ వ్యాప్తలోకత్రయం త్విషా।

శ్లో॥ కర్పూరవహ్నిసంయుక్తం సుభగ స్స్వప్రకాశకః
సర్వదేవప్రియకరో దీపోఽయం ప్రతిగృహ్యతామ్॥

(మంత్రః) హిరణ్యపాత్రం మధోః పూర్ణం దధాతి మధవ్యోఽసానీతి ఏకధా బ్రహ్మణ ఉపహరతి ఏకధైవ యజమాన ఆయు స్తేజో దధాతి.

శ్రీమహాలక్ష్మ్యై నమః ఆనందకర్పూరనీరాజనం సమర్పయామి.

## (98) కుళదీపం (విశేషవిధి)

సౌవర్ణాదికే పాత్రే కుంకుమేన విరచ్య (ఒక పళ్ళెమునకు పసుపుకుంకుమ పూసి అలంకరించవలెను) ఈషత్పక్వపిష్టేన వేదాంగుళోన్నత త్రికోణాకారదీపభాజనాని నవ సప్త పంచ వా కృత్వా (గోంచెము బియ్యపుపిండి నీళ్ళు కలిపి గోంచెము వెచ్చచేసి మూడుకోణ

ములు గల అర అంగుళము లోతుగలవి 9 గాని, 7 గాని, 5 గాని కుందులుచేసి, పళ్ళెములో నుంచి, నేతితో కుండ వత్తులు వేసి దేవ్యాః పురతః త్రికోణవర్తుల చతురస్రమండలం కృత్వా అలంకృత్య తత్ర స్థాప్య (ఆపళ్ళెమునం దుంచి) ఐం హ్రీం శ్రీం మహాదీపతేజోవత్యామోఘజ్ఞాన ప్రభామాలినీ ఐం విచ్చే క్లీ స్నే నమః (అని చెప్పి వెలిగించి దీపములను కుంకుమతో అలంకరించి నమస్కరించి) శ్రీం హ్రీం క్లీం గ్లూం ప్లూం స్లూం మ్లూం న్లూం క్లీం హ్రీం శ్రీం ఇతి రత్నేశ్వర్యా నవవారం సంపూజ్య జానుభ్యా మవనిం గత్వా (రెండు చేతులతో) ఉద్ధృత్య (పైకెత్తి)

శ్లో॥ అంతస్తేజో బహిః స్తేజ ఏకీకృత్యామితప్రభమ్
త్రిధా దేవ్యై పరిభ్రామ్య కుళదీపా న్నివేదయేత్॥

అని చెప్పుచు, మూడు పర్యాయములు అమ్మవారి యెదుట త్రిప్పుచు, గంట వాయించుచు, కుళదీప మీయవలెను. (గంట నింకొకరు వాయించవలెను.) సర్వచక్రయుతే! దేవి! నవావరణాత్మికే! ఆరార్తిక మిదం తుభ్యం గృహాణ మమ సిద్ధయే.

ఇతి దత్వా పూర్వమండలే సంస్థాపయేత్ (యథాస్థలమునం దుంచవలెను.)

## (99) మంత్రపుష్పం

(1) (మంత్రః) ధాతా పురస్తా ద్య ముదాజహార శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః,
త మేవం విద్వా నమృత ఇహ భవతి. నాన్యః పంథా అయనాయ విద్యతే.

(2) (మంత్రః) రాజాధిరాజాయ ప్రసహ్యసాహినే, నమో వయం వైశ్రవణాయ కుర్మహే,
స మే కామాన్ కామకామాయ మహ్యం, కామేశ్వరో వైశ్రవణో దదాతు,
కుబేరాయ వైశ్రవణాయ, మహారాజాయ నమః.

(3) (మంత్రః) ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః ఓం తదాత్మ,
ఓం తత్సత్యం ఓం తత్సర్వం ఓం తత్పురోం నమః.

(4) (మంత్రః) అన్త శ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు, త్వం యజ్ఞ స్త్వం వష
ట్కార స్త్వ మిన్ద్ర స్త్వగ్ం రుద్ర స్త్వం విష్ణు స్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః.

(5) (మంత్రః) త్వం తదాప ఆపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం.

(6) (మంత్రః) వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః రోహంతు సర్వబీజా న్యవ
బ్రహ్మద్విషో జహి.

శ్లో॥ దుర్గే! స్మృతా హరసి భీతి మశేషజంతోః
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి
దారిద్ర్యదుఃఖభయహారిణి! కా త్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా.

( దు ర్గా దే వీ సూ క్తం )

1. మం॥ జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః
సనః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సిన్ధుం దురితాఽత్యగ్నిః.

2. మం॥ తా మగ్ని వర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్
దుర్గాం దేవీగ్ం శరణ మహం ప్రపద్యే సుతరసి తరసే నమః.

3. మం॥ అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్థ్స్వస్తిభి రతి దుర్గాణి విశ్వా
పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ భవాతో కాయతనయాయ శంయోః.

4. మం॥ విశ్వానినో దుర్గహా జాతవేద స్సిన్ధుం న నావా దురితాఽతిపర్షి
అగ్నే అత్రివ న్మనసా గృణానోఽస్మాకం బోధ్యవితా తనూనామ్

5. మం॥ పృతనాజితగ్ం సహమాన ముగ్రమగ్నిగ్ం హువేమ పరమాత్సధస్థాత్
న నః పర్షదతి దుర్గాణి విశ్వా క్షామద్దేవో అతి దురితాఽత్యగ్నిః.

6. మం॥ ప్రత్నోషి క మీడ్యో అధ్వరేషు సనాచ్చ హోతా నవ్యశ్చ సత్సి
స్వాం చాగ్నే తనువం పిప్రయస్వాస్మభ్యం చ సౌభగ మాయజస్వ.

7. మం॥ గోభిర్జుష్ట మయుజో నిషిక్తం తవేన్ద్ర విష్ణో రనుసంచరేమ
నాకస్య పృష్ఠ మభిసంవసానో వైష్ణవీం లోక ఇహ మాదయన్తామ్.

5. మం॥ కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్

6. మం॥ సహస్రపరమా దేవీ శతమూలా శతాఙ్కురా
సర్వగ్ంహరతు మే పాపం దూర్వాదుస్స్వప్న నాశినీ.

7. మం॥ కాణ్డాత్కాణ్డా త్ప్రరోహన్తీ పరుషః పరుషః పరి
ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేన చ.

( దుర్గాదేవీ సూక్తం సమాప్తం. )

8. మం॥ యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి
తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషా వయమ్.

9. మం॥ అశ్వక్రాన్తే రథక్రాన్తే విష్ణుక్రాన్తే వసుంధరా
శిరసా ధారయిష్యామి రక్షస్వ మాం పదేపదే.

10. మం॥ భూమి ర్ధేను ర్ధరణీ లోకధారిణీ ఉద్ధృతాఽసి వరాహేణ కృష్ణేన శతబాహునా.

11. మం॥ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా మలక్ష్మీ ర్నాశయా మ్యహమ్
అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే పాప్మానగ్ంం స్వాహా.

మహాదేవ్యైచ విద్మహే విష్ణుపత్న్యైచ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్.

12. మం॥ వేదాహ మేతం పురుషం మహాన్తమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
తమేవం విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతేఽయనాయ.

13. మం॥ ప్రజాపతి శ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే
పరిజానన్తి యోనిమ్ మరీచీనాం పదమిచ్ఛంతి వేధసః

14. మం॥ యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః
పూర్వో యో దేవేభ్యో జాతః తస్య ధీరాః నమో ఋచాయ బ్రాహ్మయే.

15. మం॥ ఋచం బ్రాహ్మం జనయన్తః దేవా అగ్రే త దబ్రువన్
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్ తస్య దేవా అసన్ వశే.

16. మం॥ హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ । అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపమ్ ।
అశ్వినౌ వ్యాత్తమ్ । ఇష్టం మనిషాణ । అముం మనిషాణ । సర్వం మనిషాణ.

17. మం॥ గావో హిరణ్యం ధన మన్నపానగ్ం సర్వేషాగ్ం శ్రియై స్వాహా.

18. మం॥ శ్రీశ్చ లక్ష్మీశ్చ పుష్టిశ్చ కీర్తిం చానృణ్యతామ్ । బ్రహ్మణ్యం బహుపుత్రతామ్ ।
శ్రద్ధామేధే ప్రజ్ఞాతు జాతవేద స్సందధాతు స్వాహా.

19. మం॥ శ్రియం చ లక్ష్మీం చ పుష్టిం చ కీర్తిం చానృణ్యతామ్ ।
బ్రహ్మణ్యం బహుపుత్రితామ్ । శ్రద్ధామేధే ప్రజా స్సందధాతు స్వాహా.

శ్లో॥ లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూతసమస్తదేవవనితాం లోకైకదీపాంకురామ్
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవబ్రహ్మేంద్రగంగాధరాం
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్.

శ్లో॥ సిద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ
శ్రీలక్ష్మీ ర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా.

శ్లో॥ వరాంకుశౌ పాశ మభీతిముద్రాం
కరై ర్వహంతీం కమలాసనస్థామ్
బాలార్కకోటిప్రతిభాం త్రినేత్రాం
భజేఽహ మంబాం జగదీశ్వరీం తామ్.

శ్లో॥ సర్వమంగళమాంగల్యే ! శివే ! సర్వార్థసాధికే !
శరణ్యే ! త్ర్యంబకే దేవి ! నారాయణి ! నమోఽస్తు తే.

శ్రీమహాలక్ష్మ్యై నమః దివ్యసువర్ణమంత్రపుష్పం సమర్పయామి.

## (100) నమస్కారః

1. మం॥ పద్మప్రియే ! పద్మిని ! పద్మహస్తే ! పద్మాలయే ! పద్మదళాయతాక్షి !
విశ్వప్రియే ! విష్ణుమనోనుకూలే ! త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ.

శ్లో॥ నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మృతాః॥

శ్లో॥ స్తుతా సురైః పూర్వ మభీష్టసంశ్రయా । తథా సురేంద్రేణ దినేషు సేవితా
కరోతు సా న శ్శుభహేతు రీశ్వరీ । శుభాని భద్రా, ణ్యభిహంతు చాపదః॥

శ్లో॥ అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ। తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వరి!

సామాన్యవిధిలో – శ్లో॥ యాని కానిచ పాపాని జన్మాంతరకృతాని చ
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణపదేపదే.

శ్లో॥ నిత్యోఽహం నిర్వికల్పోఽహం నిరాకారోఽహ మవ్యయః
సచ్చిదానందరూపోఽహం పంచకోశాదిగోఽస్మ్యహమ్.

2. మం॥ యస్మాత్పరం నాపర మస్తి కిఞ్చి। ద్యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్ ।
వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక। స్తేనేదం పూర్ణ పురుషేణ సర్వమ్.

3. మం॥ యో వేదాదౌ స్వరః ప్రోక్తో। వేదాన్తే చ ప్రతిష్ఠితః।
తస్య ప్రకృతిలీనస్య। యః పర స్స మహేశ్వరీ.

శ్రీమహాలక్ష్మ్యై నమః ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

## (101) మలశోధనం

☞ అభిషేకతీర్థమును నాల్గు పర్యాయములు ఒక పెద్ద ఉద్ధరణితో ఈ క్రింది నాల్గు మంత్రములు చెప్పుకొనుచు పుచ్చుకొనవలెను.

(1) ప్రకృతిమనోబుద్ధ్యహంకారశ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థ

శబ్దస్పర్శరూపరసగంధాకాశవాయ్వగ్నిసలిలపృథివ్యంతైః చతుర్వింశతిభి రశుద్ధతత్త్వైః అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ౡం ౡం ఏం ఐం ఓం ఔం అం అః శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా. ఐం ఆత్మతత్త్వేన ఆణవమలశోధనార్థం స్థూలదేహం పరిశోధయామి స్వాహా.

(తీర్థము పుచ్చుకోవలెను.)

శ్లో॥ ఇదం పవిత్ర మమృతం । పిబామి భవభేషజమ్
పశుపాశసముచ్ఛేద । కారణం భైరవోదితమ్.

(2) మాయాకలావిద్యారాగకాలనియతిపురుషాంతైః సప్తభి శ్శుద్ధాశుద్ధతత్త్వైః కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం బం భం మం శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా క్లీం విద్యాతత్త్వేన మాయికమలశోధనార్థం సూక్ష్మదేహం పరిశోధయామి స్వాహా. (తీర్థము పుచ్చుకోవలెను)

శ్లో॥ చిత్తస్వాతంత్ర్యసారత్వా త్తస్యానందమయత్వతః
తన్మయత్వాచ్చ భావానాం భావా శ్చాంతర్హితా రసే.

(3) శివశక్తిసదాశివేశ్వరశుద్ధవిద్యాంతైః పంచభి శ్శుద్ధతత్త్వైః యం రం లం వం శం




షం సం హాం ళం క్షం సౌః శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా సౌః శివతత్త్వేన కార్మికమలశోధనార్థం కారణదేహం పరిశోధయామి స్వాహా (తీర్థము పుచ్చుకోవలెను)

శ్లో॥ స్వస్వాతంత్ర్యంవికాసేత న హీయే తాత్మనో రసః
తస్మాదిమాం సుధాం పూర్ణాం మహాదేవ్యాం జుహోమ్యహమ్.

(4) ఐం క్లీం సౌః శివశక్తిసదాశివేశ్వరశుద్ధవిద్యామాయాకలావిద్యారాగకాలనియతి పురుషప్రకృతి మనోబుద్ధ్యహంకారశ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణవాక్పాణిపాదపాయూపస్థ శబ్దస్పర్శ రూపరసగంధాకాశవాయ్వగ్నిసలిలపృథివీరూపై షట్త్రింశత్తత్త్వైః అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం ఏం ఐం ఓం ఔం అం అః కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హాం ళం క్షం శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా సౌః క్లీం ఐం సర్వతత్త్వేన సర్వమలశోధనార్థం సర్వదేహం పరిశోధయామి స్వాహా (తీర్థము పుచ్చుకోవలెను)

శ్లో॥ ప్రకాశామర్శహస్తాభ్యా మవలంబ్యోన్మనీస్రుచా
ధర్మాధర్మకళాస్నేహం పూర్ణదేహే జుహోమ్యహమ్. (తీర్థము పుచ్చుకోవలెను)

## (102) శంఖాదితీర్థం

ప్రాః అస్త్రాయ ఫట్ ఇతి శంఖతోయేన ఆత్మతనుం సంప్రోక్షేత్
(శంఖతీర్థమును శిరస్సుపై చల్లుకోవలెను.)

## (103) ఆత్మార్చనాహుతిత్రయం

( అభిషేకతీర్థమును ముమ్మాఱు పుచ్చుకొనవలెను. )
( ఆత్మాంతరాత్మ పరమాత్మ జ్ఞానాత్మరూపచతురశ్రకుండే సమంత్రక మాహుతిత్రయం [జుహుయాత్ )

శ్లో॥ స్వాత్మమూలత్రికోణస్థే! కోటిసూర్యసమప్రభే!
కుండల్యాకృతిచిద్వహ్నౌ హువే ద్రవ్యం సమంత్రకమ్.
(1) శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా.

శ్లో॥ ధర్మాధర్మహవిర్దీప్తే! ఆత్మాగ్నౌ మనసా స్రుచా
సుషుమ్నావర్త్మనా నిత్య మక్షవృత్తిం జుహోమ్యహమ్.
(తీర్థము పుచ్చుకోవలెను) ఇతి ప్రథమాహుతిః.

(2) శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా

శ్లో॥ ప్రకాశామర్శహస్తాభ్యా మవలంబ్యోన్మనీస్రుచా
ధర్మాధర్మకళాస్నేహం పూర్ణ దేహే జుహో మ్యహమ్.

(తీర్థము పుచ్చుకోవలెను) ఇతి ద్వితీయాహుతిః.

(3) శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా

(మంత్రిః) ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహ మస్మి । జ్యోతి ర్జ్వలతి బ్రహ్మాహ మస్మి । యోహ మస్మి బ్రహ్మాహ మస్మి । అహమస్మి బ్రహ్మాఽహ మస్మి । అహంమే వాహం మాం జుహోమి స్వాహా.

(తీర్థము పుచ్చుకోవలెను) ఇతి తృతీయాహుతిః.

తరువాత అందఱును క్రిందిశ్లోకము చెప్పుకొని తీర్థము పుచ్చుకోవలెను.

శ్లో॥ అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణమ్
సర్వపాపక్షయకరం లక్ష్మీపాదోదకం పిబేత్

(ఇతరులకును దీనితో తీర్థ మీయవలెను.)

## (104) సర్వదేవతాతృప్తి

ఓం ఊర్ధ్వ దేవతా స్తృప్యంతు ; అం అధో దేవతా స్తృప్యంతు ; అం ఆం అంతరిక్ష దేవతా స్తృప్యంతు - అని అక్షతలు చల్లవలయును. అనేన యథాశక్తి మయాకృతేన మహాలక్ష్మి నవావరణార్చనాదినా, సర్వోపచార పూజయాచ మహానైవేద్యాదినాచ, శ్రీమహాలక్ష్మి భగవతీ సర్వాత్మికా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. తత్సర్వం శ్రీమహాలక్ష్మి దేవతార్పిత మస్తు.

## (105) ఆత్మారోపణం విసర్జనం

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సురేశ్వరి !
యత్పూజితం మయా దేవి పరిపూర్ణం త దస్తు తే.

శ్లో॥ దేవనాథ ! గురో ! స్వామిన్ ! దేశిక ! స్వాత్మనాయక !
త్రాహి త్రాహి కృపాసింధో ! పూజాం పూర్ణ తరం కురు.

(ఇతిప్రార్థ్య, దేవీవామహస్తే పుష్పాక్షతైః పూజాం సమర్ప్య, శంఖ ముద్ధృత్య, సర్వాసామావరణదేవతానాం నిర్యాణముద్రయా) పరివార దేవతాః మహాలక్ష్మ్యంగే విలీనా భవంతు స్వాహా. ప్రధానమహాలక్ష్మి దేవతా స్వాత్మని విలీనా భవతు స్వాహా. పూజాపుష్ప మాఘ్రాయ,

శిరసి ధృత్వా (దేవీశానదిగ్భాగే) ఐం నమః ఉచ్ఛిష్టచాండాలీ మాతంగీ సర్వజనవశంకరి స్వాహా. (అనిచెప్పి పూజచేసినపుష్పమును (నిర్మాల్యము) ఉంచవలెను.) ఇతి శేషికాయై దద్యాత్.

శ్లో॥ వీణావాద్యవినోదగీత నిరతాం నీలాంశుకోల్లాసినీం
బింబోష్ఠీం నవయావకార్ద్రచరణా మాకీర్ణనీలాలకామ్
హృద్యాంగీం సితశంఖకుండలధరాం మాణిక్యభూషోజ్జ్వలాం
మాతంగీం ప్రణతోఽస్మి సుస్మితముఖీం దేవీం లఘుశ్యామలామ్.

తన్మంత్రజలోక్షితస్నిగ్ధభూమౌ 'హ్రాం' ఇతి విలిఖ్య, (హ్రాం అని భూమిమీద నీళ్లతో వ్రాయవలెను.) కనిష్ఠికయా తిలకం భ్రూమధ్యేధృత్వా (ఈక్రింది మంత్రము చెప్పుచు భ్రూమధ్యమందు బొట్టు పెట్టుకోవలెను.)

మంత్రః॥ అద్యానో దేవ సవితః ప్రజావత్సావీః సౌభగం। పరాదుస్స్వప్నియగ్ం సువ। విశ్వాని దేవ సవితు ర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆసువ.

(యథాస్థానప్రవేశమంత్రః)

(మంత్రః) ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వతమూర్ధని। బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛ

దేవి యథాసుఖమ్ (అని అక్షతలు పూజచేసిన పుస్తకముపై నుంచవలెను.)

☞ శేషించిన అభిషేకతీర్థము కలశతీర్థము పూజచేసిన పుష్పములు జాగ్రత్తగా మనుజులు, పశువులు త్రొక్కని స్థలమునందు విసర్జించవలయును.

యథాసుఖం విహరేత్. పూజాఖండ స్సమాప్తః.

☞ సంఖ్య 83 నవావరణార్చనలోని నవమావరణార్చన మొదట క్రిందిధ్యానశ్లోకము పఠించుడు.

శ్లో॥ శతాక్షీ శతానందీ శత మాయుష్యవర్ధనీ
శతకోటిధనం దద్యాత్ శాంకరీ శాంతరూపిణీ.

## (106) శ్రీమహాలక్ష్మీదేవీ పంచావతార చరిత్రలు

దేవీ సప్తశతీ పారాయణక్రమారంభము.

శ్లో॥ గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥

శ్లో॥ వందే గురుపదద్వంద్వం అవాఙ్మానసగోచరమ్
రక్తశుక్లప్రభామిశ్రం అతర్క్యం త్రైపురం మహః॥

మనుః (మూలమంత్రము)

శ్రీం హ్రీం క్లీం ఐం హ్రీం క్లీం ఐం హ్రీం దుం చాముండాయై విచ్చే

ఉత్తిష్ఠ పురుషి! కిం స్వపిషి భయం మే సముపస్థితమ్
యది శక్య మశక్యం వా తన్మే భగవతి! శమయ శమయ స్వాహా॥

('బీజాంకురరూపిణీ శక్తిః' అనుప్రమాణ ముండుటచే పై మంత్రబీజార్థము వివరించబడుచున్నది.)

శ్రీం = మహాలక్ష్మీమహాసంపత్ప్రదానాయ.
హ్రీం = సర్వసంపత్ప్రదానాయ.
క్లీం = సర్వజగత్త్రయవశీకరణాయ.
ఐం = వాగ్భవాయ.

దుం = దారిద్ర్యాదిభయసర్వదుఃఖనివారణాయ.
విచ్చే = సర్వశత్రుసంహారణాయ.
చాముండాయై = ఓ లక్ష్మీ! పైశుభములను నను గ్రహింపుము.

తా॥ యోగనిద్రాస్వరూపమునందున్న మహామాయా! భగవతీ! నేను మహాభయము నొందియున్నాను. నీవు ఇంకను ఎందుకు నిద్రించుచున్నావు? నిద్రనుండి లెమ్ము. సాధ్యాసాధ్యములైన నాదుఃఖములను శమింపజేయుము. రక్షింపుము.

యా చండీ మధుకైటభాదిదళనీ యా మాహిషోన్మూలినీ
యా ధూమ్రేక్షణచండముండమథనీ యా రక్తబీజాశనీ
శక్తి శ్శుమ్భనిశుమ్భదైత్యదళనీ యా సిద్ధలక్ష్మీః పరా
సా దేవీ నవకోటిశక్తిసహితా మాం పాతు విశ్వేశ్వరీ.

తాత్పర్యము :— మధుకైటభాదిరాక్షసులను, మహిషాసురుని, ధూమ్రాక్షుని, చండముండులను, రక్తబీజుని శుంభనిశుంభులను సంహరించిన ఓ చాముండేశ్వరీ! చండీ! నీవు సాక్షాత్పరమేశ్వరివి, సిద్ధలక్ష్మివి. కనుక, నవకోటిశక్తులతో నన్ను సర్వదా రక్షించుచుండుము.

[దీనినిబట్టి యీసప్తశతిలోని దేవీయథార్థస్వరూపము సిద్ధలక్ష్మీస్వరూప మగుటచే ఈ యితిహాసములలోని యైదు స్తోత్రములు శ్రీమహాలక్ష్మీపరములని గ్రహించవలయును.]

బహ్వృచోపనిషత్తునందు 'చాముండేతి చండీతి' అని యున్నందున ఈ స్తోత్రాదులు వేదప్రసిద్ధములై యున్నవి. ఇందు నిత్యపారాయణ నిమిత్తము మూలశ్లోకములు వ్రాయబడినవి. అర్థము పారాయణ చేసినను చేయవచ్చును. ఈ యైదు అవతారచరిత్రలలో నిత్యము ఏయొక్క చరిత్ర పారాయణచేసినను లేక ప్రతిశుక్రవారము చేసినను జేయవచ్చును. కాని, దేవీశరన్నవరాత్రములలో నిత్యము చేయుటే మంచిది. ఆపత్కాలములందు దారిద్ర్యరోగబాధలయందు యథాశక్తి పూజయు, ఈ చరిత్రల పారాయణము చేయించిన సర్వకష్టములు నివారణ మగుటయేగాక, సర్వశుభములు చేకూరుననుట యింకలి మూడవచరిత్రవలన స్పష్టపడును.

ఈ పూజా పారాయణాదులకు ఎట్టి విశేషనియమాదులు లేవు. యథాశక్తి వారివారి యిష్టానుసారము చేసికొనినను తాను ప్రీతితో గ్రహింతునని దేవియే చెప్పినందున నిర్భయముగా స్వేచ్ఛగా సంతోషముతో చేసికొని మహాలక్ష్మీదేవికి అనుగ్రహపాత్రులు కావచ్చును.

* అర్గళకవచకీలకస్తోత్రాదులతో నెంతమాత్రము నిమిత్తము లేదు.

# (107) ప్రథమ చరిత్ర

మూలము :

మేధో మహర్షి రువాచ :—

1) మహామాయాప్రభావేణ
సంసారస్థితికారిణా
తన్నాత్ర విస్మయః కార్యో
యోగనిద్రా జగత్పతేః ॥

2) మహామాయా హరే శ్చైషా
తయా సమ్మోహ్యతే జగత్
జ్ఞానినామపి చేతాంసి
దేవీ భగవతీ హి సా॥

3) బలా దాకృష్య మోహాయ
మహామాయా ప్రయచ్ఛతి

తాత్పర్యము :

మేధోనామకమహర్షి చెప్పుచున్నాడు :—

1) జగదీశ్వరుని యోగనిద్ర యగు మహామాయాభగవతియే మానవుల సంసారస్థితికి మూలకారణము. ఆమె ప్రభావముచే జనులు పుత్రమిత్రకళత్రమమత్వరూపమైన సుడిగుండమున బడి, క్రిందుమీఁదగుచున్నారు.

2) విష్ణుమూర్తియొక్క చిదానందేచ్ఛాజ్ఞానక్రియాత్మశక్తిరూపమహామాయాభగవతీదేవి సకలజగత్తును మహాజ్ఞానులనుగూడ మోహపెట్టుచున్నది. (దీనినిగూర్చి ఆశ్చర్యపడవలసినపనిలేదు.)

3) ఆమహామాయ పిపీలికాదిబ్రహ్మపర్యంతము చరాచరములను తనప్రభావముచే వశపఱచుకొని మోహపెట్టు

తయా విసృజ్యతే విశ్వం
జగ దేత చ్చరాచరమ్॥

4) సైషా ప్రసన్నా వరదా
నృణాం భవతి ముక్తయే
సా విద్యా పరమా ముక్తే
ర్హేతుభూతా సనాతనీ॥

5) సంసారబన్ధహేతుశ్చ
సైవ సర్వేశ్వరేశ్వరీ
నిత్యైవ సా జగన్మూర్తి
స్తయా సర్వ మిదం తతమ్॥

6) తథాపి తత్సముత్పత్తి
ర్బహుధా శ్రూయతాం మమ

చున్నది.

4) ఆమె ప్రసన్నురాలైన ముక్తినే ప్రసాదించును. సనాతనియైనయీ దేవి పరబ్రహ్మజ్ఞాన హేతుభూతురాలు.

5) ఆదేవి సంసారబంధహేతురూపగూడ నగుచున్నది. (అనగా బ్రహ్మజ్ఞానులనుగూడ ప్రతిమాదివిషయవాసనలుగలవారినిగ తనశక్తిచే మోహితుల జేయుచున్నది.) ఆమె నిత్యురాలు. 'అనేకకోటిబ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా' అను ప్రమాణము ననుసరించి ఆమెవలననే చరాచర సృష్టి జరుగుచున్నది. ఆమెచేతనే సర్వము నిండియున్నది.

6) ఆమెయుత్పత్తి పలువిధములుగ నేర్పడునుగాన జాగ్రత్తగా వినుము. 'చిదగ్నికుండసంభూతా దేవకార్యసముద్యతా'

దేవానాం కార్యసిద్ధ్యర్థ
మావిర్భవతి సా యదా॥

7) ఉత్పన్నేతి తదా లోకే
సా నిత్యా ప్యభిధీయతే
యోగనిద్రాం యదా విష్ణు
ర్జగ త్యేకార్ణవీకృతే॥

8) ఆస్తీర్య శేష మభజత్
కల్పాన్తే భగవాన్ ప్రభుః
తదా ద్వా వసురౌ ఘోరౌ
విఖ్యాతౌ మధుకైటభౌ॥

9) విష్ణుకర్ణమలోద్భూతౌ
హన్తుం బ్రహ్మాణ ముద్యతౌ
స నాభికమలే విష్ణోః
స్థితో బ్రహ్మ ప్రజాపతిః॥

అను ప్రమాణము ననుసరించి దేవతలకార్యసిద్ధికొరకు ఆమె అవతరించుచున్నది.

7) ఆమె యీరీతిగ నవతరించుటనుబట్టి యీలోకమున జనించిన ట్లున్నను త్రికాలములందును ఆమె నిత్యురాలు. పూర్వకల్పాంతమున జలప్రళయమునందు విస్తీర్ణమైన శేషతల్పమున విష్ణుమూర్తి నిద్రించుచుండెను.

8) అపుడు విఖ్యాతిజెందిన మధుకైటభు లనెడి ఇద్దరు ఘోర రాక్షసులు జన్మించిరి. వారు విష్ణుమూర్తి కర్ణమలమున బుట్టినవా రగుటచే పరమ క్రూరులై బ్రహ్మదేవుని చంపుటకు యత్నించిరి.

9) మహాభయంకరులైన యారాక్షసులను, నిద్రించుచున్న విష్ణుమూర్తిని తన్నాభికమలమునం దుపవిష్టుడైయున్న బ్రహ్మదేవుడు చూచి, ఎద్దియు తోచక; విష్ణుమూర్తికి మెలకువ గలిగింపజేయ దలచెను.

10) దృష్ట్వా తా వసురౌ చోగ్రౌ
ప్రసుప్తం చ జనార్దనమ్
తుష్టావ యోగనిద్రాం తా
మేకాగ్రహృదయః స్థితః ।
విబోధనార్థాయ హరే
ర్హరినేత్రకృతాలయామ్॥
విశ్వేశ్వరీం జగద్ధాత్రీం
స్థితిసంహారకారిణీమ్ ।
స్తౌతి నిద్రాం భగవతీం
విష్ణో రతులాం తేజసః॥

బ్రహ్మోవాచ :

13) త్వం స్వాహా త్వం స్వధా
త్వం హి
వషట్కారః స్వరాత్మికా

10-12) చతుర్ముఖు డగు ఆబ్రహ్మదేవుడు చాలసేపు నిశ్చలముగ ఏకాగ్రచిత్తుడై యోచించెను. ఇట్టి విషమసంకట పరిస్థితులు తటస్థపడునపుడు మహామాయను శరణు చొచ్చుటకంటె వేఱొకగతి లేదని నిశ్చయించుకొనెను. అంతట సురజ్యేష్ఠు డుసృష్టిస్థితిలయహేతుభూతురాలును, విష్ణుమూర్తి నేత్రములే ఆలయముగా చేసికొని సర్వజగత్తును ధరించిన అసమానయోగనిద్రయు, తేజస్స్వరూపిణియు, విశ్వేశ్వరియునగు ఆ మహామాయ నిట్లు స్తోత్రము చేసెను.

బ్రహ్మదేవు డిట్లు స్తుతించుచున్నాడు :—

13) తల్లీ ! యాగాదులయందు స్వాహాదేవివి, శ్రాద్ధాదులయందు స్వధాదేవివి, యజ్ఞములలో దేవతల యాహ్వానము చేయు వషట్కారమంత్రస్వరూపవు నీవే. నీవమృతస్వరూపవు, క్షరరహితవు, నిత్యవు, త్రిమాత్రా

సుధా త్వ మక్షరే నిత్యే
త్రిధామాత్రాత్మికా స్థితా॥

14) అర్థమాత్రా స్థితా నిత్యా
యానుచ్చార్యా విశేషతః
త్వమేవ సంధ్యా సావిత్రీ
త్వం దేవజననీ పరా॥

15) త్వయైత ద్ధార్యతే విశ్వం
త్వయైత త్సృజ్యతే జగత్ ।
త్వయైతత్ పాల్యతే దేవి!
త్వ మత్స్యన్తే చ సర్వదా ॥

16) విసృష్టౌ సృష్టిరూపా త్వం
స్థితిరూపా చ పాలనే ।
తథా సంహృతిరూపాఽన్తే
జగతోఽస్య జగన్మయే!॥

స్వరూపవు, నిన్ను స్తుతింప నెవరికి శక్య మగును ?

14) అర్థమాత్రాస్వరూపవు నీవే. సర్వదా నిత్య సంధ్యా సావిత్రీరూపవు నీవే. గాయత్రీస్వరూపవు నీవే. దేవీ! నీవుయథార్థముగా పరాజననివి(సాక్షాత్పరబ్రహ్మాకృతివి)

15) జగ త్తంతయు నీచే సృష్టించబడియున్నది. ఎల్లప్పుడును అది నీచే పాలింపబడుచున్నది. అంత్యకాలమున నది నీ చేతనే లయము గావింపబడుచున్నది.

16) అందుచే నీవు సృష్టిరూపిణివి, పాలనరూపిణివి, అట్లే జగల్లయకాలమున లయస్వరూపిణివి. గూడనై, యేకైక మూర్తివిగా ప్రకాశించుచున్నావు.

17) మహావిద్యా మహామాయా
మహామేధా మహాస్మృతిః ।
మహామోహా చ భవతీ
మహాదేవీ మహాసురీ॥

17) ఓ జగన్మయీ ! నీవు మహావిద్యవు (జ్ఞానస్వరూపవు) స్వశక్తికల్పిత మహామాయవు. మహామేధవు. మహాస్మృతిరూపవు. నీవు మహామోహకారిణివి. మహాదేవివి. మహాసురివి.

18) ప్రకృతి స్త్వం చ సర్వస్య
గుణత్రయవిభావినీ ।
కాళరాత్రి ర్మహారాత్రి
ర్మోహరాత్రిశ్చ దారుణా॥

18) నీవు సమస్తజీవ ప్రకృతివి. సత్వరజస్తమోరూపవు నీవై యున్నావు. కాళరాత్రి, మహారాత్రి, మోహరాత్రి, దారుణరాత్రులును నీవే.

19) త్వం శ్రీ స్త్వ మీశ్వరీ
త్వం హ్రీ
స్త్వం బుద్ధి ర్బోధలక్షణా ।
లజ్జా పుష్టి స్తథా తుష్టి
స్త్వం శాన్తిః క్షాన్తి రేవ చ॥

19) నీవు మహాలక్ష్మీరూపిణివి. ఈశ్వరివి. బుద్ధి, బోధలక్షణములును నీవే. సిగ్గు, పుష్టి, తుష్టి, శాంతి, క్షాంతులు ఈ మొదలగు మహాస్వభావము లన్నియు నీవ.

| | |
|---|---|
| 20) ఖడ్గినీ శూలినీ ఘోరా<br>గదినీ చక్రిణీ తథా।<br>శఙ్ఖినీ చాపినీ బాణ<br>భుశుణ్డీ పరిఘాయుధా॥ | 20) ఖడ్గము, శూలము, భయంకర గదా చక్రములు ధరించినదానవు. శంఖము, ధనుస్సు, బాణములు, భుశుండీ పరిఘాయుధములు ధరించినదానవు. |
| 21) సౌమ్యా సౌమ్యతరా శేష<br>సౌమ్యేభ్య స్త్వతిసున్దరీ।<br>పరాపరాణాం పరమా<br>త్వమేవ పరమేశ్వరీ॥ | 21) సుందరాతిసుందరమూర్తివి. సంపూర్ణ సుందరవస్తువులలో అత్యంతసుందరాకారవు నీవ. నీవు పరాశక్తివి, పరాశక్తులలో శ్రేష్ఠురాలవు. |
| 22) యచ్చ కిఞ్చి త్క్వచి ద్వస్తు<br>సదసద్వాఽఖిలాత్మికే।<br>తస్య సర్వస్య యా శక్తి<br>స్సా త్వం కిం స్తూయసే<br>మయా॥ | 22) ఓ అఖిలాత్మికా! పరమేశ్వరివి నీవే. సదసద్వస్తువులలో అంతర్యామిస్వరూప వగుటచే నీ వఖిలామృతస్వరూపవు. వానిలోనిశక్తిసర్వస్వము నీవే. |
| 23) యయా త్వయా జగత్ స్రష్టా | 23) నీవు నామరూపవివర్జ్యవై యున్నందున నిన్ను నే నేమని |

జగత్పాతాఽత్తి యో జగత్ ।
సోఽపి నిద్రావశం నీతః
కస్త్వాం స్తోతు మిహేశ్వరః॥

స్తుతిచేయగలను ? సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహ కారణభూత పంచబ్రహ్మస్వరూపవు ( 'పంచబ్రహ్మ స్వరూపిణీ' అని ప్రమాణము.) తల్లీ! ఇట్లు చూడుము - ఇపుడు విష్ణుమూర్తి యోగనిద్రాపరవశుడై యున్నాడు.

24) విష్ణుః శరీరగ్రహణ
మహ మీశాన ఏవ చ ।
కారితా స్తే యతోఽత స్త్వాం
కః స్తోతుం శక్తిమాన్భవేత్ ॥

24) బ్రహ్మ విష్ణు రుద్రుల మగుమేము శరీరధారుల మగుటచే నిన్ను మేము స్తుతింపజాలము. మాకే శక్తి చాలనప్పు డింక నెవరికి శక్తి యుండును ?

25) సా త్వ మిత్థం ప్రభావైః స్వై
రుదారై ర్దేవి ! సంస్తుతా ।
మోహ యైతౌ దురాధర్షా
వసురౌ మధుకైటభౌ॥

25) నీమాహాత్మ్యప్రభావముచే (ప్రకృతిప్రభావముచే) ఈ మాత్రము స్తుతియైనను చేయగల్గితిని. అసాధ్యులైన యీమధుకైటభులను మోహపెట్టుము.

26) ప్రబోధం చ జగత్స్వామీ
నీయతా మచ్యుతో లఘు॥

26) ఈ రాక్షసులను చంపుటకుగా జగన్నాథుడైన విష్ణు మూర్తిని శీఘ్రముగా యోగనిద్రనుండి మేలుకొల్పుము

బోధశ్చ క్రియతా మస్య
హన్తు మేతౌ మహాసురౌ॥

27) ఏవం స్తుతా తదా దేవీ
తామసీ తత్ర వేధసా ।
విష్ణోః ప్రబోధనార్థాయ
నిహన్తుం మధుకైటభౌ॥

28) నేత్రాస్యనాసికాబాహు
హృదయేభ్య స్తథోరసః ।
నిర్గమ్య దర్శనే తస్థౌ
బ్రహ్మణోఽవ్యక్తజన్మనః॥

29) ఉత్తస్థౌ చ జగన్నాథ
స్తయా ముక్తో జనార్దనః
ఏకార్ణవేఽహిశయనా
త్తత స్స దదృశే చ తౌ॥

ఆమహామూర్తిని ఉత్సాహపఱచుము.

27-28) ఈప్రకారము తామసరూపయగుయోగనిద్రామహామాయను బ్రహ్మదేవుడు స్తుతించెను. విష్ణుమూర్తిని మేల్కొల్పుటకును, మధుకైటభరాక్షసులను చంపుటకును విష్ణువుయొక్క నేత్ర, ముఖ, నాసికా, బాహు, హృదయ, వక్షఃస్థలము మున్నగునంగములనుండి తన పుట్టుక కలదో లేదో యని తోపించు ('వ్యక్తావ్యక్తస్వరూపిణీ' అని ప్రమాణము) భగవతి బ్రహ్మకు దర్శనమిచ్చుటకై విష్ణుమూర్తినుండి బయలువెడలెను.

29) విష్ణుమూర్తి యోగనిద్రనుండి మేలుకొనెను. అతివీర్యపరాక్రమవంతులు, దుష్టులు, అయిన మధుకైటభరాక్షసులను విష్ణుమూర్తి ఆ జలప్రళయసమయముననే తన శేషశయ్యనుండి చూచెను.

30) మధుకైటభౌ దురాత్మానా
వతివీర్యపరాక్రమౌ ।
క్రోధరక్తేక్షణా వత్తుం
బ్రహ్మాణం జనితోద్యమౌ॥

31) సముత్థాయ తత స్తాభ్యాం
యుయుధే భగవాన్ హరిః ।
పఞ్చవర్ష సహస్రాణి
బాహుప్రహరణో విభుః॥

32) తావ ప్యతిబలోన్మత్తౌ
మహామాయావిమోహితౌ।
ఉక్తవన్తౌ వరోఽస్మత్తో
వ్రియతా మితి కేశవమ్॥

30–31) క్రోధముచే రక్తనేత్రములనుండి నిప్పులుకురియుచు, బ్రహ్మదేవుని భక్షించుటకు యత్నించుచున్న ఆ రాక్షసులను చూచి, లేచి, విష్ణుమూర్తి ఆయిరువురతో యుద్ధముచేయ నారంభించెను. అయిదువేలసంవత్సరములు విష్ణుమూర్తి ఆరాక్షసులతో యుద్ధముచేసెను.

32) అప్పటికిని విష్ణువు వారిని చంపజాలనందున బలమదోన్మత్తులై ఆమధుకైటభులు మహామాయాభగవతీ ప్రేరణచే మోహింపబడి విష్ణుమూర్తితో "ఇక నీవు మమ్మును చంపజాలవు; గాన, యుద్ధమును మానుకొని మమ్మునేదేని వరము కోరుకొనుము – ఇచ్చెద" మని గర్వముతో పలికిరి.

శ్రీభగవా నువాచ :

33) భవేతా మద్య మే తుష్టౌ
మమ వధ్యా వుభావపి।
కి మన్యేన వరేణాత్ర
ఏతావద్ధి వృతం మమ॥

34) వఞ్చితాభ్యా మితి తదా
సర్వ మాపోమయం జగత్।
విలోక్య తాభ్యాం గదితో
భగవాన్ కమలేక్షణః॥
ఆవాం జహి న యత్రోర్వీ
సలిలేన పరిప్లుతా॥

35) తథేత్యుక్త్వా భగవతా
శఙ్ఖచక్రగదాభృతా ।

శ్రీమహావిష్ణువు వరము నడుగుచున్నాడు-

33) మీరు సంతోషముతో వర మీయదలచితిరేని "నాచే మీరు వధింపబడుదురుగాక ! ఇంతమాత్రమే నావరము. ఇదితప్ప ఇతరవరములతో నాకు ప్రయోజనము లేదు" అని స్వామి పలికెను.

34) అప్పుడు విష్ణుమూర్తిచే వంచింపబడిన ఆరాక్షసులు జగత్తంతయు జలమయమై యుండుట చూచి విష్ణుమూర్తితో మమ్ము జలము లేనిచోట చంపుమని కోరిరి.

35) అప్పుడు శంఖచక్రగదాధరుడైన శ్రీమహావిష్ణువు సరే యని తనతొడలపై పెట్టుకొని, ఆమధుకైటభరాక్షసుల

కృత్వా చక్రేణ వై ఛిన్నే
జఘనే శిరసీ తయోః॥

36) ఏవ మేషా సముత్పన్నా
బ్రహ్మణా సంస్తుతా స్వయమ్।
ప్రభావ మస్యా దేవ్యాస్తు
భూయః శృణు వదామి తే।
ఇతి ప్రథమోఽధ్యాయః.

యిరువుర శిరస్సులను తనచక్రముచే ఖండఖండములుగా ఛేదించెను.

36) ఇట్లు బ్రహ్మదేవునిచే స్తుతిచేయబడి భగవతీదేవి స్వయముగ ఉత్పన్న మైనది. దేవియొక్క ప్రభావ మింకను చెప్పుచున్నాను వినుము.

(ప్రథమ చరిత్ర సంపూర్ణము)

## (108) ద్వితీయ చరిత్ర

మూలము :

1) దేవాసుర మభూ ద్యుద్ధం
పూర్ణ మబ్దశతం పురా।
మహిషేఽసురాణా మధిపే
దేవానాం చ పురన్దరే॥

తాత్పర్యము :

1) పూర్వము నిండునూరుసంవత్సరములు దేవతాధిపతి యైన ఇంద్రునకును, రాక్షసాధిపతి యైనమహిషాసురునకును యుద్ధము జరిగెను.

| | |
|---|---|
| 2) తతోఽసురై ర్మహావీర్యై ర్దేవసైన్యం పరాజితమ్ । జిత్వా చ సకలాన్ దేవా నిన్ద్రోఽభూ న్మహిషాసురః ॥ | 2) ఆయుద్ధమున మాయావియు, మహాబలవంతుడునైన రాక్షసరాజు, మహిషాసురుడు సకలదేవతలతో దేవేంద్రుని నోడించి స్వర్గము నాక్రమించుకొని ఇంద్రత్వము వహించి పరిపాలించుచుండెను. |
| 3) తతః పరాజితా దేవాః పద్మయోనిం ప్రజాపతిమ్। పురస్కృత్య గతా స్తత్ర యత్రేశగరుడధ్వజౌ ॥ | 3) పిమ్మట యుద్ధమున ఓడిపోయినదేవత లందరు పద్మసంభూతుడైన బ్రహ్మదేవుని ముందుంచుకొని శివమాధవు లుండుస్థలమున కరిగిరి. |
| 4) యథావృత్తం తయో స్తద్వ న్మహిషాసురచేష్టితమ్ । త్రిదశాః కథయామాసు ర్దేవాభిభవవిస్తరమ్ ॥ | 4) మహిషాసురునిచర్యలతో జరిగినవృత్తాంత మంతయు సవిస్తరముగా దేవతలు వారితో ఇట్లు విన్నవించిరి. |
| 5) సూర్యేన్ద్రాగ్న్యనిలేన్దూనాం యమస్య వరుణస్య చ । | 5) జగదీశ్వరులారా! సూర్య, ఇంద్ర, అగ్ని, వాయు, చంద్ర యమ, వరుణులయు, ఇతర దేవతలయు సర్వాధికారములను |

అన్యేషాం చాధికారా న్స
స్వయమే వాధితిష్ఠతి ॥

6) స్వర్గా న్నిరాకృతా స్సర్వే
తేన దేవగణా భువి ।
విచర న్తి యథా మర్త్యా
మహిషేణ దురాత్మనా ॥

7) ఏత ద్వః కథితం సర్వ
మమరారివిచేష్టితమ్ ।
శరణం వః ప్రపన్నాః స్మో
వధ స్తస్య విచిన్త్యతామ్॥

8) ఇత్థం నిశమ్య దేవానాం
వచాంసి మధుసూదనః ।
చకార కోపం శమ్భుశ్చ
భ్రుకుటీకుటిలాననౌ ॥

ఆమహిషాసురుడు పొందియున్నాడు.

6) మరియు ఆదురాత్ముడు యావద్దేవగణమును స్వర్గము నుండి వెడలగొట్టుటచే మేమెల్లరము భూమియందు సామాన్యమనుజులవలె సంచరించుచున్నాము.

7) అమరారియైనమహిషాసురునిచేష్టలు సవిస్తారము మీతో మొఱపెట్టుకొంటిమి. మేము మిమ్ము శరణుజొచ్చియున్నాము, గనుక ఆమహిషాసురునివధోపాయము చింతింపతగినదని ప్రార్థించుచున్నాము.

8) దేవతలదీనాలాపములను విని శివమాధవులు మహిషాసురునధిక్షేపించుచు, బొమలు ముడివేసి సక్రోధులైరి.

9) తతో ఽతికోపపూర్ణస్య
చక్రిణో వదనా త్తతః ।
నిశ్చక్రామ మహ త్తేజో
బ్రహ్మణః శఙ్కరస్య చ ॥

10) అన్యేషాం చైవ దేవానాం
శక్రాదీనాం శరీరతః ।
నిర్గతం సుమహ త్తేజ
స్తచ్చైక్యం సమగచ్ఛత ॥

11) అతీవ తేజసః కూటం
జ్వల న్తమివ పర్వతమ్ ।
దదృశు స్తే సురా స్తత్ర
జ్వాలావ్యాప్తదిగ న్తరమ్ ॥

12) అతులం తత్ర త త్తేజః
సర్వదేవశరీరజమ్ ।

9) అప్పు డతికోపపూర్ణము లయినశివమాధవబ్రహ్మదేవుల ముఖములనుండి మహత్తరమైన అనిర్వాచ్యమైన తేజస్సు, ఉద్భవించెను.

10) ఇంద్రాదీతర దేవతలశరీరములనుండియు దివ్యతేజస్సులు వెడలి, శివమాధవబ్రహ్మముఖలనుండి వెడలిన తేజస్సునం దైక్యము నొందెను.

11) మహాజ్వాలలతో సర్వదిశలు వ్యాపించి పర్వతసమముగా వెలుగుచున్న ఆసర్వదేవతా తేజస్స్వరూపపుంజమును దేవతలు చూచిరి.

12) ఆ తేజస్సు సమానరహితమైనదిగా చూపట్టి అంతలోనే త్రిలోకములు వ్యాపించెడికాంతితో ఒకస్త్రీరూపమున

ఏకస్థం త దభూ న్నారీ
వ్యా ప్తలోక త్రయంత్విషా॥

కనిపించెను.

13) య దభూ చ్ఛాంభవం తేజ
స్తేనాజాయత తన్ముఖమ్।
యామ్యేన చాభవ న్కేశా
బాహవో విష్ణు తేజసా ॥

13) శంకరశరీరమునుండి వెడలిన తేజస్సుచే ఆ స్త్రీముఖము, యమునితేజస్సుచే కేశములు, విష్ణుతేజస్సుచే బాహువులు,

14) సౌమ్యేన స్తనయోర్యుగ్మం
మధ్యం చైంద్రేణచాభవత్।
వారుణేన చ జఙ్ఘోరూ
నితమ్బ స్తేజసా భువః ॥

14) చంద్రుని తేజస్సుచే స్తనయుగ్మము, ఇంద్రుని తేజస్సుచే నడుము, వరుణుని తేజస్సుచే జాను జంఘులు, పృథివీ తేజస్సుచే పిరుదులు,

15) బ్రహ్మణ స్తేజసా పాదా
తదఙ్గుళ్యోఽర్క తేజసా ।

15) బ్రహ్మదేవుని తేజస్సుచే పాదములు, సూర్యుని తేజస్సుచే పాదాంగుళములు, వసువుల తేజస్సుచే కరాంగుళములు,

| | |
|---|---|
| వసూనాం చ కరాఙ్గుళ్యః<br>కౌబేరేణ చ నాసికా ॥ | కుబేరుని తేజస్సుచే నాసిక. |
| 16) తస్యాస్తు దన్తాః<br>సముద్భూతాః<br>ప్రాజాపత్యేన తేజసా ।<br>నయనత్రితయం జజ్ఞే<br>తథా పావక తేజసా ॥ | 16) ప్రజాపతి తేజస్సుచే దంతములు, అగ్ని తేజస్సుచే మూడు నేత్రములు. |
| 17) భ్రువౌ చ సన్ధ్యయో స్తేజః<br>శ్రవణా వనిలస్య చ ।<br>అన్యేషాం చైవ దేవానాం<br>సమ్భవ స్తేజసాం శివా ॥ | 17) సంధ్యల తేజస్సుచే కనుబొమలు, వాయువు తేజస్సుచే చెవులు, ఇతర దేవతల తేజస్సులచే ఇతరావయవాదులు నేర్పడగా సర్వాంగసుందరరూపము ధరించి శివంకర యగు దేవి ఉత్పన్న యయ్యెను. |
| 18) తతః సమస్తదేవానాం<br>తేజో రాశిసముద్భవామ్ । | 18) అప్పుడు సమస్తదేవతా తేజఃపుంజముతో నుద్భవించిన ఆ దేవిని మహిషాసురునిచే బాధితులైన దేవతలు చూచి |

తాం విలోక్య ముదం ప్రాపు
రమరా మహిషార్దితాః

సంతోషించిరి.

19) శూలం శూలాద్వినిష్కృష్య
దదౌ తస్యై పినాకధృక్ ।
చక్రం చ దత్తవాన్ కృష్ణః
సముత్పాట్య స్వచక్రతః ॥

19) అప్పుడు శంభుడు తనత్రిశూలమునుండి త్రిశూలమును, విష్ణుమూర్తి తనచక్రమునుండి చక్రమునుపుట్టించి యామెకిచ్చిరి.

20) శఙ్ఖం చ వరుణః శక్తిం
దదౌ తస్యై హుతాశనః।
మారుతో దత్తవాంశ్చాపం
బాణపూర్ణే తథేషుధీ ॥

20) వరుణుడు శంఖమును, అగ్ని శక్త్యాయుధమును, వాయువు ధనుస్సును, తూణీరద్వయమును సమర్పించిరి.

21) వజ్రమిన్ద్రః సముత్పాట్య
కులిశాదమరాధిపః ।

21) సహస్రాక్షుడగు ఇంద్రుడు వజ్రాయుధమునుండి వజ్రాయుధమును, ఐరావతమునుండి ఘంటను సమర్పించెను.

దదౌ తస్యై సహస్రాక్షో
ఘణ్టా మైరావతా ద్గజాత్ ॥

22) కాలదణ్డా ద్యమో దణ్డం
పాశం చామ్బుపతి ర్దదౌ।
ప్రజాపతి శ్చాక్షమాలాం
దదౌ బ్రహ్మా కమణ్డలుమ్॥

23) సమస్తరోమకూపేషు
నిజరశ్మీన్ దివాకరః ।
కాలశ్చ దత్తవాన్ ఖడ్గం
తస్యా శ్చర్మ చ నిర్మలమ్॥

24) క్షీరోద శ్చామలం హార
మజరే చ తథామ్బరే ।
చూడామణిం తథా దివ్యం
కుణ్డలే కటకాని చ ॥

22) ఈ యమధర్మరాజు కాలదండమునుండి కాలదండమును, వరుణుడు పాశమును, ప్రజాపతి జపమాలను బ్రహ్మదేవుడు కమండలమును ఇచ్చిరి.

23) సూర్యుడు తనకిరణముల నెల్ల దేవియొక్క సమస్తరోమ కూపములయందు దుంచెను, కాలుడు ఖడ్గమును, మంచి డాలును ఆయమ్మ కిచ్చెను

24) పాలసముద్రుడు నిర్మలమగు ముత్యాలహారమును, దివ్య నూతన వస్త్రయుగ్మమును దివ్యచూడామణిని, దివ్య తాటంకములను, కటకములను కానుక పెట్టెను.

25) అర్ధచన్ద్రం తథా శుభ్రం
కేయూరాన్ సర్వబాహుషు
నూపురౌ విమలౌ తద్వ
ద్గ్రైవేయక మనుత్తమమ్ ॥

26) అఙ్గుళీయకరత్నాని
సమస్తా స్వఙ్గుళీషు చ ।
విశ్వకర్మా దదౌ తస్యై
పరశుం చాతినిర్మలమ్ ॥

27) అస్త్రాణ్యనేకరూపాణి
తథాఽభేద్యం చ దంశనమ్।
అమ్లానపఙ్కజాం మాలాం
శిర స్యురసి చాపరామ్ ॥

28) అదద జ్జలధి స్తస్యై
పఙ్కజం చాతిశోభనమ్।

25-26) అట్లే రాగిడి కమ్మలు, కంకణములు, శుభ్రమైన చంద్రవంక, సర్వబాహువులకు దివ్యమైన జందులు, సుందరమైనపాంజేబులు, కంఠహారము, అన్ని వ్రేళ్ళకు రత్నమయములైనయుంగరములు, విశ్వకర్మ మొక్కవోని గండ్రగొడ్డలిని ఆ దేవికి సమర్పించిరి.

27-28) అనేకరూపము లయినయస్త్రములు, అట్లే భేదించ శక్యముగానికవచము, శిరస్సున వక్షమున ధరించుటకు ఎన్నటికి వాడిపోనిపద్మమాలలును, హస్తమున ధరించుటకై సముద్రుడు అతిశోభాయనమానమైనపద్మము నాదేవికి సమర్పించెను. హిమవంతు డామె యెక్కితిరుగుట కొక

27)

| | |
|---|---|
| హిమవాన్ వాహనం సింహం<br>రత్నాని వివిధాని చ॥ | సింహమును అలంకరించుకొనుటకు అనర్ఘరత్నములను ఇచ్చెను. |
| 29) దదౌ వశూన్యం సురయా<br>పానపాత్రం ధనాధిపః ।<br>శేషశ్చ సర్వనాగేశో<br>మహామణివిభూషితమ్ ॥<br>30) నాగహారం దదౌ తస్యై<br>ధత్తే యః పృథివీ మిమామ్।<br>అన్యైరపి సురై ర్దేవీ<br>భూషణై రాయుధై స్తథా | 29-30) కుబేరుడు సురాపూరిత మైనపానపాత్ర నిచ్చెను. సర్వనాగాధిపతియై భూమిని ధరించిన శేషుడు మహామణి విభూషిత మైననాగాహారము నా దేవికి సమర్పించెను. ఇతర దేవత లందరిచే అనేకాయుధములు, ఆభరణములు సమర్పించబడినవి. |
| 31) సమ్మానితా ననాదోచ్చై<br>స్సాట్టహాసం ముహు ర్ముహుః<br>తస్యా నాదేన ఘోరేణ<br>కృత్స్న మాపూరితంనభః | 31) దేవి యిట్లు సన్మానించబడినదై పదేపదే అట్టహాసముతో ఒకగొప్పధ్వనిని చేసెను. ఆఘోరమైననాదముచే ఆకాశ మండల మంతయు దట్టముగా నిండి మారుమ్రోగెను |

| | |
|---|---|
| ౩౨) అమాయతాతిమహతా<br>ప్రతిశబ్దో మహా నభూత్।<br>చుక్షుభుః సకలా లోకా<br>స్సముద్రాశ్చ చకమ్పిరే॥ | ౩౨) అందుండి కర్ణకఠోర మగు ప్రతిధ్వని పుట్టినందున సకల లోకములు క్షోభించెను. సముద్రములు కంపించెను. |
| ౩౩) చచాల వసుధా చేలుః<br>సకలాశ్చ మహీధరాః ।<br>జయేతి చ ముదా దేవాస్తా<br>మూచు స్సింహవాహినీమ్॥ | ౩౩) భూమి యంతయు అదరిపోయెను. సమస్తపర్వతములు చలించెను. జయజయధ్వానములతో సకలదేవతలు సింహవాహిని యైనఆదేవిని స్తుతించిరి |
| ౩౪) తుష్టువు ర్మునయ శ్చైనాం<br>భక్తినమ్రాత్మమూర్తయః<br>దృష్ట్వా సమస్తం సంక్షుబ్ధం<br>త్రైలోక్య మమరారయః ॥ | ౩౪) మునీశ్వరులు నమ్రులై ఆదేవిని స్తుతించిరి. త్రిలోకములు సమస్త చరాచరములు అట్లు క్షోభించి పోవుటను కను లార రాక్షసులు చూచిరి. |
| ౩౫) సన్నద్ధాఖిలసైన్యా స్తే<br>సముత్తస్థు రుదాయుధాః | ౩౫) మహిషాసురుడు ఇది యేమి యని క్రోధముతో తన అఖిల సైన్యమును ఆయుధములతో ఆయత్తపరచి యుద్ధమునకు |

| | |
|---|---|
| అః కి మేత దితి క్రోధా<br>దాభాష్య మహిషాసురః॥ | సిద్ధ మాయెను. |
| 36) అభ్యధావత తం శబ్ద<br>మశేషై రసురై ర్వృతః।<br>స దదర్శ తతో దేవీం<br>వ్యాప్తలోక త్రయాంత్విషా | 36) సమస్తరాక్షససేనను తీసికొని ఆదేవిచే చేయబడిన మహా ధ్వని వచ్చెడిదిక్కునకు పరుగెత్తి స్వప్రకాశముచే లోక త్రియమును వ్యాపించి ప్రకాశించుచున్న ఆదేవిని మహిషాసురుడు చూచెను. |
| 37) పాదాక్రాన్త్యా నతభువం<br>కిరీటోల్లిఖితామ్బరామ్।<br>క్షోభితాశేషపాతాళాం<br>ధనుర్జ్యానిఃస్వనేన తామ్॥ | 37) పాదఘట్టనచే భూమిని క్రుంగజేయుచు, కిరీటాగ్రము ఆకాశమును రాచుకొనునంత యెత్తున నిలచి, అల్లెత్రాటి ధ్వనిచే సమస్తపాతాళలోకమును సైతము క్షోభింపచేయుచు |
| 38) దిశో భుజసహస్రేణ<br>సమన్తా ద్వ్యాప్య సంస్థితామ్<br>తతః ప్రవవృతే యుద్ధం<br>తయా దేవ్యాసురద్విషామ్ | 38) తనసహస్రభుజములచే సమస్తదిశలను వ్యాపించియున్న ఆదేవిని చూచి, మహిషాసురుడు, రాక్షసులు యుద్ధమునకు తలపడిరి. |

39) అర్ధనిష్క్రాన్త ఏవాసౌ
యుధ్యమానో మహాసురః
తయా మహాసినా దేవ్యా
శిర శ్ఛిత్వా నిపాతితః ॥

39) ఆఘోరయుద్ధమున మహిషాసురుడు ప్రాణావశిష్టుడై మాయామహిషాకారమునుండి తననిజరూపముతో సగము వెలుపటికి రాగానే ఆమహాదేవి నిజతీక్ష్ణఖడ్గముతో వాని శిరస్సును ఖండించివైచెను.

40) తతో హాహాకృతం సర్వం
దైత్యసైన్యం ననాశ తత్ ।
ప్రహర్షం చ పరం జగ్ముః
సకలా దేవతాగణాః ॥

40) పిమ్మట హాహాశబ్దము చేయుచు మిగిలినరాక్షససైన్య మంతయు నొక్కపరుగున పాఱిపోయినది. దిక్పాలురు సకలదేవతలు సంతోషమును పొందిరి.

41) తుష్టువు స్తాం సురా దేవీం
సహదివ్యై ర్మహర్షిభిః ।
జగు ర్గన్ధర్వపతయో
ననృతు శ్చాప్సరోగణాః ॥

41) మునిశ్రేష్ఠులును, దేవతలును దేవిని మిక్కిలి స్తోత్రము చేసిరి. గంధర్వులు పాడిరి. అప్సరోగణములు నృత్యము చేసిరి.

42) శక్రాదయ స్సురగణా నిహతేஉతివీర్యే
తస్మిన్దురాత్మని సురారిబలే చ దేవ్యా ।
తాం తుష్టువుః ప్రణతినమ్రశిరోధరాంసా
వాగ్భిః ప్రహర్ష పులకోద్గమచారుదేహాః॥

42) మహావీర్యుడు, పరమదుర్మార్గుడు, సుర విరోధియైన ఆ మహిషాసురుడు దేవి చే యుద్ధమున చంపబడినందున దేవతలు సంతోషముచే పులకాంకితసుందరశరీరులై శిరస్సులు వంచి, సాష్టాంగదండప్రణామము చేసి యిట్లు స్తుతించిరి.

43) దేవ్యా యయా తత మిదం జగదాత్మశక్త్యా
నిఃశేష దేవగణశక్తి సమూహమూర్త్యా ।
తా మమ్బికా మఖిలదేవమహర్షి పూజ్యాం
భక్త్యా నతాః స్మ విదధాతు శుభాని సా నః॥

43) దేవీ! నీశక్తిచే నీప్రపంచ మంతయు నిండి యున్నది. సకల దేవగణమహాబలరాశివి. నీవు. నీవు సర్వదేవతలచేతను, మహర్షుల చేతను పూజింపబడుచుందువు. నీకు భక్తితో సాష్టాంగప్రణామముల నాచరించుచున్నాము. మాకు మంగళముల ననుగ్రహించుము.

44) యస్యాః ప్రభావ మతులం భగవా ననన్తో
బ్రహ్మా హరశ్చ న హి వక్తు మలం బలం చ
సా చణ్డికాఽఖిల జగత్పరిపాలనాయ
నాశాయ చాశుభభయస్య మతిం కరోతు।

44) అమ్మా! నీప్రభావబలము లనుపమానములు. వేయినోళ్లు గలఆదిశేషువుగాని, చతుర్ముఖుడుగాని, పంచవక్త్రుడుగాని నీశక్తిని నిరూపింపజాలరు. దేవీ! ఈసమస్త జగత్తును పాలించుటకును, అశుభభయములను నశింపచేయుటకును నీవు నిరంతరము పూనుకొనుచుండవలెనని ప్రార్థించుచున్నాము.

45) యా శ్రీః స్వయం సుకృతినాం భవనే
ష్వలక్ష్మీః। పాపాత్మనాం కృతధియాం
హృదయేషు బుద్ధిః। శ్రద్ధా సతాం కులజన
ప్రభవస్య లజ్జా। తాం త్వాం నతాః స్మ
పరిపాలయ దేవి! విశ్వమ్॥

45) తల్లీ! పుణ్యాత్ములగృహములందు లక్ష్మీస్వరూపముగను, పాపాత్ములగృహములందు అలక్ష్మీస్వరూపముగను, శుద్ధాంతఃకరణులహృదయములందు బుద్ధిరూపముగను, శ్రేష్ఠాచారముగల సజ్జనులయందు శ్రద్ధారూపముగను, సత్కులస్త్రీలయందు లజ్జా

46) కిం వర్ణయామ తవ రూప మచిన్త్య మేతత్
కిఞ్చాతివీర్య మసురక్షయ కారి భూరి।
కిం చాహవేషు చరితాని తవాద్భుతాని
సర్వేషు దేవ్యసుర దేవగణాదికేషు॥

47) హేతు స్సమస్తజగతాం త్రిగుణాపి దోషై
ర్న జ్ఞాయసే హరిహరాదిభిర ప్యపారా।
సర్వాశ్రయాఖిల మిదం జగ దంశభూత-
మవ్యాకృతా హి పరమా ప్రకృతి స్త్వ మాద్యా॥

రూపమునను నీవే గోచరించు చున్నావు.
అందుచే దేవీ! యీవిశ్వమును సుఖముగ
పాలించి రక్షించుము.

46) మహాదేవీ! రాక్షససంక్షయసమర్థ మగు
నీమహాశక్తి అచింత్యముగాన దానిని మే
మెట్లు వర్ణింపగలము? సమస్తదేవదాన
వులయుద్ధచరిత్రలలో నీయుద్ధచరిత్రకు
సాటిరాగలది ఒక్కటికూడ లేదుగదా!

47) నీవు త్రిగుణాతీతవయ్యును త్రిగుణాత్మికవై
సమస్తలోకసృష్టికి హేతుభూతవగ
చున్నావు. అనంత వగునిన్ను హరిహర
బ్రహ్మాదులును తెలియజాలకున్నారు జగ
న్మాతా! సమస్తమునకు నీవే ఆశ్రయ
భూతురాలవు. సద్వికారరహిత యగు

48) యస్యాః సమస్తసురతా సముదీరణేన
తృప్తిం ప్రయాతి సకలేషు మఖేషు దేవీ!
స్వాహాసి వై పితృగణస్య చ తృప్తిహేతు-
రుచ్చార్యసే త్వ మత ఏవ జనైః స్వధా చ॥

49) యాముక్తిహేతురవిచిన్త్యమహావ్రతాత్వం
అభ్యస్యసే సునియతేన్ద్రియతత్త్వసారైః
మోక్షార్థిభి ర్మునిభి రస్తసమస్తదోషై-
ర్విద్యాऽసి సా భగవతీ పరమా హి దేవీ॥

50) శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాం నిధాన-
ముద్గీధరమ్యపదపాఠవతాం చ సామ్నామ్

సాక్షాత్పరమేశ్వరివి. సనాతనమగు అవ్యా
కృతప్రకృతివి. సర్వోత్కృష్టవు నీవేకదా!

48) ఓ దేవీ! సమస్తయజ్ఞములయందు మంత్ర
ములన నుండి సర్వదేవతలను తృప్తి
చెందించెడి స్వాహాస్వరూపిణిగ నున్నది
నీవే-మరియు సమస్త పితృదేవ గణమును
తృప్తిచేయుటకు స్వధాయనుమంత్రరూపి
ణిగ నున్నదియు నీవే.

49) దేవీ! నీవు ముక్తికి హేతురూపవు, అచింత్య
రూపవు, బ్రహ్మవిద్యాస్వరూపిణివి నీవే
యని మోక్షార్థులు, నిష్కలంకులు నగు
మహామునులచే ధ్యానించబడుచున్నావు.

50) తల్లీ! నీవు సర్వశబ్దాత్మికవు-పరమపవిత్ర
మైనఋగ్యజుర్వేదములకును, దివ్యగాన

దేవీ త్రయీ భగవతీ భవభావనాయ
వార్తా చ సర్వజగతాం పరమార్తిహన్త్రీ॥

51) మేధాఽసి దేవి! విదితాఖిలశాస్త్రసారా
దుర్గాఽసి దుర్గభవసాగరనౌరసఙ్గా।
శ్రీః కైటభారిహృదయైకకృతాధివాసా
గౌరీ త్వమేవ శశిమౌలికృతప్రతిష్ఠా ॥

రూప మైనసామవేదమునకును మూలము
నీవు. ఇంతయేల? శబ్దాత్మిక వేదత్రయమును
నీవే. మూలప్రకృతివి నీవు. జగత్పోషణ
కర్త్రివి నీవు. సర్వాపన్నివారణసమర్థు
రాలవు నీవు.

51) దేవీ! నీవు మూలప్రకృతిబుద్ధిరూపిణివి-
సమస్తవేదశాస్త్రసారమును తెలిసిన
దానవు-దుర్గారూపిణివి, దుర్గమసంసార
సాగరమును దాటుటకు గురుస్వరూపమున
నుండునౌకాస్వరూపిణివి నీవు లక్ష్మివి.
మధుకైటభాదిరాక్షసహంత యగుశ్రీ
మహావిష్ణువుయొక్క హృదయపీఠమున
నుండు మహాలక్ష్మివి నీవు. శివునివామ
పార్శ్వమున గలిసియున్న గౌరివి నీవు.

52) ఈషత్సహాస మమలం పరిపూర్ణచన్ద్ర-
బిమ్బానుకారి కనకోత్తమకాన్తికాన్తమ్
అత్యద్భుతం ప్రహృతమాత్తరుషా తథాపి
వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ॥

53) దృష్ట్వా తు దేవి కుపితం భ్రుకుటీకరాళ-
ముద్యచ్ఛశాఙ్కసదృశచ్ఛవి యన్న సద్యః
ప్రాణాన్ ముమోచ మహిషస్తదతీవ చిత్రం
కైర్జీవ్యతే హి కుపితాన్తకదర్శనేన ॥

ఇట్లయ్యును సర్వదా అసంగవై యుండు
మహాశక్తివి నీవు.

52) నిర్మలపూర్ణచంద్రబింబమును బోలుచు,
చిఱునగవుతో మనోహరమగుచు, మేలిమి
కాంతిని తలదన్నుచుండు నీముఖమును
సందర్శించియు మహిషాసురుడు నీపై ప్రేమ
మిల్లక కోపముతో ప్రహరించుట కుద్య
మించుట యెంత ఆశ్చర్యకరము !

53) దేవీ! క్రోధయుక్తవై కనుబొమలు ముడు
చుటచే భయంకరవై, ఉదయించు చం
ద్రుని వలె నెఱ్ఱనై మండిపడు నీముఖమును
చూచియు మహిషాసురుడు తత్క్షణము
ప్రాణములు విడువకుండుట మఱియెంతో
విచిత్రము! ఉగ్రరూపు డైనయమధర్మ

54) దేవి! ప్రసీద పరమా భవతీ భవాయ
సద్యో వినాశయసి కోపవతీ కులాని।
విజ్ఞాత మేత దధునైవ య దస్త మేత-
న్నీతం బలం సువిపులం మహిషాసురస్య॥

55) తే సమ్మతా జనపదేషు ధనాని తేషాం
తేషాం యశాంసి న చ సీదతి ధర్మవర్గః
ధన్యాస్త ఏవ నిభృతాత్మజభృత్యదారా
యేషాం సదాభ్యుదయదా భవతీ ప్రసన్నా॥

రాజును దర్శించి బ్రతికిపోగలవా రుందురా?

54) దేవీ! ప్రసన్నురాలవుగమ్ము-నీవు ప్రసన్నవైన నాశ్రితులకు సంపత్ప్రదాయిని వగుదువు నీవు కోపన వైతివో దుర్జనవంశముల నిర్మూలింతువు అతివిస్తారమైన సేనతో లోకకంటకుని మహిషాసురుని నిర్మూలించుట వలన నీస్వరూపస్వభావము విశదమైనది.

55) దేవీ! యెవరియెడల నీవు ప్రసన్నురాల వగుదువో వారు లోకమున పేరుప్రతిష్ఠలు గలవా రగుదురు-వారికి యశోధనములతో పురుషార్థములు సిద్ధించును. వారలే స్త్రీ ధనపుత్ర సేవకులతో నానందపూర్ణులై ధన్యు లగుదురు

56) ధర్మ్యాణి దేవి! సకలాని సదైవ కర్మా-
ణ్యత్యాదృతః ప్రతిదినం సుకృతీ కరోతి।
స్వర్గం ప్రయాతి చ తతో భవతీ ప్రసాదా
ల్లోకత్రయేఽపి ఫలదా నను దేవి! తేన ॥

56) మహాదేవీ! నీఅనుగ్రహమున్నచో పుణ్య
శీలు రాచరించునిత్యనైమిత్తికాదికర్మము
లన్నియు ధర్మయుక్తము లగును. నీప్రసా
దమువలననే వారు మరణానంతరము
స్వర్గమును పొందుదురు-త్రిలోకవాసులకు
శుభము లిచ్చుదానవు నీవేగదా !

57) దుర్గే! స్మృతా హరసి భీతిమశేషజన్తోః
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి
దారిద్ర్యదుఃఖభయహారిణి! కాత్వదన్యా
సర్వోపకారకరణాయ సదార్ద్రచిత్తా॥

57) 'దుర్గా' అని నిన్ను స్మరించినమాత్ర
ముచేసమస్తజీవులభీతిని పోగొట్టు చున్నావు.
స్వస్థచిత్తముతో నిన్ను స్మరించినమాత్ర
ముననే సర్వశుభముల నొసంగుచు
న్నావు. దారిద్ర్యదుఃఖమును పోగొట్టుటకు
నీకుతప్ప ఇతరుల కెవరికిని శక్తి లేదు. భక్తు
లకు సమస్తోపకారములు చేకూర్చుటకు



60)

కావుననే శత్రువులయందును నీ విట్లు దయచూపుచున్నావు.

62) కేనోపమా భవతు తేఽస్య పరాక్రమస్య
రూపం చ శత్రుభయకార్యతిహారి కుత్ర ।
చిత్తే కృపా సమరనిష్ఠురతా చ దృష్టా
త్వయ్యేవ దేవి! వరదే! భువనత్రయేఽపి

62) ఓవరదాత్రీ! శత్రువులకు హడలుపుట్టించు నీపరాక్రమమునకుగాని, భక్తుల కమితానందమును గూర్చునీసౌందర్యమునకుగాని ముల్లోకములలోను పోలికలేదు. పైకి యుద్ధకార్యమును చాటుచుందువేగాని. నిజమునకు నీమనస్సున సర్వభూతదయయే ప్రధానమైనది. ఇట్టివిచిత్రప్రకృతి నీయందే తప్ప వేఱెందును గానరాదు.

63) త్రైలోక్య మేత దఖిలం రిపునాశనేన
త్రాతం త్వయా సమరమూర్ధని తేఽపి
హత్వా ।

63) యుద్ధరంగమున శత్రుసంహారము చేసి త్రిలోకములను రక్షించితివి. శత్రుసమూహములనోస్వర్గమునకు పంపితివి. ఉన్మత్తులైన మహిషాసురునిచే మాకు కల్గినఆపత్తునుండి

నీతా దివం రిపుగణా భయ మ ప్యపాస్త
మస్మాక మున్మదసురారిభవం నమ స్తే॥

64) శూలేన పాహి నో దేవి
పాహి ఖడ్గేన చామ్బికే! ।
ఘణ్టాస్వనేన నః పాహి
చాపజ్యానిస్వనేన చ ॥

65) ప్రాచ్యాం రక్ష ప్రతీచ్యాం చ
చణ్డికే! రక్ష దక్షిణే ।
భ్రామణే నాత్మశూలస్య
ఉత్తరస్యాం తథేశ్వరి! ॥

66) సౌమ్యాని యాని రూపాణి
త్రైలోక్యే విచరన్తి తే ।
యాని చాత్యన్తఘోరాణి
తైరక్షాస్మాంస్తథా భువమ్ ॥

రక్షించితివి. నీకు పదేపదే బహుప్రణామములు.

64) ఓ దేవి! నీ త్రిశూలముచేతను, ఖడ్గముచేతను, ఘంటాధ్వనిచేతను, అల్లెత్రాటి ధ్వనిచేతను మమ్ము రక్షింపుము.

65) ఈశ్వరీ! చండికా! నీ త్రిశూలము నెల్లదిక్కులను త్రిప్పి, ప్రాక్పశ్చిమదక్షిణోత్తరముల వసించుమమ్ము రక్షింపుము.

66) పరమేశ్వరీ! నీసుకుమారఘోరరూపవిభూతులు అనిర్వర్ణనీయములు. అట్టి యప్రాకృతదివ్య రూపములతో నెల్లపుడు మమ్మును స్వర్గమర్త్యపాతాళాదిలోకము

67) ఖడ్గశూలగదాదీని
యానిచాస్త్రాణి తేఽమ్బికే ! ।
కరపల్లవసఙ్గీని
తైరస్మాన్ రక్ష సర్వతః ॥

68) ఏవం స్తుతా సురై ర్దివ్యైః
కుసుమై ర్నన్దనోద్భవైః
అర్చితా జగతాం ధాత్రీ
తథా గన్ధానులేపనైః ॥

69) భక్త్యా సమస్తై స్త్రిదశై
ర్దివ్యై ర్ధూపైః సుధూపితా ।
ప్రాహ ప్రసాదసుముఖీ
సమస్తాన్ ప్రణతాన్ సురాన్ ॥

లను రక్షించుచుందుపుగాక !

67) జగదంబికా! నీసమస్తహస్తములయందు గలఖడ్గశూలగదాద్యస్త్రములచే ఎల్లపుడు మమ్ము రక్షించుచుండుము.

68) ఈప్రకారము దేవతలు స్తుతించి, సుగంధ ద్రవ్యలేపనముచేతను, నందనోద్భవదివ్య పుష్పములచేతను జగద్ధాత్రి యైనదేవిని పూజించిరి.

69) మఱియు భక్తిపూర్వకముగా దివ్యపరిమళ ద్రవ్యములచే ధూపము సమర్పించిరి దీపాదులచే నీరాజనముగావించిరి. పునః పునః ప్రణామముల సలిపిరి అప్పుడు దేవత లకు ప్రసన్నురాలయి దేవి యిట్లు పలికెను

70) దేవ్యువాచ ॥
71) ప్రియతాం త్రిదశాః సర్వే
యదస్మత్తో౽భివాఞ్ఛితమ్ ॥
దదా మ్యహం మతిప్రీత్యా
స్తవై రేభిః సుపూజితా ॥
72) దేవా ఊచుః ॥
73) భగవత్యా కృతం సర్వం
నకిఞ్చి దవశిష్యతే ।
య దయం నిహతః శత్రు
రస్మాకం మహిషాసురః ॥
74) యది చాపి వరో దేయ
స్త్వయా౽స్మాకం మహేశ్వరి! ।
సంస్మృతా సంస్మృతా త్వం నో
హింసేథాః పరమాపదః ॥

70) అమ్మవా రిట్లనెను.

71) దేవతలారా! మీ రొనర్చినస్తోత్రమునకు మహానందమైనది మీయభీష్టవరములను కోరుకొనుడు-ఇప్పుడె యనుగ్రహించెదను.

72) దేవత లిట్లు కోరుచున్నారు.

73) దేవీ ! ఈమాశత్రు వైనమహిషాసురుని చంపుటచే నీవలన మాకు సర్వోపకారము లభించినది-నీచే సర్వము ప్రసాదింప బడినది. ఇంకను మేము కోరతగిన దేమి గలదు?

74) మహేశ్వరీ! మా కేదైన వర మిచ్చెదవేని మేము 'హేమర్గ'అని స్మరించినమాత్రమున నే మాసకలాపదలు నశింపచేయుదు ననిమాత్రము వర మొసగుము.

75-76) యశ్చ మర్త్యైః స్తవైరేభి
స్త్వాం స్తోష్యత్యమలాననే! ।
తస్య విత్తర్ధివిభవై
ర్ధనదారాదిసమ్పదామ్ ॥
వృద్ధయేఽస్మత్ప్రసన్నా త్వం
భవేథాః సర్వదాఽమ్బికే! ॥

77) ఇతి ప్రసాదితా దేవై
ర్జగతోఽర్థే తథాత్మనః ।
తథేత్యుక్త్వా భద్రకాళీ
బభూవాన్తర్హితా నృప! ॥

78) ఇత్యేతత్కథితం భూప !
సమ్భూతా సా యథా పురా ।

75-76) ఓ ప్రసన్నముఖీ! యెవడు నిన్నారాధించి యీస్తోత్రములచే ధ్యానించి స్తుతించునో యట్టిమనుజునకుగూడ పుత్రమిత్ర ధనదారాదిసంపద్వృద్ధిని, అష్టైశ్వర్యాభివృద్ధిని మాకు ప్రసాదించునట్లే ప్రసాదించుము.

77) తమకొఱకును, మనుజులకొఱకును, జగత్తుకొఱకును దేవతలచే నిట్లు ప్రార్థించబడినదై "మంచిది; అట్లే యగునుగాక" అని వరము నొసగి భద్రకాళి యంతర్ధానము నొందెను.

78) రాజా ! త్రిలోకోపకారార్థమై దేవతల శరీరతేజస్సులనుండి పూర్వ మొకపుడు ఆ మహాదేవి అవతరించి త్రిలోకములను

దేవీ దేవశరీరేభ్యో
జగత్త్రయహితైషిణీ ॥

79) పునశ్చ గౌరీదేహాత్ సా
సముద్భూతా యథాఽభవత్ ।
వధాయ దుష్టదైత్యానాం
తథా శుమ్భనిశుమ్భయోః ॥
80) రక్షణాయ చ లోకానాం
దేవానా ముపకారిణీ ।
తచ్ఛృణుష్వ మయాఽఽఖ్యాతం
యథావత్కథయామి తే ॥

ఇతి ద్వితీయోఽధ్యాయః.

రక్షించిన పుణ్యచరిత్రను చెప్పితిని.

79_80) మఱియు, మఱొకపుడు దుష్టరాక్షసులైన శుంభనిశుంభులను వధించుటకును, లోకముల రక్షించుటకును దేవమనుష్యుల కుపకార మొనరించెడు అంబిక లేక గౌరి కౌశికీరూపిణియై యుద్భవించిన యద్భుత చరిత్రనుగూడ సవిస్తారము వివరింతును- శ్రద్ధతో వినుము.

(ద్వితీయ చరిత్ర సంపూర్ణము)

# (109) తృతీయ చరిత్ర

| మూలము : | తాత్పర్యము : |
|---|---|
| 1) పురా శుమ్భనిశుమ్భాభ్యా<br>మసురాభ్యాం శచీపతేః ।<br>త్రైలోక్యం యజ్ఞభాగాశ్చ<br>హృతా మదబలాశ్రియాత్ ॥ | 1) పూర్వకాలమున శుంభనిశుంభు లనురాక్షసులు బలముచే మదించి శచీపతి యైన యింద్రుని, త్రిలోకములను, యజ్ఞభాగములను హరించిరి. |
| 2) తావేవ సూర్యతాం తద్వ<br>దధికారం తథైన్దవమ్ ।<br>కౌబేర మథ యామ్యం చ<br>చక్రాతే వరుణస్య చ ॥ | 2) వా రిద్దరే సూర్యచంద్రాధికారములను, కుబేరయమవరుణాధికారములను వహించిరి. |
| 3) తావేవ పవనర్ధిం చ<br>చక్రతుర్వహ్నికర్మ చ । | 3) అగ్నివాయువులయధికారమును తామే గ్రహించిరి. ఈరీతిగా వారు సర్వదేవతలను గెలిచి దేవతారాజ్యమును తామే |

తతో దేవా వినిర్ధూతా
భ్రష్టరాజ్యాః పరాజితాః ॥

4) హృతాధికారాస్త్రిదశా
స్తాభ్యాం సర్వే నిరాకృతాః ।
మహాసురాభ్యాం తాం దేవీం
సంస్మరన్త్యపరాజితామ్ ॥
5) తయాస్మాకం వరో దత్తో
యథాపత్సు స్మృతాఽఖిలాః ।
భవతాం నాశయిష్యామ
తత్క్షణాత్పరమాపదః ॥
6) ఇతి కృత్వా మతిం దేవా
హిమవన్తం నగేశ్వరమ్ ।
జగ్ముస్తత్ర తతో దేవీం

అనుభవించుచుండిరి. యుద్ధమున ఓడి
పోయిన దేవతలు స్వస్థానముల విడిచి
ఎక్కడనో తల దాచుకొనబోయిరి.
4) ఆ మహాసురులచే తమతమ యధికారము
లను గోల్పోయిన దేవతలెల్లరు అపరాజిత
యగు మహాదేవిని నిండుమనసుతో తలంచిరి.

5) మన కెట్టి మహాపదలు తటస్థించినను తనను
స్మరించినచో వెంటనే వానినెల్ల నివారింతు
నని మనకు వర మిచ్చియున్నదిగదా!

6) ఇట్లు మనస్సున తలంచి దేవతలు పర్వత
రాజైన హిమవత్పర్వతమువద్దకు వెళ్ళి
అక్కడ విష్ణుమాయాం భగవతీ దేవినిగూర్చి

విష్ణుమాయాం ప్రతుష్టువుః ॥
దేవా ఊచుః ॥

7) నమో దేవ్యై మహాదేవ్యై
శివాయై సతతం నమః ।
నమః ప్రకృత్యై భద్రాయై
నియతాః ప్రణతాః స్మ తామ్ ॥

8) రౌద్రాయై నమో నిత్యాయై
గౌర్యై ధాత్ర్యై నమో నమః ।
జ్యోత్స్నాయై చేందురూపిణ్యై
సుఖాయై సతతం నమః ॥

9) కల్యాణ్యై ప్రణతా వృద్ధ్యై
సిద్ధ్యై కుర్మో నమో నమః ।

యిట్లు స్తోత్రము చేసిరి.
దేవత లిట్లు నుతించిరి.

7) తల్లీ! జగన్మాతవు, మహాదేవివి, మంగళ మూర్తివి, ప్రకృతివి, క్షేమప్రదవు నగు నీకు నిరంతరము నియమబద్ధులమై ప్రణమిలుచున్నాము.

8) రౌద్రి, నిత్య, ధాత్రి, కౌముది, చంద్ర రూపిణి. సుఖరూపిణి యైనగారికి నమస్కారము.

9) కల్యాణి, వృద్ధిరూపిణి, సిద్ధిరూపిణి నిరృతి స్వరూపిణి, రాజ్యలక్ష్మి, శర్వాణి యగు నీకు నమస్కారము.

నైఋత్యై భూభృతాం లక్ష్మ్యై
శర్వాణ్యై తే నమో నమః ॥

10) దుర్గాయై దుర్గపారాయై
సారాయై సర్వకారిణ్యై ।
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై
ధూమ్రాయై సతతం నమః ॥

11) అతిసౌమ్యాతిరౌద్రాయై
నతాస్తస్యై నమో నమః ॥
నమో జగత్ప్రతిష్ఠాయై
దేవ్యై కృత్యై నమో నమః ॥

10) ఓదుర్గాదేవి ! సర్వక్లేశవినాశనీ, సారస్వరూపిణీ, సర్వకారిణీ స్వచ్ఛరూపిణీ, కృష్ణరూపిణీ,ధూమ్రరూపిణీ! నీకెల్లపుడు నమస్కారములు.

11) అతిసౌమ్య, అతిరౌద్రి,జగత్ప్రతిష్ఠారూపిణి కార్యరూపిణి యైనదేవికి నమస్కారములు.

☞ 12 శ్లోకము మొదలు 32 శ్లోకము వఱకు ప్రతిశ్లోకమునకు మొదటి పాదమును, మూడు నాల్గు పాదములును 12వ శ్లోకమున చూపినట్లే యుండునుగాన ... ఇట్టి గుర్తుతోడను, ,, ఇట్టి గుర్తుతోడను జూపబడినవి. అందుచేత ప్రతిశ్లోకమును బఠించునపుడు, మొదటి పాదమును, మూడు నాల్గుపాదములను చేర్చియే పఠించవలెను.

33)

| | |
|---|---|
| 12) యా దేవీ సర్వభూతేషు<br>విష్ణుమాయేతి శబ్దితా<br>నమ స్తస్యై నమ స్తస్యై<br>నమ స్తస్యై నమో నమః ॥ | 12) ఏ దేవి సర్వభూతములయందు విష్ణుమాయ యని చెప్పబడుచున్నదో ఆ మహాదేవికి నమస్కారము, నమస్కారము, నమస్కారము, |
| 13) యా దేవీ సర్వభూతేషు<br>చేతనే త్యభిధీయతే ... ...నమః | 13) ఏ దేవి చేతన (చిచ్ఛక్తి)యనియు |
| 14) ... బుద్ధిరూపేణ సంస్థితా ...నమః | 14) బుద్ధిరూపిణి యనియు |
| 15) ...నిద్రారూపేణ సంస్థితా ... ,, | 15) నిద్రారూపమున నివసించియున్నదో |
| 16) ... క్షుధారూపేణ సంస్థితా ... ,, | 16) ఆకలిరూపమున వర్తించుచున్నదో |
| 17) ...ఛాయారూపేణ సంస్థితా ... ,, | 17) ఛాయ లేక ప్రతిబింబరూపమున భాసించుచున్నదో |
| 18) ... శక్తిరూపేణ సంస్థితా ... ,, | 18) శక్తి లేక సామర్థ్యరూపమున ప్రకటితయగుచున్నదో |

| | |
|---|---|
| 19) ...తృష్ణారూపేణ సంస్థితా ... ,, | 19) ఆశా (కోరిక) రూపమున వ్యాపించు చున్నదో |
| 20) ... క్షాన్తిరూపేణ సంస్థితా .... ,, | 20) సహనరూపమున గోచరించుచున్నదో |
| 21) ... జాతిరూపేణ సంస్థితా .... ,, | 21) జాతిరూపమున ప్రవర్తించుచున్నదో |
| 22) ... లజ్జారూపేణ సంస్థితా .... ,, | 22) లజ్జ (సిగ్గు)రూపమున చూపట్టుచున్నదో |
| 23) ... శాన్తిరూపేణ సంస్థితా .... ,, | 23) శాంతిరూపమున నివసించుచున్నదో |
| 24) ... శ్రద్ధారూపేణ సంస్థితా .... ,, | 24) శ్రద్ధారూపమున తోచుచున్నదో |
| 25) ... కాన్తిరూపేణ సంస్థితా ... ,, | 25) కాంతిరూపమున మెరయుచున్నదో |
| 26) ... లక్ష్మీరూపేణ సంస్థితా .... ,, | 26) శోభారూపమున శోభించుచున్నదో |
| 27) ... వృత్తిరూపేణ సంస్థితా .... ,, | 27) జీవనోపాధిగా నటించుచున్నదో |
| 28) ... స్మృతిరూపేణ సంస్థితా .... ,, | 28) స్మృతి (జ్ఞప్తి)రూపమునవిలసిల్లుచున్నదో |
| 29) ... దయారూపేణ సంస్థితా .... ,, | 29) దయారూపమున బింబించుచున్నదో |

| | |
|---|---|
| ౩౦) ... తుష్టిరూపేణ సంస్థితా .... ,, | ౩౦) తుష్టి (చాలుననెడితృప్తి) రూపమున నున్నదో. |
| ౩౧) ... మాతృరూపేణ సంస్థితా .... ,, | ౩౧) మాతృ (తల్లి) రూపమున ప్రత్యక్ష మగుచున్నదో |
| ౩౨) .. భ్రాన్తిరూపేణ సంస్థితా .... ,, | ౩౨) భ్రాంతి (మోహము) రూపమున తోచుచున్నదో, [భ్రాంతి యనగా జగత్తు దేహేంద్రియ మనఃప్రాణములు సత్యమనుకొనుటయే ] |
| ౩౩, ఇన్ద్రియాణా మధిష్ఠాత్రీ<br>భూతానాం చాఖిలేషు యా<br>భూతేషు సతతం తస్యై<br>వ్యాప్తిదేవ్యై నమో నమః ॥ | ౩౩) ఇంద్రియములను ప్రేరేపించుచు, ఇంద్రియాతీతయై సకలభూతములందు(వ్యాపించి) సూత్రాత్మయై ప్రకాశించుచున్నదో. |
| ౩౪) చితిరూపేణ యా కృత్స్న<br>మేతద్వ్యాప్య స్థితా జగత్ । | ౩౪) ప్రత్యక్ష చిద్రూపము (చేతనత్వము) చే జగత్తునం దెల్లయెడల నిండి సర్వాంతర్యా |

నమ స్తస్యై, నమ స్తస్యై,
నమ స్తస్యై నమో నమః ॥

35) స్తుతా సురైః పూర్వమభీష్టసంశ్రయా ।
తథా సురేన్ద్రేణ దినేషు సేవితా ।
కరోతు సా నః శుభహేతు రీశ్వరీ ।
శుభాని భద్రాణ్యభిహన్తు చాపదః ॥

మిగా, అమృతస్వరూపగా నున్నదో ఆమహా దేవికి ముమ్మారు నమస్కారములు; నూఱు నమస్కారములు, వేయి నమస్కారములు. లక్ష నమస్కారములు, కోటి నమస్కారములు; లెక్కలేనన్ని నమస్కారములు

35 పూర్వకాలమున దేవతలు ఏదేవి నారాధించి యభీష్టములను పొందియుండిరో, యిప్పుడు దేవతలమైనమాచే ఏ దేవి స్తుతించబడెనో, ఇంద్రునిచే సనకసనందనాదులచే ప్రతిదినము బహుకాలము నేదేవి యర్చించబడెనో సర్వశుభములకు హేతుభూతురాలైన ఆపరమేశ్వరి మాఆపదలను బోగొట్టి, మాకు శుభములను ప్రసా



34)

36) యా సామ్ప్రతం చోద్ధతదైత్యతాపితై
రస్మాభిరీశా చ సురై ర్నమస్యతే ।
యా చ స్మృతా తత్‍క్షణమేవ హన్తి నః ।
సర్వాపదో భక్తివినమ్రమూర్తిభిః ॥

37) ఏవం స్తవాదియుక్తానాం
దేవానాం తత్ర పార్వతీ ।
స్నాతు మభ్యాయయౌ తోయే
జాహ్నవ్యా నృపనన్దన! ॥

38) సాబ్రవీ త్తాన్ సురాన్ సుభ్రూ
ర్భవద్భిః స్తూయతేఽత్ర కా
శరీరకోశత శ్చాస్యాః
సముద్భూతాఽబ్రవీ చ్ఛివా ॥

దించునుగాక !

36) ప్రచండరాక్షసులచే మాకు సంభవించిన దుఃఖమును నడంచుట కే దేవి మాచే స్తుతించబడెనో, ఆ దేవి భక్తినమ్రముల మగు మాకు ప్రసన్నురా లగునుగాక !

37) ఇట్లు దేవతలు స్తోత్రముచేయుచున్న సమయమున గంగాతోయమున స్నానము చేయుటకై వచ్చుచున్న పార్వతీదేవి వారి యెదుట గానిపించెను.

38) గుండ్రనికనుబొమలతో శోభించుపార్వతీదేవి 'దేవతలారా! మీ రే దేవతను స్తోత్రముచేయుచున్నా'రనిఅడుగుచుండగా పార్వతీశరీరమునుండి శివాఖ్య గలయొక శక్తి పుట్టి యిట్లనెను.

నిశమ్యేతి వచః శ్రుత్వా
స తదా చణ్డముణ్డయోః
ప్రేత యామాస సుగ్రీవం
దూతం దేవ్యా మహాసురః

---

శరీరకోశా ద్యత్తస్యాః
పార్వత్యాని ఃసృతామ్బికా



కౌశికీ మహాదేవి

యో మాం జయతి సంగ్రామే
యో మే దర్పం వ్యపోహతి
యో మే ప్రతిబలో లోకే
స మే భర్తా భవిష్యతి.

---

కౌశికీతి సమస్తేషు
తతో లోకేషు గీయతే

39) స్తోత్రం మమైతత్ క్రియతే
శుమ్భదైత్యనిరాకృతైః
దేవైః సమేతైః సమరే
నిశుమ్భేన పరాజితైః ॥

40) శరీరకోశా ద్యత్తస్యాః
పార్వత్యా నిఃసృతామ్బికా ।
కౌశికీతి సమస్తేషు
తతో లోకేషు గీయతే ॥

41) తస్యాం వినిర్గతాయాం తు
కృష్ణాభూత్సాపి పార్వతీ ।
కాళికేతి సమాఖ్యాతా
హిమాచలకృతాశ్రయా ॥

39) యుద్ధమున శుంభనిశుంభరాక్షసులచే ఓడింపబడి, తఱిమివేయబడుటచే రాజ్యభ్రష్టులయి యీ దేవతలందరు నన్ను గూర్చి యిట్లు స్తోత్రము చేయుచున్నారనుచుండగా

40) పార్వతీశరీరమునుండి ఒక తేజస్సుద్భవించి తొలుత అంబిక యనుపేర బరగి, పిదప పార్వతీశరీరకోశమునుండి పుట్టుటచే కౌశికి యని సర్వలోకములందును పిలువబడుచున్నది.

41) పార్వతీశరీరమునుండి ఆకౌశికి ఉద్భవించినందున పార్వతీదేవి కళావిహీనయై నల్లని రూపము గల్గి కాళిక యని పిలువబడుచు హిమాచలము నాశ్రయించెను.

42) తతోఽమ్బికాం పరం రూపం
బిభ్రాణాం సుమనోహరామ్ ।
దదర్శ చణ్డో ముణ్డశ్చ
భృత్యౌ శుమ్భనిశుమ్భయోః ॥

43) తాభ్యాం శుమ్భాయ చాఖ్యాతా
సాతీవ సుమనోహరా ।
కాప్యాస్తే స్త్రీ మహారాజ!
భాసయన్తీ హిమాచలమ్ ॥

44) నైవ తాదృక్ క్వచిద్రూపం
దృష్టం కేన చిదుత్తమమ్ ।
జ్ఞాయతాం కాప్యసౌ దేవీ
గృహ్యతాం చాసురేశ్వర! ॥

42) అప్పుడు శుంభనిశుంభ రాక్షసుల భృత్యు లయిన చండుడు, ముండుడనువారు మహా మనోహరరూపముతో వెలుగొందు అంబిక యనుకౌశికిఅమ్మవారిని చూచి దిగ్భ్రాంతులైరి.

43) వారిద్దరు శుంభునికడకు వెళ్ళి 'ఓ ప్రభూ ! మిక్కిలి మనోహర మైనదయొకానొక స్త్రీ హిమాచలాగ్రమునందు శోభించుచున్న' దని చెప్పిరి.

44) అసురేశ్వర! అట్టి ఉత్తమరూపవతి నిప్పటి కెక్కడను మీరు చూచియుండరు. ఆ దేవి యెవరో తెలిసికొని మీరు గ్రహించతగును

45) స్త్రీరత్న మతిచార్వంగీ
ద్యోతయన్తీ దిశ స్త్విషా ।
సా తు తిష్ఠతి దైత్యేన్ద్ర
తాం భవాన్ ద్రష్టు మర్హతి ॥

46) యాని రత్నాని మణయో
గజాశ్వాదీని వై ప్రభో!
త్రైలోక్యే తు సమస్తాని
సామ్ప్రతం భాన్తి తే గృహే ॥

47 ఐరావతః సమానీతో
గజరత్నం పురన్దరాత్ ।
పారిజాతతరు శ్చాయం
తథై వోచ్చైః శ్రవా హయః ॥

45) ఆమె స్త్రీలలో రత్నము. అతిసుందర శరీరము గలది. ఆమె తేజస్సు సర్వదిక్కులను వెలిగింపజేయుచున్నది-అదిగో యచట ఆమె కూర్చుండియున్నది, గాన కనులార చూడుడు.

46) ఓ రాజా! మూడులోకములయందు గల శ్రేష్ఠము లగురత్నములు, మణులు, గజాశ్వాదులు, సమస్తము ఇప్పుడు తమ గృహమునందు శోభించుచున్నవి.

47) గజరత్న మైనఐరావతమును, పారిజాత వృక్షము, ఉచ్చైశ్శ్రవ మనునుత్తమాశ్వము ఇంద్రుని ఓడించి సంగ్రహించితిరి.

48) విమానం హంససంయుక్త
మేత త్తిష్ఠతి తేఽజ్గణే.
రత్నభూత మిహానీతం
యదాసీ ద్వేధసోఽద్భుతమ్।

48) రత్నఖచితమై అద్భుతమైన బ్రహ్మదేవుని విమానశ్రేష్ఠము హంస యుక్తముగా భూలోకమునకు తెచ్చి మీ అంగణమున నుంచితిరి.

49) నిధి రేష మహాపద్మః
సమానీతో ధనేశ్వరాత్।
కిఞ్జల్కినీం దదౌ చాబ్ధి
ర్మాలా మమ్లానపఙ్కజామ్॥

49) కుబేరుని త్రోసిపుచ్చి మహాపద్మ మను ధననిధిని స్వాధీనముచేసికొంటిరి. సముద్రుడెన్నటికిని వాడనికింజల్కములుగల పద్మమాలలను మీకు సమర్పించెను.

50) ఛత్రం తే వారుణం గేహే
కాఞ్చనస్రావి తిష్ఠతి
తథాఽయం స్యన్దనవరో
యః పురాసీ త్ప్రజాపతేః॥

50) స్వర్ణమును ప్రసవించెడువరుణచ్ఛత్రము బ్రహ్మకడనుండి తేబడినరథశ్రేష్ఠము తమ గృహమున నున్నవి.

51) మృత్యో రుత్క్రాన్తిదా నామ
శక్తి రీశ! త్వయా హృతా।

51) మహారాజ! మృత్యూత్క్రాంతిద యనెడిగొప్ప ఆయుధము యమునినుండిగూడ హారించ

పాశః సలిలరాజస్య
భ్రాతుస్తవ పరిగ్రహే॥

53) నిశుమ్భస్యాబ్ధిజాతాశ్చ
సమస్తా రత్నజాతయః।
వహ్నిశ్చాపి దదౌ తుభ్య
మగ్నిశౌచే చ వాససీ॥

53) ఏవం దైత్యేన్ద్ర! రత్నాని
సమస్తాన్యాహృతాని తే।
స్త్రీరత్నమేషా కల్యాణీ
త్వయా కస్మాన్న గృహ్యతే॥

54) ఇత్యాకర్ణ్య వచః శుమ్భ
స్స తదా చణ్డముణ్డయోః।
ప్రేషయామాస సుగ్రీవం
దూతం దేవ్యా మహాసురమ్॥

బడియున్నది. సముద్రరాజుయొక్క పాశము నీతమ్మునికొరకు గ్రహించితిరిగదా!

52) రాజా! సముద్రోత్పన్నములగు సమస్తరత్నజాతులు నీతమ్ముడు నిశుంభునిగృహమున నున్నవి. అగ్నిహోత్రుడు తనవలె పరిశుద్ధములై మెరయువస్త్రయుగ్మమును మీకు సమర్పించియున్నాడు.

53) దైత్యేంద్రా! ఇట్లు సమస్త ప్రశస్తవస్తువులు మీచే హరించబడి తరుగులేక మీగృహమునందున్నవి. అట్టిచో కల్యాణనిదానమగు ఈ స్త్రీరత్నమును మీరు గ్రహించుట చాల సముచితము-అని చెప్పిరి.

54) శుంభుడు ఆచండముండాసురులవచనములు విని, మహాసురుడైనసుగ్రీవుని దూతగా దేవిసన్నిధికి క్రిందిరీతిగా చెప్పి పంపెను.

55) ఇతి చేతి చ వక్తవ్యా
సా గత్వా వచనాన్మమ ।
యథా చాభ్యేతి సమ్ప్రాప్తా
తథా కార్యం త్వయా లఘు॥

55) నీవు ఆమెకడకు వెళ్ళి నావచనములుగా నెట్లుచెప్పిన ఆమె సంతోషముతో నిచటికి వచ్చునో అట్లు చెప్పి, శీఘ్రముగా తీసికొనిరమ్ము.

56) స తత్ర గత్వా యత్రాస్తే
శైలోద్దేశేఽతిశోభనా ।
సా దేవీ; తాం తతః ప్రాహ
శ్లక్ష్ణం మధురయా గిరా ॥

56) అతిశోభాయమాన మైనపర్వతముపై దేవి యున్నస్థలమునకు బోయి ఆదైత్యదూత దేవితో లక్షణ మైనమధుర వాక్కులతో నిట్లు చెప్పెను.

దూత ఉవాచ

దూత చెప్పుచున్నాడు.

57) దేవి ! దైత్యేశ్వరః శుమ్భ
స్త్రైలోక్యే పరమేశ్వరః ।
దూతోఽహం ప్రేషిత స్తేన
త్వత్సకాశ మిహాగతః ॥

57) దేవీ! త్రిలోకపరమేశ్వరుడు, దైత్యరాజు నగుశుంభునిచే దూతగా పంపబడి నీదగ్గర కిపుడు నేను వచ్చితిని.

58) అవ్యాహతాజ్ఞ స్సర్వాసు
యః సదా దేవయోనిషు ।
నిర్జితాఖిలదైత్యారి
స్స యదాహ శృణుష్వ తత్ ॥

58) సమస్తదేవతలను ఓడించి, వారిని తనఆజ్ఞానువర్తులనుగా చేసికొనిన యాశుంభుడు నీతో చెప్పుమనినపలుకులు వినుము.

59) మమ త్రైలోక్య మఖిలం
మమ దేవా వశానుగాః ।
యజ్ఞభాగా నహం సర్వా
నుపాశ్నామి పృథక్ పృథక్ ॥

59) త్రిలోకములు నావి. దేవతలు నాకువశ్యులు. సమస్తయజ్ఞహవిర్భాగములను నేను వేఱువేఱుగా భక్షించుచున్నాను.

60) త్రైలోక్యే వరరత్నాని
మమ వశ్యా న్యశేషతః ।
తథైవ గజరత్నం చ
హృతం దేవేన్ద్రవాహనమ్ ।

60) ముల్లోకములలో (శ్రేష్ఠమై, రత్నకల్పములగు సమస్తవస్తువులు నాయొద్దనున్నవి. దేవేంద్రవాహనమైనఐరావతగజరత్నమును నేను గ్రహించితిని.

61) క్షీరోదమథనోద్భూత
మశ్వరత్నం మమామరైః

61) క్షీరసముద్రమథనకాలమున పుట్టినఉచ్చైశ్శ్రవస్సంజ్ఞగల యశ్వరత్నమును నాకు దేవతలు వందనపూర్వకముగ

ఉచ్చైశ్శ్రవససంజ్ఞం త
త్పాణిపత్యై సమర్పితమ్ ॥

62) యాని చాన్యాని దేవేషు
గన్ధర్వేషూరగేషు చ।
రత్నభూతాని భూతాని
తాని మయ్యేవ శోభనే! ॥

63) స్త్రీరత్నభూతాం త్వాం దేవి!
లోకే మన్యామహే వయమ్।
సా త్వ మస్మా నుపాగచ్ఛ
యతో రత్నభుజో వయమ్॥

64) మాం వా మమానుజం వాపి
నిశుమ్భ మురువిక్రమమ్।
భజ త్వం చఞ్చలాపాఙ్గి!
రత్నభూతాసి వై యతః।

సమర్పించియున్నారు.

62) ఓసుందరి! దేవనాగగంధర్వాదులకడ ఏయేయుత్తమవస్తువు లుండెనో అవి యన్నియు నాయధీనమై యున్నవి.

63) దేవీ! సర్వలోకములలో నిన్ను మేము స్త్రీరత్నముగా నెన్నుచున్నాము. పరిభువులము గాన మేము రత్నహారులము మమ్ము నీవు పొందుము.

64) చంచలాక్షి! నీవు స్త్రీరత్నమవుగనుక నన్నుగాని మహాపరాక్రమవంతుడైన నాతమ్ముడు నిశుంభునిగాని చేపట్టుము.

65) పరమైశ్వర్య మతులం
ప్రాప్స్యసే మత్పరిగ్రహాత్।
ఏతద్బుద్ధ్యా సమాలోచ్య
మత్పరిగ్రహతాం వ్రజ॥

65) మరియు నన్ను వివాహమాడుటచే సమానోత్కృష్టైశ్వర్యము ననుభవింతువు. ఇది లెస్సగా ఆలోచించుకొని నన్ను పరిగ్రహించుము- అని శుంభుడు చెప్పిపంపినట్లు దూత వినిపించెను.

66) ఇత్యుక్త్వా సా తదా దేవీ
గమ్భీరాన్తఃస్మితా జగౌ।
దుర్గా భగవతీ భద్రా
యయేదం ధార్యతే జగత్॥

66) అంత త్రిలోకాధారభూత యగు ఆదుర్గాభగవతి గంభీరముగా లోలో నవ్వుకొని, సుగ్రీవాసురునితో నిట్లనెను.

దేవ్యువాచ

దేవి చెప్పుచున్నది.

67) సత్యముక్తం త్వయా నాత్ర
మిథ్యా కిఞ్చిత్త్వయోదితమ్।
త్రైలోక్యాధిపతి శ్శుమ్భో
నిశుమ్భశ్చాపి తాదృశః॥

67) నీవు చెప్పినదంతయు సత్యమే. కించిత్తైనఅసత్యము గాదు. శుంభుడు త్రిలోకాధిపతి; నిశుంభుడును అంతటివాడే యగును.

68) కిం త్వత్ర యత్ప్రతిజ్ఞాతం
మిథ్యా తత్క్రియతే కథమ్।
శ్రూయతా మల్పబుద్ధిత్వా
త్ప్రతిజ్ఞా యా కృతా పురా॥

69) యో మాం జయతి సఙ్గ్రామే
యో మే దర్పం వ్యపోహతి।
యో మే ప్రతిబలో లోకే
స మే భర్తా భవిష్యతి ॥

70) తదాగచ్ఛతు శుమ్భోఽత్ర
నిశుమ్భో వా మహాసురః
మాం జిత్వా కిం చిరేణాత్ర
పాణిం గృహ్ణాతు మే లఘు ॥

దూత ఉవాచ ॥

68) కాని; నేను చేసినప్రతిజ్ఞ తప్పుదానను గాను. పూర్వము నేను విచారణ లేక యొకప్రతిజ్ఞ చేసియున్నాను వినుము.

69) ఎవడు నన్ను యుద్ధమున నన్నెదిరించి నాగర్వమును పోగొట్టి నన్ను జయించునో యతడే నాకు భర్త కాదగు ననునది నాప్రతిజ్ఞ.

70) కనుక శూరులు శుంభుడుగాని నిశుంభుడుగాని యిచటికి వచ్చి, నన్ను యుద్ధమున జయించి, శీఘ్రముగా వివాహ మాడవచ్చును జాగు చేయ నక్కర లేదనియు చెప్పుము.

దూత ఉవాచ ॥

71) అవలిప్తాసి మైవం త్వం
దేవి! బ్రూహి మమాగ్రతః।
త్రైలోక్యే కః పుమాంస్తిష్ఠే
దగ్రే శుమ్భనిశుమ్భయోః॥

72) అన్యేషామపి దైత్యానాం
సర్వే దేవా న వై యుధి।
తిష్ఠన్తి సమ్ముఖే దేవి!
కిం పునః స్త్రీ త్వమేకికా?

73) ఇంద్రాద్యాస్సకలా దేవా
స్తస్థుర్యేషాం న సంయుగే।
శుమ్భాదీనాం కథం తేషాం
స్త్రీ ప్రయాస్యసి సమ్ముఖమ్ ॥

74) సా త్వం గచ్ఛ మయైవోక్తా
పార్శ్వం శుమ్భనిశుంభయోః।

71) దేవీ! నీవు గర్విష్ఠురాలవై నాయెదుట నిట్లు పలుకకుము. మూడులోకములలో శుంభనిశుంభుల యెదుట నిలువ జాలు పురుషుడొక్కడైన గలడా ?

72) ఎందును లేడు. వారిమాట యట్లుంచుము-మారాక్షసుల యెదుట నిలువలేక సమస్తదేవతలును యుద్ధమున పాఱి పోయి యున్నారు. ఇక నీవో అబలవు, స్త్రీవి; అందును ఒంటరిదానవు.

73) ఇంద్రుడును సకలదేవతలును ఆశుంభనిశుంభులయెదుట నిలువలేక యుద్ధమున ఓడి పారిపోయి యున్నారు. స్త్రీవైననీ వెట్లు నిలువనేర్తువు ?

74) ఇప్పుడు నీవు నామాట విని శుంభనిశుంభులసన్నిధికి పొమ్ము. అట్లు మర్యాదతో పోనియెడల వారు నిన్ను తల

| | |
|---|---|
| కేశాకర్షణనిర్ధూత<br>గౌరవా మా గమిష్యసి॥ | వెండ్రుకలు పట్టి యీడ్చుకొనిపోగలరుసుమా ? |
| దేవ్యువాచ. | అమ్మవారు చెప్పుచున్నది. |
| 75) ఏవ మేతద్ బలీ శుమ్భో<br>నిశుమ్భ శ్చాతివీర్యవాన్<br>కిం కరోమి ప్రతిజ్ఞా మే<br>య దనాలోచితా పురా॥ | 75) నీవు చెప్పినట్లు శుంభనిశుంభులు బలపరాక్రమవంతులే. కాని నేను దూరాలోచన లేక పూర్వము చేసినప్రతిజ్ఞ నెట్లు విడిచివేయుదును ? |
| 76) స త్వంగచ్ఛ మయోక్తం తే<br>య దేత త్సర్వ మాదృతః।<br>తదాచక్ష్వాసురేన్ద్రాయ<br>స చ యుక్తం కరోతుయత్॥ | 76) నీవు వెళ్ళి నేను చెప్పినదంతయు సాదరముగా దైత్యేంద్రుడైన శుంభునితో చెప్పుము. అతనికి ఏది యుక్తమని తోచునో అట్లే చేయనిమ్ము. |
| 77) ఇత్యాకర్ణ్య వచో దేవ్యా<br>స్స దూతోఽ మర్షపూరితః। | 77) ఆదూత దేవీవచనములు విని మండిపడుచు శుంభునివద్దకు వచ్చి జరిగిన దంతయు విస్తరించి విన్నవించెను. |

సమాచష్ట సమాగమ్య
దైత్యరాజాయ విస్తరాత్ ॥

78) తస్య దూతస్య తద్వాక్య
మాకర్ణ్యాసురరాట్ తతః।
సక్రోధః ప్రాహ దైత్యానా
మధిపం ధూమ్రలోచనమ్।

79) హే ధూమ్రలోచనాశు త్వం
స్వసైన్యపరివారితః।
తా మానయ బలా ద్దుష్టాం
కేశాకర్షణవిహ్వలామ్॥

80) తత్పరిత్రాణదః కశ్చి
ద్యది వో త్తిష్ఠతేఽపరః।
స హన్తవ్యోఽమరో వాపి
యక్షో గన్ధర్వ ఏవ వా ॥

78) ఆదూతవాక్యములు అసురరాజైన శుంభుడు విని క్రోధముతో రాక్షససేనాధిపతియైన ధూమ్రలోచనునితో నిట్లనెను.

79) ఓయీ! ధూమ్రలోచన! నీవు సైన్యముతో వెళ్ళి ఆదుష్టురాలిని బలాత్కారముగా తలవెండ్రుకలు పట్టి యీడ్చుకొని యిక్కడికి తీసికొనిరమ్ము.

80) ఆమెను రక్షించుటకెవడేని దివ్యుడుగాని, యక్షుడుగాని, గంధర్వుడుగాని అడ్డమువచ్చినయెడల వానిని చంపివేయుము

౮౧) తేనాజ్ఞప్త స్తత శ్శీఘ్రం
స దైత్యో ధూమ్రలోచనః
వృతః షష్ట్యా సహస్రాణా
మసురాణాం ద్రుతం యయౌ॥

౮౧) శుంభునిచే నిట్లాజ్ఞాపింపబడి యారాక్షససేనాపతి వెంటనే అఱువది వేలమంది రాక్షసులను వెంటబెట్టుకొని త్వరగా ప్రయాణము చేసెను.

౮౨) స దృష్ట్వా తాం తతో దేవీం
తుహినాచలసంస్థితామ్.
జగాదోచ్చైః ప్రయాహీతి
మూలం శుమ్భనిశుమ్భయోః॥

౮౨) ధూమ్రలోచనుడు హిమవత్పర్వతము నధిష్ఠించియున్న ఆమహాలక్ష్మీదేవిని చూచి శుంభనిశుంభుల యొద్దకు నడువుమని బిగ్గరగా గర్జించెను.

౮౩) న చేత్ప్రీత్యాద్య భవతీ
మద్భర్తార ముపైష్యతి।
తతో బలా న్నయా మ్యేష
కేశాకర్షణవిహ్వలామ్।

౮౩) ఇప్పుడు నీవు ప్రీతిపూర్వకముగా మాప్రభుసన్నిధికి రాని యెడల నేను నీతలబట్టి బలాత్కారముగా లాగుకొని వెళ్ళగలను అనెను.

దేవ్యువాచ

అమ్మవారు చెప్పుచున్నది.

84) దైత్యేశ్వరేణ ప్రహితో
బలవాన్ బలసంవృతః।
బలాన్నయసి మామేవం
తతః కిం తే కరోమ్యహమ్॥

85) ఇత్యుక్తస్సోఽభ్యధావత్తా
మసురో ధూమ్రలోచనః।
హుంకారేణైవ తం భస్మ
సా చకారాంబికా తతః॥

86) అథ క్రుద్ధం మహాసైన్య
మసురాణాం తథాంబికామ్।
వవర్ష సాయకైస్తీక్ష్ణై
స్తథా శక్తిపరశ్వధైః॥

84) ధూమ్రలోచన! నీవు ఆశుంభునిచే ఆజ్ఞాపించబడి వచ్చితివి. నీవు చెప్పినట్లు చేయ సమర్థుడవు. స్వయముగా బలవంతుడవు. అంతను సేనానాయకుడవు. మహాసేనాసహితుడవు. నన్ను నీవు బలాత్కారముగా నాకొప్పు బట్టి యీడ్చుకొనివెళ్ళెదవేని నిన్ను నే నేమి చేయగలను ?

85) అట్లు దేవి చెప్పగానే ధూమ్రలోచను డాదేవిశిరోజములను పట్టుకొనుటకు దాపునకు పరుగెత్తగా ఆమహాలక్ష్మి కోపించి హుంకారముచేయగనే ధూమ్రలోచనుడు భస్మమైపోయెను.

86) పిమ్మట కోపోద్రిక్తులై రాక్షససైనికులు అంబికపై తీక్ష్ణ బాణములను శక్తిపరశ్వధములను కురిపించిరి.

87) క్షణేన తద్బలం సర్వం
క్షయం నీతం మహాత్మనా।
తేన కేసరిణా దేవ్యా
వాహనే నాతికోపినా॥

88) శ్రుత్వా త మసురం దేవ్యా
నిహతం ధూమ్రలోచనమ్।
బలం చ క్షయితం కృత్స్నం
దేవీ కేసరిణా తతః ॥

89) చుకోప దైత్యాధిపతి
శ్శుమ్భః ప్రస్ఫురితాధరః ।
ఆజ్ఞాపయామాస చ తౌ
చణ్డముణ్డౌ మహాసురౌ ॥

90) హే చణ్డ! హే ముణ్డ! బలై
ర్బహుభిః పరివారితౌ ।

87) అపుడు దేవీవాహనభూతుడు మహాక్రుద్ధుడు మృగరాజు నగుసింహము క్షణములో ఆరాక్షససేన నంతను సంహరించెను.

88) దేవిచే ధూమ్రలోచనుడు చంపబడుటయు, సింహముచే సర్వరాక్షససేన నాశముచేయబడుటయు శుంభుడు వినెను.

89) దైత్యాధిపతి, శుంభుడు మండిపడెను. చండముండు లను రాక్షసులను బిలిచి, పెదవు లదరుచుండ నిట్లాజ్ఞాపించెను.

90) ఓచండ! ఓముండ! మీరు బహుసేనను తీసికొని యామె యొద్దకు వెళ్ళి. ఆమెను శీఘ్రముగా నిక్కడికి తీసికొని

గచ్ఛతం తత్ర గత్వా చ
సా సమానీయతాం లఘు॥

91) కేశేష్వాకృష్య బద్ధ్వా వా
యది వః సంశయో యుధి।
తదాఽశేషాయుధైః సర్వై
రసురై ర్వినిహన్యతామ్॥

92) తస్యాం హతాయాం
దుష్టాయాం
సింహే చ వినిపాతితే।
శీఘ్రమాగమ్యతాం బద్ధ్వా
గృహీత్వా తామథామ్బికామ్॥

93) ఆజ్ఞప్తా స్తే తతో దైత్యా
శ్చణ్డముణ్డపురోగమాః।

రండు.

91) ఆమె వచ్చుటకు వెనుకాడెనా ఆమె వెండ్రుకలు పట్టు
కొని గాని, త్రాటితో నంటగట్టిగాని తీసికొనిరండు.
యుద్ధమున మీ కట్లు వీలుగాదని సంశయము కలిగిన
సమస్తాయుధములను ప్రయోగించి ఆ దేవిని చంపివేయుడు

92) అట్లు ఆదుష్టురాలిని ఆసింహమును చంపినతోడనే అంబి
కా దేవిశవమునైన ఇక్కడికి చేకొని శీఘ్రముగా రండని
ఆజ్ఞాపించెను.

93) చండముండాదిరాక్షసులు శుంభునిచే అట్లాజ్ఞాపించబడి
చతురంగబలముతో నాయుధపాణులై దేవి యుండుస్థల

| | |
|---|---|
| చతురంగబలోపేతా<br>యయురభ్యుద్యతాయుధాః॥ | మునకు వెళ్ళిరి. |
| 94) దదృశుస్తే తతో దేవీ<br>మీషద్ధాసాం వ్యవస్థితామ్।<br>సింహస్యోపరి శైలేన్ద్ర<br>శృఙ్గే మహతి కాఞ్చనే। | 94) హిమాచల స్వర్ణమయ శృంగమునందు సింహవాహనారూఢురాలయి చిరునగవుతో నున్న దేవిని వారు చూచిరి. |
| 95) తేదృష్ట్వా తాంసమాదాతు<br>ముద్యమ ఇచ్ఛక్రు రుద్యతాః<br>ఆకృష్టచాపాసిధరా<br>స్తథాఽన్యే తత్సమీపగాః॥ | 95) వారు అమ్మవారిని చూచి ఖడ్గపాణులై ధనుస్సు ఎక్కుపెట్టి సంతోషముతో అమ్మవారిని పట్టుకొనుటకు సమీపమునకు వెళ్ళిరి. |
| 96) తతః కోపం చకారోచ్చై<br>రమ్బికా తానరీన్ప్రతి।<br>కోపేన చాస్యా వదనం<br>మషీవర్ణమభూత్తదా॥ | 96) అప్పు డంబికాదేవి ఆవచ్చినచండముండాదిరాక్షసులపై నత్యంతకోపమున మండిపడుటచే నామెముఖము నలుపు వర్ణము గలదయ్యెను. |

97) భ్రుకుటీకుటిలాత్తస్యా
లలాటఫలకాద్ద్రుతమ్।
కాళీ కరాళవదనా
వినిష్క్రాన్తాఽసిపాశినీ॥

98) విచిత్రఖట్వాఙ్గధరా
నరమాలావిభూషణా।
ద్వీపిచర్మపరీధానా
శుష్కమాంసాతిభైరవా॥

99) అతివిస్తారవదనా
జిహ్వాలలనభీషణా।
నిమగ్నారక్తనయనా
నాదాపూరితదిఙ్ముఖా॥

100) సా వేగేనాభిపతితా
ఘాతయన్తీ మహాసురాన్।

97) ముడిపెట్టిన కనుబొమలు గలయంబికాదేవినొసటినుండి భీకరముఖముతో ఖడ్గపాశములను ధరించిన కాళికాదేవి పుట్టెను

98) ఆ కాళి కపాలభూషణములు, కపాలహారములు ధరించి, పులిచర్మమును గట్టుకొనియుండెను. అస్థిగతమాంసమైన విచిత్రఖట్వాంగములు ధరించి అతిభయంకరరూపముతో చూపట్టెను.

99) ఆమె నోరు మిక్కిలిపెద్దదిగ నుండెను. లోపలికి పోయిన యెఱ్ఱని నేత్రములు గల ఆ కాళికాదేవి నాలుక నాడించుచు సర్వదిశలు మారుమ్రోగున ట్లొకధ్వనిని చేయుచు రాక్షససేనపై కురికెను.

100) అట్లు పరుగెత్తివచ్చి పైబడి దేవిని పట్టుకొనుటకు వచ్చియున్న చండాద్యసురులసైన్యముపై కాళికాదేవి దుమికి

సైన్యే తత్ర సురారీణా
మభక్షయత తద్బలమ్ ॥

వారిని భక్షించుచుండగా దేవీశరీరమునుండి ఉద్భవించిన నవకోటిశక్తులు, బ్రహ్మేంద్రాది దేవతలశరీరమునుండిపుట్టిన మాతృగణము ఆ రాక్షససేనను హతమార్చుచుండిరి.

101) శిర శ్చణ్డస్య కాళీ చ
గృహీత్వా ముణ్డమేవ చ।
ప్రాహ ప్రచణ్డాట్టహాస
మిశ్ర మభ్యేత్య చణ్డికామ్॥

101) కాళికాదేవి చండముండుల నిద్దరను ఖండించి గొప్పగా నవ్వుచు గర్వముతో వారి శిరస్సులను తెచ్చి దేవి పాదములం దుంచి యిట్లు విన్నవించెను.

102) మయా తవాత్రోపహృతౌ
చణ్డముణ్డౌ మహాపశూ।
యుద్ధయజ్ఞే స్వయం శుమ్భం
నిశుమ్భం చ హనిష్యసి ।

102) ఈయుద్ధ మనుయజ్ఞమున చండముండు లనెడిమహాపశువుల సంహారించి వారిశిరస్సుల తెచ్చి సమర్పించితిని ఇక శుంభనిశుంభు లనుమహాపశువులను నీవు స్వయముగా సంహారించవలయు ననెను.

103) యస్మాచ్చణ్డం చ ముణ్డంచ
గృహీత్వాత్వ ముపాగతా।

103) ఓ కాళీ! నీవు చండముండులను సంహారించి వారిశిరస్సులు తెచ్చి సమర్పించినందున చాముండాదేవి యని లోక

| | |
|---|---|
| చాముణ్డేతి తతో లోకే<br>ఖ్యాతా దేవి! భవిష్యసి॥ | మున గొప్ప ఖ్యాతిని పొందగలవు. |
| 104) పలాయనపరాన్ దృష్ట్వా<br>దైత్యాన్మాతృగణార్దితాన్।<br>యోద్ధు మభ్యాయయౌ క్రుద్ధో<br>రక్తబీజో మహాసురః ॥ | 104 చండముండులు సంహరించబడి, దేవతా మాతృగణముచే పీడింపబడి చావగా మిగిలిన రాక్షసులు పారిపోవుటను రక్తబీజుడను రాక్షసుడు చూచి కోపమున దేవితో యుద్ధముచేయుటకు వచ్చెను. |
| 105) రక్తబిన్దు ర్యదా భూమౌ<br>పత త్యస్య శరీరతః ।<br>సముత్పతతి మేదిన్యాం<br>తత్ప్రమాణ స్తదాసురః॥ | 105) రక్తబీజునిశరీరమునుండి యెన్నిరక్తబిందువులు భూమిమీాద పడుచుండెనో అందరు రాక్షసులు పుట్టుచుండుట యేగాక ఆపుట్టినవారిశరీరమునుండి భూమిమీాద పడినప్రతి రక్తపుబిందువునుండియు సమాన బలపరాక్రమవంతులగు రక్తబీజులు పుట్టుచుండిరి. |
| 106) శక్త్యా జఘాన కౌమారీ<br>వారాహీ చ తథాసినా। | 106) దేవతల శరీరమునుండి పుట్టినమాతృ గణములోనికౌమారీ శక్తిశక్త్యాయుధముతో, వారాహీశక్తి ఖడ్గముతో, |

మాహేశ్వరీ త్రిశూలేన
రక్తబీజం మహాసురమ్॥

107) స చాపి గదయా దైత్యః
సర్వా ఏవాహనత్ పృథక్ ।
మాతౄః కోపసమావిష్టో
రక్తబీజో మహాసురః॥

108) తస్యాహతస్య బహుధా
శక్తిశూలాదిభి ర్భువి।
పపాత యో వై రక్తౌఘ
స్తేనాసఞ్ఛతశోఽసురాః॥

109) తైశ్చాసురాసృక్సమ్భూతై
రసురైః సకలం జగత్ ।
వ్యాప్తమాసీత్తతో దేవా
భయమాజగ్మురుత్తమమ్॥

మాహేశ్వరీశక్తి త్రిశూలముతో, అట్లే సప్తమాతృకలు వారివారి ఆయుధములతో రక్తబీజులను కొట్టుచుండిరి.

107) రక్తబీజుడు మాతృగణముచే దెబ్బలు తినుచుండియు మహాకోపముతో వారినెల్ల తనగదతో ప్రహరించెను.

108) శక్తి,శూలాద్యాయుధములచే సప్తమాతృకలు రక్తబీజుల ఖండించుచున్నందున భూమిపై బడినవారిరక్తప్రవాహము నుండి కోటానుకోట్లు సమానశక్తి ప్రభ గలరాక్షసులు పుట్టెని.

109) రక్తబీజులరక్తమునుండి పుట్టిన అసంఖ్యాకరాక్షసులు సర్వజగత్తును వ్యాపించి దేవితో యుద్ధముచేయుచుండుటను చూచి దేవతలు మిక్కిలిభయభ్రాంతులైరి.

110) తాః విషణ్ణాః సురాః
దృష్ట్వా
చణ్డికా ప్రాహ సత్వరా।
ఉవాచ కాళీం చాముణ్డే!
విస్తీర్ణం వదనం కురు॥

110) శోకయుక్తులయిన బ్రహ్మేంద్రాది దేవతలను చూచి చండిక నవ్వుచు వ్యసనము చెందకుడని అభయప్రదానము చేసి ఓచాముండా! నోరుపెద్దదిగా చేయుమని కాళికా దేవితో చెప్పెను.

111) మచ్ఛస్త్రపాతసమ్భూతాః
రక్తబిన్దూన్ మహాసురాన్।
రక్తబిన్దోః ప్రతీచ్ఛ త్వం
వక్త్రేణానేన వేగితా॥

111) ఓకాళీ! నాశస్త్రాస్త్రాఘాతములచే రక్తబీజులరక్తమునుండి పుట్టినట్టియు, పుట్టుచున్నట్టియు రాక్షసులశరీరములనుండి పడు ఒక్కరక్తబిందువైనను భూమిమీద పడనీయక నీవక్త్రముచే గ్రహించుచుండుమని చెప్పగా చాముండ నోటితో రక్తమును పీల్చుచుండెను

112) యత సత స్తద్వక్త్రేణ
చాముణ్డా సమ్ప్రతీచ్ఛతి।
ముఖే సముద్గతా యేஉస్యా
రక్తపాతా న్మహాసురాః॥

112) అట్లు చాముండ వాయువుతో లాగికొని నోటితో రక్తపానముచేయుచుండగా నోటియందే రక్తబీజు లనేకులు పుట్టుచుండిరి.

| | |
|---|---|
| 113) తాంశ్చఖాదాథచాముణ్డా<br>పపౌ తస్య చ శోణితమ్॥ | 113) చాముండాదేవి తననోటియందు పుట్టినరాక్షసులను నమిలి తినుచు, రక్తపానము చేసెను. |
| 114) దేవీ శూలేన వజ్రేణ<br>బాణై రసిభిః ఋష్టిభిః।<br>జఘాన రక్తబీజం తం<br>చాముణ్డాపీతశోణితమ్ ॥ | 114) చాముండ రక్తమును గ్రోలుచుండగా దేవి ఆరక్తబీజుని తన శూలముచేతను, వజ్రముతోడను, బాణములతోడను ఖడ్గములతోడను యీటెలతోడను సంహరించెను. |
| 115) స పపాత మహీపృష్ఠే<br>శస్త్రసఙ్ఘసమాహతః ।<br>నీరక్తశ్చ మహీపాల !<br>రక్తబీజో మహాసురః। | 115) ఇట్లనేకశస్త్రములచే హతమార్చబడి, నెత్తురుబొట్టొకటియు లేకపోగా ఘోరాసురుడగు రక్తబీజుడు భూమిపై కూలి పడిపోయెను. |
| 116) తత స్తే హర్ష మతుల<br>మవాపు స్త్రిదశా నృప! | 116) రాజా ! అప్పుడు ముక్కోటిదేవతలు మహానందము నొందిరి వారివలన బుట్టిన మాతృగణము రాక్షస |

తేషాం మాతృగణో జాతో
నన ర్తాసృఙ్మదోద్ధతః॥

117) చకార కోప మతులం
రక్తబీజే నిపాతితే।
శుమ్భాసురో నిశుమ్భశ్చ
హతే షస్వేష్యషు చాహవే॥

118) హన్యమానం మహాసైన్యం
విలోక్యామర్ష ముద్వహన్।
అభ్యధావ న్నిశుమ్భోఽథ
ముఖ్యయాసుర సేనయా ॥

119) సింహనాదేన శుమ్భస్య
వ్యాప్తం లోకత్రయాన్తరమ్।
నిర్ఘాతనిఃస్వనో ఘోరో
జితవా నవనీపతే! ॥

రక్తపానవివశమై గంతులు వైచెను.

117) యుద్ధమున రక్తబీజుడు నశించుటచేతను, బహుసేన నశించుటచేతను శుంభనిశుంభులు మిక్కిలి కోపోద్రిక్తులైరి.

118) చచ్చిపోయిన సేనను సేనాధిపతులను చూచి మహోగ్రులై శుంభనిశుంభులు ముఖ్యమైన రాక్షససేనను వెంటగొని పోయి యుద్ధభూమికి పరుగెత్తి దేవిపై శస్త్రాస్త్రములు ప్రయోగించి యుద్ధమొనర్చిరి

119) శుంభుడు సింహగర్జనము చేయగా మూడులోకముల యందు పిడుగుశబ్దమును మించిన ప్రతిధ్వని పుట్టెను.

| | |
|---|---|
| 120) శుమ్భముక్తా ఞ్ఛరా న్దేవీ<br>శుమ్భ స్తత్ప్రహితాఞ్ఛరాన్।<br>చిచ్ఛేద స్వశరై రుగ్రైః<br>శతశోఽథ సహస్రశః ॥ | 120) శుంభునిచే విడువబడిన బాణములను దేవియు, దేవిచే విడువబడిన బాణములను శుంభుడును తమతమక అకుటమ్ము లచే వేనవేలుముక్కముక్కలుగా ఖండించిరి. |
| 121) తతః సా చణ్డికా క్రుద్ధా<br>శూలేనాభిజఘాన తమ్।<br>స తదాభిహతో భూమౌ<br>మూర్ఛితో నిపపాత హ॥ | 121) అప్పుడు దేవి కోపముచే పైకి వచ్చుచున్న నిశుంభుని తన శూలముతో పొడువగా వాడు మూర్ఛపోయి భూమిపై బడెను. |
| 122) తతో నిశుమ్భః సమ్ప్రాప్య<br>చేతనా మాత్తకార్ముకః<br>ఆజఘాన శరై ర్దేవీం<br>కాళీం కేసరిణం తథా॥ | 122) నిశుంభుడు మూర్ఛ తేరి ధనుస్సును ధరించి బాణములచే దేవిని, కాళీదేవిని సింహమును కొట్టెను. |
| 123) పునశ్చ కృత్వా బాహూనా<br>మయుతం దనుజేశ్వరః। | 123) ఆ రాక్షసరాజు నిశుంభుడు తనమాయచే పదివేలహస్తములను ధరించి, పదివేలచక్రాయుధములచే చండికా |

చక్రాయుధేన దితిజ
శ్ఛాదయామాస చణ్డికామ్॥

దేవిని కప్పివేసెను.

124) తతో భగవతీ క్రుద్ధా
దుర్గా దుర్గార్తినాశినీ।
చిచ్ఛేద తాని చక్రాణి
స్వశరైః సాయకాంశ్చ తాన్।

124) నివారింప శక్యముగాని ఆపదలనైనను దుర్గా అని స్మరించి నంతనే పోగొట్టెడి యాకాళిక అమ్మవారు మహోగ్రయై తన బాణములచే నాచక్రముల నన్నిటిని వానిబాణములను సంహరించెను.

125) శూలహస్తం సమాయాన్తం
నిశుమ్భ మమరార్దనమ్।
హృది వివ్యాధ శూలేన
వేగావిద్ధేన చణ్డికా॥

125) అప్పుడు శూలపాణియై నిశుంభుడు దేవిపైకి వచ్చుచుండగా చండికాదేవి అతిశీఘ్రముగ వానిహృదయమును శూలముచే పొడిచి చంపెను.

126) భిన్నస్య తస్య శూలేన
హృదయాన్నిఃసృతోఽపరః।

126) దేవీశూలముచే హతుడైన నిశుంభునిరొమ్మునుండి మరి యొకపురుషుడు మహాబలశాలి పరాక్రమవంతుడు పుట్టె

మహాబలో మహావీర్య
స్తిష్ఠేతి పురుషో వదన్॥

127) తస్య నిష్క్రామతో దేవీ
ప్రహస్య స్వనవత్తతః ।
శిర శ్ఛిచ్ఛేద ఖడ్గేన
తతో౽సావపత ద్భువి॥

128) తతః సింహ శ్చఖాదోగ్ర
దంష్ట్రాక్షుణ్ణశిరోధరాన్।
అసురాంస్తాం స్తథా కాళీ
శివదూతీ తథాపరాన్ ॥

129) నిశుమ్భం నిహతం దృష్ట్వా
భ్రాతరం ప్రాణసమ్మితమ్।

దేవిని నిలు నిలుమని యెదిరించెను.

127) నిశుంభుని హృదయమునుండి పుట్టినవానిని దేవి గొప్ప నాదము చేయుచు నవ్వి, తన ఖడ్గముచే వానిశిరస్సును ఖండించి భూమిపై బడవైచెను.

128) అప్పుడు సింహము తీక్ష్ణ దంతములచే రాక్షసులశిరస్సులను నమిలి మ్రింగెను. కాళీ, శివదూతీ, కౌమారీ, బ్రహ్మాణీ, మాహేశ్వరీ, వారాహీ, వైష్ణవీ ఇంద్రాణీ - ఇత్యాది బ్రహ్మేంద్రాది దేవతలవలననుద్భవించి వచ్చిన సప్తమాతృకా దేవతలు దేవిశరీరమునుండి పుట్టిననవకోటిశక్తులు మిగిలిన రాక్షసుల చంపి భక్షించిరి

129) ప్రాణసమానుడైనతనతమ్ముడు నిశుంభుడు మరణించుట, సేన హత మగుట చూచి శుంభుడు మండిపడుచు దేవితో

హన్యమానం బలం చైవ
శుమ్భః క్రుద్ధోఽబ్రవీద్వచః॥
130) బలావలేపదుష్టే! త్వం
మా దుర్గే! గర్వమావహ।
అన్యాసాం బల మాశ్రిత్య
యుద్ధ్యసే యాతిమానినీ॥

దేవ్యువాచ

131) ఏకైవాహం జగత్యత్ర
ద్వితీయా కా మమాపరా।
పశ్యైతా దుష్ట! మయ్యేవ
విశన్త్యో మద్విభూతయః॥

నిట్లనెను.

130) ఓదుర్మార్గురాలా! దుర్గా! ఇతరశక్తులబలము నాశ్రయించి యుద్ధముచేయుచు మన్ననపొంది అహంకారగర్వము నొందకుము.

దేవి చెప్పుచున్నది—

131) ఈజగత్తున నే నొక్కదాననే యున్నానుగాని వేఱొక్కరెవరును లేరు. (ఏకమే వాద్వితీయం) ఓదుష్టుడా! నా నవకోటిశక్తులను (బ్రాహ్మీ, మాహేశ్వర్యాదిస ప్తమాతృకలను నాయందే లయముచేయుచున్నాను చూడుముని తనయందు విలీనముచేసి యొంటిగా నిలిచి యుద్ధమునకు రమ్మనెను.

| | |
|---|---|
| 132) తతః సమస్తా స్తా దేవ్యో<br>(బ్రహ్మాణీప్ర)ముఖా లయమ్।<br>తస్యా దేవ్యాః స్తనౌ జగ్ము<br>రేకై వాసీ త్తదాఽమ్బికా॥ | 132) అంత బ్రహ్మాణి మొదలగు సప్తమాతృకలును, దేవి వక్షస్సునందు విలీనలై పోయిరి. అంబిక యేకైకమూర్తియై శోభించుచు వానితో యుద్ధమొనర్చెను. |
| 133) ఛిన్నే ధనుషి దైత్యేన్ద్ర<br>స్తథా శక్తి మథాదదే।<br>చిచ్ఛేద దేవీ చక్రేణ<br>తామప్యస్య కరే స్థితామ్॥ | 133) రాక్షసేంద్రుని చేతిలోని ధనుస్సు అమ్మవారిచే ఛేదింపబడెను. అంత వాడు ఘోరమగు శక్త్యాయుధమును గ్రహించి అంబికపైకి తలపడెను; గాని దేవి యాశక్తిని వాడు చేతబట్టినంతలోనే తనచక్రముచే ముక్కలగునట్లు చేసెను. |
| 134) స ముష్టిం పాతయామాస<br>హృదయే దైత్యపుఙ్గవః।<br>దేవ్యాస్తం చాపి సా దేవీ<br>తలేనోర స్యతాడయత్ ॥ | 134) రాక్షసరాజు శుంభుడు దేవీహృదయమున పిడిగ్రుద్దు గుద్దెను. దేవియు తనయరచేతితో వానివక్షమును చఱచెను. |
| 135) తలప్రహారాభిహతో<br>నిపపాత మహీతలే। | 135) దేవి చఱచిన చఱపుచే శుంభుడు భూమిమీద పడియు సాహసముతో లేచి ఆమెమీదికి పరుగెత్తసాగెను. |

స దైత్యరాజః సహసా
పునరేవ తథోత్థితః ॥
136 ఉత్పత్య చ ప్రగృహ్యోచ్చై
ర్దేవీం గగనమాస్థితః।
తత్రాపి సా నిరాధారా
యుయుధే తేన చణ్డికా॥
137) నియుద్ధం ఖే తదా దైత్య
శ్చణ్డికా చ పరస్పరమ్
చక్రతుః ప్రథమం సిద్ధ
మునివిస్మయకారకమ్॥
138) తతో నియుద్ధం సుచిరం
కృత్వా తేనామ్బికా సహ।
ఉత్పాత్య భ్రామయామాస
చిక్షేప ధరణీతలే ॥

136) దేవిని పట్టుకొని మిక్కిలియెత్తుగా ఆకాశముమీదికి తీసి కొనివెళ్ళగా అక్కడ దేవి నిరాధారయయ్యు శుంభునితో యుద్ధము చేసెను.

137) దేవీశుంభులు పరస్పరము సిద్ధులు, మునులు, మహాశ్చర్యము పొందునట్లు ప్రప్రథమమున నొకరితో నొకరు బాహు యుద్ధము చేసిరి.

138) పిమ్మట అంబికాదేవి బాహుయుద్ధమున శుంభుని పట్టి పైకెత్తి గిరగిర త్రిప్పి భూమిపై కొట్టెను.

139) స క్షిప్తో ధరణీం ప్రాప్య
ముష్టి ముద్యమ్య వేగతః ।
అభ్యధావత దుష్టాత్మా
చణ్డికానిధనేచ్ఛయా ॥

140) త మాయాన్తం తతో దేవీ
సర్వదైత్యజనేశ్వరమ్।
జగత్యాం పాతయామాస
భిత్వా శూలేన వక్షసి॥

141) స గతాసుః పపాతోర్వ్యాం
దేవీ శూలాగ్రవిక్షతః।
చాలయన్ సకలాం పృథ్వీం
సాబ్ధిద్వీపాం సపర్వతామ్ ॥

139) విసిరి నేలపై కొట్టబడియు శుంభుడు లేచి పిడికిటితో గ్రుద్ది చండికాదేవిని చంపుటకు పరుగెత్తి వచ్చెను.

140) సమస్తరాక్షసరాజైన శుంభునివక్షమును దేవి తన శూలముచే పగుల చీల్చి వానిని భూమిపై పడవైచెను.

141) శుంభుడు దేవిచే పొడువబడి ప్రాణములు పోయి భూమిపై పడినప్పుడు సమస్తపృథ్వి, సముద్రద్వీపములు పర్వతములతో గూడ చలించినట్లుండెను.

142) తతః ప్రసన్న మఖిలం
హతే తస్మిన్ దురాత్మని।
జగ త్స్వాస్థ్య మతీవాప
నిర్మలం చాభవ న్నభః॥

143) ఉత్పాతమేఘాః సోల్కా యే
ప్రాగాసం స్తే శమం యయుః।
సరితో మార్గవాహిన్య
స్తథాసం స్తత్ర పాతితే॥

144) తతో దేవగణా స్సర్వే
హర్ష నిర్భరమానసాః।
బభూవు ర్నిహతే తస్మిన్
గన్ధర్వా లలితం జగుః॥

142) దుర్మార్గులు చెలరేగుచుండురేని వా రెప్పు డేట్టియప
కారము చేయుదురో యని సజ్జను లెల్లరు గడగడలాడు
దురు గదా! అట్టిచో దేవీపరమానుగ్రహమున దురాత్ము
డైన శుంభుడు నశించినవెంటనే సమస్తలోకములకు
అత్యంతస్వాస్థ్య మేర్పడెను. పదిదిక్కులు ఆకాశము
నిర్మలము లయ్యెను.

143) వాడు నశించుటచే తత్పూర్వము పిడుగులతో గూడిన
మేఘముల ఆడంబర మంతయు నిపుడు శాంతించెను.
నదులు నిరాతంకముగా తమతమమార్గముల ననుసరించి
సరిగా ప్రవహింపజొచ్చెను.

144) ఆసమయమున సమస్తదేవగణములు పట్టరానిసంతో
షామృతసాగరమున నోలలాడిరి గాయకులగు గంధ
ర్వులు మనోహరముగా పాడిరి.

| | |
|---|---|
| 145) అవాదయంస్తథా వాద్యా<br>న్ననృతు శ్చాప్సరోగణాః।<br>వవుః పుణ్యాస్తథా వాతా<br>స్సుప్రభోఽభూ ద్దివాకరః॥<br>జజ్వలు శ్చాగ్నయశ్శాన్తా<br>శ్శాన్తదిగ్జనితస్వనాః॥ | 145) ఇతర దేవతాగణము నానావాద్య వీణా వేణుమృదంగాదులతో పాడిరి. అప్సరోగణములు నృత్యము చేసిరి. వాయువు చిత్ర విచిత్రముగా అనుకూలముగా వీచెను. సూర్యుడు పురగ్రామగృహారామపర్వతారణ్యములయందు తనసహస్ర కిరణములతో పూర్తిగ ప్రకాశించెను. |
| 146) దేవ్యా హతే తత్ర<br>మహాసురేన్ద్రే-<br>సేన్ద్రా స్సురా వహ్ని<br>పురోగమాస్తామ్।<br>కాత్యాయనీం తుష్టువు<br>రిష్టలాభా-ద్వికాసివక్త్రాబ్జ<br>వికాసితాశాః ॥ | 146) ఆర్ద్రైత్యేంద్రుని మహాదేవి హతమార్చినందున తమ ఇష్టసంపూర్తి యగుటచే దేవతలు వికసించినముఖకాంతులతో దశదిశలను వెలిగింపజేయుచుండెను దేవతలు ఇంద్రాగ్నులను ముందుంచుకొని కాత్యాయనీదేవిని ఇట్లు స్తుతించిరి. |

147) దేవి! ప్రపన్నార్తిహరే!
ప్రసీద ప్రసీద మాత
ర్జగతోఽఖిలస్య। ప్రసీద
విశ్వేశ్వరి! పాహి విశ్వం-
త్వమీశ్వరీ దేవి! చరాచరస్య॥

147) శరణాగతులదుఃఖములను నిర్మూలించు ఓదేవీ! అనుగ్రహింపుము సర్వజగన్మాతా! అనుగ్రహింపుము (సర్వజగములకు తల్లీ) విశ్వేశ్వరీ! యనుగ్రహింపుము. జగత్తును రక్షింపుము. చరాచరములకు నీవేగదా యధీశ్వరివి.

148) ఆధారభూతా జగత స్త్వ
మేకా - మహీస్వరూపేణ
యతః స్థితాసి। అపాం
స్వరూపస్థితయా త్వయైత
దాప్యాయతే కృత్స్న
మలఙ్ఘ్యవీర్యే!॥

48) పృథ్వీరూపమున తేజరిల్లుచు జగత్తున కాధారభూతురాల వగుచున్నావు ఓమహావీర్యాలయా! నీవు జలరూపమున నుండుటచే ఈజగత్తులోని సర్వజీవులకు ఆప్యాయము గలిగించుచున్నావు.

149) త్వం వైష్ణవీశక్తి రనన్త
వీర్యా విశ్వస్య బీజం పర
మాసి మాయా। సమ్మో

149) అసమానవీర్యసంపూర్ణ యగువైష్ణవీశక్తివి నీవే విశ్వోత్పత్తికి మూలకారణ మగుబీజరూపవు నీవే. సర్వోత్కృష్ట మగుమాయవు నీవే. సమస్తజగత్తునుప్రకృతిరూపమున

| | |
|---|---|
| హితం దేవి! సమస్త మేత-<br>త్త్వం వై ప్రసన్నా భువి<br>ముక్తిహేతుః ॥ | నీవే మోహింపజేయుదువు. నీవు యథార్థముగ సంతర్యామ్యభిముఖవైతివేని వారలకు ముక్తిని ప్రసాదింతువు. |
| 150) విద్యాస్సమస్తాస్తవ దేవి! భేదాః<br>స్త్రియస్సమస్తాస్సకలా జగత్సు।<br>త్వయైకయా పూరిత మమ్బ యైతత్<br>కా తే స్తుతిః స్తవ్యపరాపరోక్తిః ॥ | 150) దేవీ! సమస్తలోకములయందుండెడు సమస్తవిద్యలు, సమస్తస్త్రీలు నీయొక్క రూపభేదములు. పదునాలుగు జగములు నీచే నిండియున్నవి. స్తోత్రవాక్కులకు పరమైన దానవు శూన్యమునకును సాక్షిరూపిణి వగుటచే నిన్ను మే మెట్లు స్తోత్రముచేయగలము ? |
| 151) సర్వభూతా యదా దేవీ<br>భుక్తి ముక్తి ప్రదాయినీ।<br>త్వం స్తుతా స్తుతయే కా వా<br>భవన్తు పరమోక్తయః॥ | 151) నీవు సర్వభూతస్థురాలవు. (గీ॥ సర్వభూతాంతరాత్మా.) పుణ్యలోకమును ముక్తిని ఇచ్చుదానవు. నిన్ను మేము యథాశక్తి స్తుతించితిమి. గుణాతీతవగుటచే నిన్ను స్తుతించుటకు పరమోక్తులు లేవు. |

| | |
|---|---|
| 152) సర్వస్య బుద్ధిరూపేణ<br>జనస్య హృది సంస్థితే!<br>స్వర్గాపవర్గదే! దేవి!<br>నారాయణి! నమోఽస్తు తే॥ | 152) సర్వభూతహృదయములందు బుద్ధిరూపమున స్వాత్మగా నున్నదానవు. స్వర్గముక్తుల నిచ్చు! నారాయణీ! నీకు నమస్కారము. |
| 153) కలాకాష్ఠాదిరూపేణ<br>పరిణామప్రదాయినీ।<br>విశ్వస్యోపరతౌ శక్తే<br>నారాయణి! నమోఽస్తు తే॥ | 153) నిమిషములు రెప్పపాట్లు మొదలైన కాలస్వరూపముతో నుండి కల్పాంతమున జగత్తులను క్షయముచేయు చున్నావు. పరాశక్తీ! జగచ్ఛాంతిప్రదా! నీకు నమస్కారము. |
| 154) సర్వమఙ్గళమాఙ్గల్యే<br>శివే! సర్వార్థసాధికే!<br>శరణ్యే! త్ర్యమ్బకే! గౌరి!<br>నారాయణి! నమోఽస్తు తే॥ | 154) సర్వమంగళస్వరూపములకు మంగళస్వరూపముగలశివా! సమస్తవాంఛాప్రదా! ఓరక్షకీ! త్ర్యంబకి! గౌరీ! నారాయణి! మహాలక్ష్మి! నీకు నమస్కారము. |
| 155) సృష్టిస్థితివినాశానాం<br>శక్తిభూతే! సనాతని!। | 155) సృష్టిస్థితివినాశహేతుభూతా! సనాతనీ! గుణాశ్రయా! గుణమయీ! నారాయణి! నీకు నమస్కారము. |

గుణాశ్రయే ! గుణమయే!
నారాయణి! నమోఽస్తు తే॥

156) శరణాగతదీనార్త
పరిత్రాణపరాయణే !
సర్వస్యార్తి హరే! దేవి!
నారాయణి నమోఽస్తు తే॥

157) హంసయుక్తవిమానస్థే
బ్రహ్మాణీరూపధారిణి!
కౌశాంభఃక్షరికే దేవి
నారాయణి! నమోఽస్తు తే॥

158) త్రిశూలచన్ద్రాహిధరే!
మహావృషభవాహిని!
మాహేశ్వరీస్వరూపేణ
నారాయణి! నమోఽస్తు తే।

156) ఓదుర్గాంబికా ! నిన్ను శరణుజొచ్చినవారిదుఃఖములను పోగొట్టుటయం దిచ్ఛగలదానవు. సమస్తజన పీడాప హారిణీ దేవీ నారాయణి నీకు నమస్కారము.

157) బ్రహ్మాణీరూపము ధరించి, హంసవిమానారూఢవై కుశతో నుదకము చల్లెడిమహాదేవీ ! నారాయణి! నీకు నమస్కారము (మోహనాస్త్రము)

158) ఉత్కృష్టవృషభవాహనారూఢవయి, మాహేశ్వరీస్వ రూపమున త్రిశూలచంద్రసర్పములను. ధరించిన నారా యణీ ! నీకు నమస్కారము.

159) మయూరకుక్కుటవృతే
మహాశక్తిధరేఽనఘే!
కౌమారీరూపసంస్థానే!
నారాయణి! నమో స్తు తే

160) శఙ్ఖచక్ర గదా శార్ఙ్గ
గృహీతపరమాయుధే!
ప్రసీద వైష్ణవీరూపే!
నారాయణి! నమోఽస్తు తే॥

161) గృహీతోగ్రమహాచక్రే!
దంష్ట్రోద్ధృతవసున్ధరే!
వరాహరూపిణి! శివే!
నారాయణి! నమోఽస్తు తే॥

162) నృసింహరూపేణోగ్రేణ
హన్తుం దైత్యాన్ కృతోద్యమే!

159) ఫించయుక్తమైన నెమిలి నెక్కి కౌమారీరూపమున మహాశక్తిని ధరించినపాపరహితా! నారాయణీ! నీకు నమస్కారము.

160) వైష్ణవీరూపము ధరించి, శంఖ, చక్ర, గదా, శార్ఙ్గాది పరమాయుధములను ధరించిన నారాయణీ! నీకు నమస్కారము.

161) భయంకరమైన మహాచక్రమును ధరించి వారాహీరూపమున కోరలచే పృథ్విని (భూమిని) పైకెత్తిన నారాయణీ! నీకు నమస్కారము.

162) రాక్షసులను హింసించుటకు భయంకరనారసింహరూపమును ధరించి లోకములను రక్షించిన నారాయణీ!

| | |
|---|---|
| త్రైలోక్యత్రాణసహితే !<br>నారాయణి! నమోఽస్తు తే॥ | నీకు నమస్కారము. |
| 163) కిరీటిని ! మహావజ్రే ! ,<br>సహస్రనయనోజ్జ్వలే ! ।<br>వృత్రప్రాణహరే! ఐన్ద్రి!<br>నారాయణి! నమోఽస్తు తే॥ | 163) మహావజ్రాయుధమును ధరించి వేయినేత్రములతో ప్రకాశించుచు వృత్రాసురప్రాణములను హరించినకిరీటినీ! ఐంద్రీ ! నారాయణీ ! నీకు నమస్కారము. |
| 164) శివదూతీస్వరూపేణ<br>హతదైత్యమహాబలే!<br>ఘోరరూపే! మహారావే!<br>నారాయణి! నమోఽస్తు తే॥ | 164) భయంకరమైన శివదూతీస్వరూపమును ధరించి మహానాదముచేయుచు మహాబలవత్తరమైనరాక్షససైన్యమును హతముచేసిననారాయణీ ! నీకు నమస్కారము. |
| 165) దంష్ట్రాకరాళవదనే<br>శిరోమాలావిభూషణే !<br>చాముణ్డే! ముణ్డమథనే !<br>నారాయణి! నమోఽస్తు తే॥ | 165) వాడిగల దీర్ఘదంష్ట్రలచే భయంకరవదనము గలిగి, కపాలమాలికలను ధరించి, ముండాసురుని ఖండఖండములు గావించిన చాముండా! నారాయణీ! నీకు నమస్కారము |

166) లక్ష్మి! లజ్జే! మహావిద్యే!
శ్రద్ధే! పుష్టి! స్వధే! ధ్రువే!
మహారాత్రి మహామాయే!
నారాయణి! నమోఽస్తు తే॥

166) ఓ లక్ష్మి! ఓ లజ్జా! (హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ అని పురుషసూక్త వేదప్రమాణము) ఓ మహావిద్యే! (జ్ఞానము) శ్రద్ధారూపిణి! పుష్టిరూపిణి! స్వధారూపిణి! నిశ్చలరూపిణి! మహారాత్రీ మహామాయా నారాయణి! నీకు నమస్కారము.

167) మేధే సరస్వతి వరే
భూతి బాభ్రవి తామసి!
నియతే త్వం ప్రసీదేశే!
నారాయణి! నమోఽస్తు తే॥

167) బుద్ధిరూపిణి! సరస్వతీ! సర్వశ్రేష్ఠా! సత్త్వప్రధానా, (సదాశివస్వరూపము) రజోగుణవతీ! తామసగుణరూపిణి! నియతాకారా! నిఖిలేశ్వరీ! (సర్వస్వతంత్రురాలు) నారాయణి! నీకు నమస్కారము.

168) సర్వస్వరూపే! సర్వేశే!
సర్వశక్తిసమన్వితే!
భయేభ్యస్త్రాహి నో దేవి!
దుర్గే! దేవి! నమోఽస్తు తే॥

168) ఓ సర్వస్వరూపా! నీవు సూత్రాత్మవు. సర్వతంత్రస్వరూపవు. సమస్తేశ్వరీ! (స్వతంత్రా సర్వతంత్రేశీ-అని లలితా ప్రమాణము) సమస్తశక్తిసమన్వితా! దేవీ! మాకు గల్గుచుండెడి భయములనుండి రక్షించుచుండుము. దేవీ! నీకు నమస్కారము.

169) ఏతత్తే వదనం సౌమ్యం
లోచనత్రయభూషితమ్ ।
పాతు నః సర్వభూతేభ్యః
కాత్యాయని! నమోఽస్తు తే॥

169) త్రిణేత్రములతో శోభించెడు. నీసుందరముఖము మమ్ము సమస్తభయములనుండి రక్షించుగాత! (తృతీయనేత్రము = జ్ఞాననేత్రము) ఓ కాత్యాయని! నీకు నమస్కారము.

170) జ్వాలాకరాళ మత్యుగ్ర
మశేషాసురసూదనమ్ ।
త్రిశూలం పాతు నో భీతే
ర్భద్రకాళి! నమోఽస్తు తే।

170) మిక్కిలితీక్ష్ణమైన అగ్నిజ్వాలల గ్రుమ్మరించుచు (వహ్ని ప్రాకారమధ్యగా) అగ్నిమధ్యయందుండి. సర్వరాక్షసులను నశింపచేయు నీ త్రిశూలాదికము మమ్ము సర్వభయములనుండి రక్షించుగాక! (అమ్మవారే జ్వాలాముఖీ దేవి. గుంటూరుజిల్లా అమరావతిలో జ్వాలాముఖీ ఆలయము గలదు.)

171) హినస్తి దైత్య తేజాంసి
స్వనేనాపూర్య యా జగత్ ।
సా ఘణ్టా పాతు నో దేవి!
పాపేభ్యో నః సుతానివ ॥

171) ఓ దేవీ! దైత్యుల తేజస్సు నశింపచేసెడు నీ ఘంటానాదము మేము చేసిన పాపములనెల్ల బోగొట్టి, తల్లి కొడుకులను రక్షించురీతి మమ్ము రక్షించునుగాక !

172) అసురాసృగ్వసాపఙ్క-
చర్చితస్తే కరోజ్జ్వలః।
శుభాయ ఖడ్గో భవతు
చణ్డికే! త్వాం నతా వయమ్॥

172) రాక్షసరక్తముచేత, క్రొవ్వు బురదచేత దట్టముగ పూయబడి నీ హస్తమున ప్రకాశించుచున్న ఖడ్గము మాకు అత్యంతసుఖములను, అత్యంతశుభములను దయ చేయుగాత ! చండికా నీకు నమస్కారము

173) రోగా నశేషా నపహంసి-
తుష్టా-రుష్టా తు కామాన్
సకలా నభీష్టాన్ । త్వా
మాశ్రితానాం న విప
న్నరాణాం-త్వా మాశ్రితా
హ్యాశ్రయతాం ప్రయాన్తి॥

173) ఓదేవీ ! నీవు ప్రసన్నురాలవైన మా సర్వరోగములు నివారణమగుచున్నవి నీకు కోపము వచ్చెనా సకలాభీష్టకామములను నశింపచేయుచున్నావు (సర్వరోగములనగా శారీర మానసదుఃఖములు) నిన్నాశ్రయించిన నరుల కెట్టియాపదలును లేవు. నిన్నాశ్రయించిన వారు ఇతరుల కెందఱకో యాశ్రయణీయు లగుచున్నారు.

174) ఏతత్కృతం యత్కదనం
త్వయాద్య - ధర్మద్విషాం
దేవి ! మహాసురాణామ్ ।
రూపై రనేకై ర్బహుధా-

174) ఓజగన్మాతా! ధర్మద్వేషు లయినమహాసురుల ననేకస్వరూపములను ధరించి నీ వొక్కదానవు యుద్ధమునందు నిర్మూలింపగల్గితివేగాని, ఇంతపని చేయగలస్త్రీ వేరొకతె యేలోకమునను గానరాదు

త్వమూర్తిం-కృత్వాఽమ్బి
కే! తత్ప్రకరోతి కాన్యా॥

175) విద్యాసు శాస్త్రేషు వివే
కదీపే-ష్వాద్యేషు వాక్యే-
షు చ కా త్వదన్యా। మ
మత్వగర్తేఽతిమహాన్ధకారే
వి(భామయ త్యేత దతీవ
విశ్వమ్ ॥

175) స్వయం(ప్ర)కాశసర్వ(ప్ర)కాశజ్ఞానదీపము మొదలుకొని యీ మిదిమహావాక్యములందును, షడ్శాస్త్రములందును, చతుర్దశవిద్యలందును ఏకరూపమున నీవే వెలుంగుచున్నను (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పసూత్రము- ఇవి షట్శాస్త్రములు) సర్వజగన్నివాసులు తామే శాస్త్రజ్ఞులనెడి మమత్వాంధకారమున బడి మిక్కిలి భ్రమించుచున్నారు

176) రక్షాంసి యత్రోగ్రవిషా
శ్చ నాగా-యత్రారయో
దస్యుబలాని యత్ర। దవా
నలో యత్ర తథాబ్ధిమధ్యే-
తత్ర స్థితా త్వం పరిపాసి

176) రాక్షసులు, తీక్ష్ణవిషసర్పములు, శత్రువులు, చోరసమూహములు, దావానలములు, ఎక్కడెక్కడనుండునో అచ్చటచ్చటను, సముద్రమధ్యమునను నీవుండి యవ్వానివలని బాధలను తప్పించుచు, లోకములను రక్షించుచున్నావు.

విశ్వమ్ ॥

177) విశ్వేశ్వరి ! త్వం పరిపాసి విశ్వం- విశ్వాత్మికా ధారయసీతి విశ్వమ్ । విశ్వేశవన్ద్యా భవతీ భవన్తి-విశ్వాశ్రయా యే త్వయి భక్తి నమ్రాః ।

177) దేవి! నీవు విశ్వేశ్వరివై విశ్వమును పాలించుచున్నావు. విశ్వరూపిణివై విశ్వమును ధరించుచున్నావు. విశ్వేశ్వరులచే వందనము చేయబడుచున్నావు నీయందు భక్తిగలవారలు విశ్వమున కాశ్రయణీయు లగు చున్నారు.

178) దేవి ! ప్రసీద పరిపాలయ నోఽరిభీతే-ర్నిత్యం యథా సురవధా దధునైవ సద్యః। పాపాని సర్వజగతాం ప్రశమం నయాశు-ఉత్పాతపాకజనితాంశ్చ మహోపసర్గాన్॥

178) తల్లీ! యిప్పుడు రాక్షసులను సంహరించినట్లు మా కాపదలు సంభవించినప్పుడు ప్రసన్నురాలవయి శత్రుభయములనుండి మమ్ము రక్షించుచుండుము. సర్వజగత్తుయొక్క పాపములను, అధర్మప్రవర్తనచే పుట్టెడుమహామార్యాది (కలరాస్ఫోటకాదులు) భయములను శీఘ్రముగా శాంతింపజేయుచుండుము.

179) ప్రణతానాం ప్రసీద త్వం
దేవి ! విశ్వార్తిహారిణి ।
త్రైలోక్యవాసినామీడ్యే!
లోకానాం వరదా భవ ॥

దేవ్యువాచ॥

180) వరదాహం సురగణా
వరం యన్మనసేచ్ఛథ।
తం వృణుధ్వం ప్రయచ్ఛామి
జగతా ముపకారకమ్ ॥

దేవా ఊచుః ॥

181) సర్వబాధాప్రశమనం
త్రైలోక్యస్యాఖిలేశ్వరి ! ।
ఏవ మేవ త్వయా కార్య
మస్మద్వైరివినాశనమ్ ॥

179) దేవి! నీవు జగదాపత్తుల నశింపచేయుదానవు. త్రిలోక వాసులచే పూజింపబడుదానవు. నిన్ను శరణుజొచ్చిన వారలను సర్వాపదలనుండి రక్షించుము. కరుణింపుము. సమస్తలోకవాసులకు వరముల బ్రసాదించుము.

దేవి చెప్పుచున్నది.

180) ఓ దేవతలారా! జగదుపకారముకొఱకు మీమీయిష్టము వచ్చిన వరములను కోరుకొనుడు. నేను వరముల నిచ్చుదానను గనుక మీరు కోరిన వరముల నిచ్చెదను.

దేవతలు చెప్పుచున్నారు:-

181) జగజ్జననీ! త్రిలోకవాసులసర్వబాధలను శమింప జేసితివి ఈప్రకారముగనే యెప్పుడును మాశత్రువులనెల్ల సంహారము చేయవలయునని కోరుచున్నాము.-

దేవ్యువాచ ॥

182) వైవస్వతేఽన్తరే ప్రాప్తే
అష్టావింశతమే యుగే ।
శుమ్భో నిశుమ్భశ్చైవాన్యా
వుత్పత్స్యేతే మహాసురౌ ॥

183) నన్దగోపగృహే జాతా
యశోదాగర్భసమ్భవా ।
తత స్తౌ నాశయిష్యామి
విన్ధ్యాచలనివాసినీ ॥

184) పునర ప్యతిరౌద్రేణ
రూపేణ పృథివీతలే ।
అవతీర్య హనిష్యామి
వైప్రచిత్తాంస్తు దానవాన్॥

దేవి చెప్పుచున్నది.

182) ఇరువదియెనిమిదవయుగమున వైవస్వతమన్వంతరము వచ్చినప్పుడు నూతనులు, శుంభనిశుంభు లను నిద్దరు మహారాక్షసులు పుట్టుదురు.

183) అప్పుడు నేను నందు డనుగోపప్రభునింట యశోదా గర్భమున బుట్టి వింధ్యవాసినినై వాని నిద్దరిని సంహ రించెదను. ('పుంగురూపా కృష్ణవిగ్రహా' అనుప్రమాణ ముచే శ్రీకృష్ణావతారము మహాలక్ష్మిఅవతారమే)

184) తిరిగి బహుభయంకర రూపముతో నేను పృథివియం దవతరించి, వైప్రచిత్తు లనురాక్షసుల నందఱను సంహ రించెదను.

| | |
|---|---|
| 185) భక్షయన్త్యాశ్చ తా నుగ్రాన్<br>వైప్రచిత్తాన్ మహాసురాన్।<br>రక్తా దన్తా భవిష్యన్తి<br>దాడిమీకుసుమోపమాః॥ | 185) భయంకరులైనఆవైప్రచిత్తరాక్షసులను నేను కబళించి నమిలివేయుటవలన నాదంతములు దానిమ్మపువ్వులవలె నెఱ్ఱనిరంగు గలవి కాగలవు. |
| 186) తతో మాం దేవతాస్స్వర్గే<br>మర్త్యలోకే చ మానవాః।<br>స్తువన్తో వ్యాహరిష్యన్తి<br>సతతం రక్తదన్తికామ్॥ | 186) ఆహేతువుచే స్వర్గమునందు దేవతలును, భూలోకమున మనుష్యులును నన్ను రక్తదంతిక యని యెల్లపుడు స్తోత్రముచేయుచు, బహువిధముల జెప్పుకొనుచుందురు. |
| 187) భూయశ్చ శతవార్షిక్యా<br>మనావృష్ట్యా మనమ్భసి।<br>మునిభిః సంస్తుతా భూమౌ<br>సమ్భవిష్యామ్యయోనిజా। | 187) అటుపై తిరిగి నూఱుసంవత్సరములు వర్షములు లేక అనావృష్టి యేర్పడుటచే గత్యంతరము లేక జను లలమటింపగా మునులచే స్తోత్రముచేయబడి అయోనిజగా నేను భూమిపై నవతరింతును. |

188) తతః శతేన నేత్రాణాం
నిరీక్షిష్యామి యన్మునీన్ ।
కీర్తయిష్యన్తి మనుజా
శ్శతాక్షీమితి మాం తతః॥

188) అప్పుడు శతనేత్రములు గలదాననై యా మునులను కరుణామయినై చూచెదను. ఆకారణముచే మనుజులు నన్ను శతాక్షియని భజించెదరు.

శతాక్షియే శతాక్షరీ మహాలక్ష్మీ అవతార మగుటచే వీగ్రంథమునను 88 వ న వాసరణార్చనలో 9వ సర్వానందమయ బైందవచక్ర నవమావరణార్చనలో 100 బీజములు గల శతాక్షరీమహామంత్రముతో పూజ వ్రాయబడినది. అందుకు సంబంధించినపర్వసౌభాగ్యసిద్ధిప్రదధ్యానము 84 అంశమున వ్రాయబడియున్నది. మూలమంత్రధ్యానము రెండవయంశమున వ్రాయబడియున్నది.

189) తతో౽హ మఖిలం లోక
మాత్మదేహసముద్భవైః ।
భరిష్యామి సురా శ్శాకై
రావృష్టేః ప్రాణధారకైః॥

189) దేవతలారా! సువృష్టి యేర్పడి సస్యానులు వృద్ధి యగు నంతవరకును దేహధారులు తమప్రాణములు నిలుపుకొనుటకు నాదేహమునుండి బహువిధశాకములను (కూరగాయలను) పుట్టించి యఖిలలోకములను రక్షించెదను.

190) శాకమ్భరీతి విఖ్యాతిం
తదా యాస్యామ్యహం భువి।

190) అప్పుడు భూమియందు నాకు శాకంభరి యనునామము గూడ విఖ్యాత మగును ఆసమయముననే దుర్గ డను

తత్రైవ చ వధిష్యామి
దుర్గమాఖ్యం మహాసురమ్॥

మహాసురుని నేను సంహరించెదను.

191) దుర్గాదేవీతి విఖ్యాతం
తన్మే నామ భవిష్యతి।
పునశ్చాహం యదా భీమం
రూపం కృత్వా హిమాచలే॥

191) అందుచే దుర్గాదేవి యని నాకు ప్రఖ్యాతనామము గలుగగలదు. తిరిగి నేను హిమాచలమున భీకరరూపము దాల్చి యుండును.

192) రక్షాంసి క్షయయిష్యామి
మునీనాం త్రాణకారణాత్।
తదా మాం మునయస్సర్వే
స్తోష్యన్త్యానమ్రమూర్తయః॥

192) అప్పుడు మునులను రక్షించుటకై భీమరూపమున రాక్షసుల నెందఱినో సంహరించెదను అప్పుడు సమస్తమునులు సాష్టాంగ దండప్రణామములు చేయుచు నన్ను స్తోత్రము చేయుదురు

193) భీమాదేవీతి విఖ్యాతం
తన్మే నామ భవిష్యతి।
యదారుణాఖ్యస్త్రైలోక్యే
మహాబాధాం కరిష్యతి॥

193) అందుచే భీమాదేవి యని నాకు ప్రఖ్యాతనామము గలుగుచున్నది. తదుపరి కొంతకాలమునకు మరల అరుణాఖ్యుడను రాక్షసుడు త్రిలోకములను బహువిధముల బాధించుచుండును.

194) తదాహం భ్రామరం
రూపం
కృత్వాఽసఙ్ఖ్యేయషట్పదమ్
త్రైలోక్యస్య హితార్థాయ
వధిష్యామి మహాసురమ్ ॥

194) అపుడు నేను లెక్కకు మిక్కుటమగు తుమ్మెదలరూపమును ధరించి, త్రిలోకరక్షణకొరకు ఆమహాసురుని సంహారించెదను

195) భ్రామరీతి చ మాం లోకా
స్తదా స్తోష్యన్తి సర్వతః।

195) అప్పుడు నన్ను భ్రామరీదేవి యని లోకములో నెల్లపుడు

196) ఇత్థం యదా యదా బాధా
దానవోత్థా భవిష్యతి।
తదా తదాఽవతీర్యాహం
కరిష్యామ్యరిసంక్షయమ్.

196) జనులు స్తోత్రముచేయుదురు. ఈ రీతిగా నెప్పుడెప్పుడు మీకు రాక్షసులచే బాధ గలుగుచుండునో, అప్పుడప్పుడెల్ల నే నవతరించి మీశత్రువుల నందఱను సంహరించెదను.

దేవ్యువాచ ॥

దేవి చెప్పుచున్నది.

197) ఏభిః స్తవైశ్చ మాం నిత్యం
స్తోష్యతే యః సమాహితః।

197) ఏమనుజుడు భక్తిశ్రద్ధలతో నన్ను పూజాస్తోత్రాదులచే ఆరాధించునో వానిసకలబాధలను నేను నిశ్శేషముగా

తస్యాహం సకలాం బాధాం
నాశయిష్యామ్యసంశయమ్॥
198) మధుకైటభనాశం చ
మహిషాసురఘాతనమ్ ।
కీర్తయిష్యన్తి యే తద్వ
ద్వధం శుమ్భనిశుమ్భయోః॥
199) అష్టమ్యాం చ చతుర్దశ్యాం
నవమ్యాం చైకచేతసః।
(శ్రోష్యన్తి చైవ యే భక్త్యా
మమ మాహాత్మ్యముత్తమమ్॥
200) న తేషాం దుష్కృతం కిఞ్చి
ద్దుష్కృతోత్థా న చాపదః
భవిష్యతి న దారిద్ర్యం
న చైవేష్టవియోజనమ్॥

పోగొట్టుచున్నాను.

198) నేను గావించిన మధుకైటభులసంహారమును, మహిషా
199) సురవధయు, శుంభనిశుంభులసంహారమును, అష్టమి
200) యందు, నవమియందు, చతుర్దశియందు (ఈమహాలక్ష్మీ పూజాదులు చేయుటకు ప్రతిమాసమున నుభయపక్షములలో వచ్చు పంచపర్వదినములు) స్థిరచిత్తులయి యెవరు పూజాస్తోత్రాదులు చేయుదురో వారలకు కొంచెమైనను పాప ముండబోదు. వారలకు లోగడ చేసిన పాపములచే గలిగెడి యాపదలును తొలగిపోవును. వారి కెన్నటికిని దారిద్ర్యము గలుగదు. ఇష్టజనవియోగమును గలుగదు.

తన అవతారచరిత్రలను, మధుకైటభులసంహారమును, మహిషాసురవధను, శుంభనిశుంభులసంహారమును స్తోత్రము చేయుమని అమ్మవారిచ్చట స్పష్టముగా చెప్పియున్నది. సప్తశతిగ్రంథము అంతయు పారాయణచేయుమని చెప్పియుండలేదు అర్గళ కవచ కీలకాదులను పారాయణచేయుమని చెప్పియుండలేదు. మరియు ప్రత్యేకము ఇట్లుచేయుమని చెప్పియున్నందున ఈగ్రంథమునందలి 1-2-3 చరిత్రలు పారాయణ చేయునిమిత్తము వ్రాయబడినవి. అందును మధుకైటభ, మహిషాసుర, శుంభనిశుంభుల సంహారఘట్టములకు ప్రాధాన్యము చెప్పియున్నది. అందుచే సంకులద్వంద్వ యుద్ధముల శ్లోకములను విడిచిపెట్టి యీ మూడుచరిత్రలలో ప్రధానశ్లోకములు, తాత్పర్యసహితముగా ప్రకటించియున్నాను 4-5 చరిత్రలు దేవీవచనప్రామాణ్యమును నిరూపించుచున్నందున వ్రాయబడినవి.

| | |
|---|---|
| 201) శత్రుతో న భయం తస్య దస్యుతో వా న రాజతః న శస్త్రానలతోయౌఘా త్కదాచి త్సమ్భవిష్యతి ॥ | 201) అట్టివారలకు శత్రువులవలనగాని, దొంగలవలనగాని, రాజులవలనగాని యెన్నటికిని నెట్టిభయము గలుగదు. అంతియేగాక శస్త్రాస్త్రజలాగ్నులవలనిభయముగూడ నెన్నటికిని గలుగదు. |

202) తస్మా న్మమైత న్మాహాత్మ్యం
పఠితవ్యం సమాహితైః ।
శ్రోతవ్యం చ సదా భక్త్యా
పరం స్వస్త్యయనం హితత్ ॥

202) కనుక సావధానముగా నెడతెగనిభక్తితో నాపూజా మాహాత్మ్యములను పఠింపవలెను; లేదా వినవలెను. ఏలయన ఇద్దాన ఇహపరశ్రేయస్సు లన్నియు సిద్ధించును.

203) ఉపసర్గా నశేషాంస్తు
మహామారీసముద్భవాన్ ।
తథా త్రివిధ ముత్పాతం
మాహాత్మ్యం శమయేన్మమ॥

203) మహామారి, స్ఫోటకము, వాంతివిరేచనను (కలరా) ఇత్యాదిసర్వోపద్రవములు, ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక సంతాపములును నా మాహాత్మ్య శ్రవణముచేతనే శమించును. (త్రి)విధసంతాపములు= (1) ఆధ్యాత్మిక దుఃఖములు = జ్వరాదులు విషయేంద్రియజన్యములు- (2) ఆధిభౌతికదుఃఖములు = సింహసర్పాభయజన్యములు(3) ఆధిదైవికదుఃఖములు= అతివృష్ట్యనావృష్టిగర్జనాశన్యగ్నిపాతాదిజన్యము.

204) యత్రైత త్పఠ్యతే సమ్య
జ్నిత్య మాయతనే మమ।

204) నాపూజ యెక్కడ గావింపబడునో, నామాహాత్మ్య మెక్కడ శ్రవణింపబడునో, నిత్యము ఆచోట నేను విడు

సదా న తద్వ మోక్ష్యామి
సాన్నిధ్యం తత్ర మే స్థితమ్॥

205) బలిప్రదానే పూజాయా
మగ్నికార్యే మహోత్సవే।
సర్వం మమైతచ్చరిత
ముచ్చార్యం శ్రావ్యమేవచ ॥

206) జానతాఽజానతా వాపి
బలిపూజాం తథా కృతామ్।
ప్రతీచ్ఛిష్యామ్యహం ప్రీత్యా
వహ్నౌ హోమం తథా కృతమ్॥

207) శరత్కాలే మహాపూజా
క్రియతే యా చ వార్షికీ।

వక సన్నిధి చేసియుందును.

205) నాపూజ చేయుకాలమునను, బలియిచ్చునపుడును, హోమాదు లొనర్చునపుడును, మహోత్సవములయందును మహాచరిత్ర పఠించతగినది, వినదగినది— అనగా పారాయణ చేయతగినది.

206) విధివిధాననియమములు గలిగిగాని, లేకగాని చేయబడిన బలి పూజా హోమాదులనుగూడ నేను ప్రీతితో గ్రహింతును.

☞ మహాలక్ష్మీ పూజాదివిధి యెఱిగి చేసినను, ఎఱుగక చేసినను, ఎంత చేసినను, ఏభాగము చేసినను, ప్రీతితో గ్రహింతునని అమ్మవారు నోరార చెప్పుచున్నందున నిర్భయముగా యథాశక్తి పూజాదుల నొనర్చి ఇష్టార్థసిద్ధి పొందవగును)

207) ప్రతిసంవత్సరము దేవీశరన్నవరాత్రములందును, ఆప త్కాలములందును నాపూజ గావించి, నామాహాత్మ్యము

తస్యాం మమైతన్మాహాత్మ్యం
శ్రుత్వా భక్తిసమన్వితః ॥

(కి)చరిత్రలు భక్తితో వినవలెను-పారాయణ చేయవలెను.

(లలితాసహస్రనామమున, ఈపూజ మహాయాగక్రతువని నిర్ణయించబడినది. అద్దాన వైదికాచారము (వేదప్రమాణము) గలవారు మాంస, మద్య, పశుబలిత్యాదులతో ఈ పూజ చేయగూడదు. అట్లుచేయుట అవైదికాచారమే. 'వైదికీ వైదికశ్చైవ, తాంత్రికీ తాంత్రికశ్చరేత్' అనినైమిశారణ్యమున వ్యాసాదిమహర్షులెల్లరు ఏకగ్రీవముగా నిర్ణయించినట్లు సూతసంహితయందు స్పష్టముగా నున్నది).

208) సర్వబాధావినిర్ముక్తో
ధనధాన్యసుతాన్వితః ।
మనుష్యో మత్ప్రసాదేన
భవిష్యతి న సంశయః ।

208) అట్లు గావించినవారిసమస్తబాధలు విడిపోవును. నా ప్రసాదముచే ధనధాన్యపుత్రపౌత్రసమృద్ధి యేర్పడును. ఈవిషయమున నెంతమాత్రము సంశయము లేదు.

209) శ్రుత్వా మమైతన్మాహాత్మ్యం
తథా చోత్పత్తయశ్శుభాః

209) నామాహాత్మ్యమును, మంగళకరమైన నాయవతార చరిత్రలను, యుద్ధమందలి నాపరాక్రమవిజయములను వినినపురుషులు సర్వవిధభయరహితు లగుదురు.

పరాక్రమం చ యుద్ధేషు
జాయతే నిర్భయః పుమాన్॥
210) రిపవః సంక్షయం యాన్తి
కల్యాణం చోపపద్యతే।
నన్దతే చ కులం పుంసాం
మాహాత్మ్యంమమశృణ్వతామ్।
211) శాన్తికర్మణి సర్వత్ర
తథా దుఃస్వప్నదర్శనే।
గ్రహపీడాసు చోగ్రాసు
మాహాత్మ్యం శృణుయాన్మమ॥
212) ఉపసర్గాః శ్శమం యాన్తి
గ్రహపీడాశ్చ దారుణాః।
దుఃస్వప్నం చ నృభిర్దృష్టం
సుస్వప్న ముపజాయతే॥

210)నాయీమాహాత్మ్యము వినుపురుషులశత్రునాశన మగును. క్షేమములు చేకూరును - వారివంశము వృద్ధిపొందును. (వారికి పురుషసంతతి గల్గును.)

211)సమస్తశాంతికర్మలయందును, దుస్వప్నదర్శనమునందును (1) భయంకర మైనసవగ్రహపీడలయందును నాపూజ చేసి నామాహాత్మ్యపఠనము చేయవలయును-లేదా వినవలెను.

212) నామాహాత్మ్యపఠనశ్రవణమువలన సర్వోపద్రవములును (2)సర్వభయంకరమైన బ్రహ్మరాక్షసాదిభూతగ్రహబాధలును శాంతించును. దుఃస్వప్నఫలములు సుస్వప్నఫలములుగా పరిణమించును.

| | |
|---|---|
| 213) బాలగ్రహాభిభూతానాం<br>బాలానాం శాన్తికారకమ్।<br>సజ్ఞాతభేదే చ నృణాం<br>మైత్రీకరణ ముత్తమమ్ ॥ | 213) బాలురకువచ్చు బాలగ్రహాది బాధలు నామాహాత్మ్యము<br>(3) శాంతించును. నానాదేశములలోను, స్వీయదేశములోను<br>గలవిభిన్నజాతి మనుష్యుల పరస్పరవిరోధమును పోగొట్టి<br>స్నేహమును గలుగజేయును. |
| 214) దుర్వృత్తానా మశేషాణాం<br>బలహానికరం పరమ్।<br>రక్షోభూతపిశాచానాం<br>పఠనాదేవ నాశనమ్ ॥ | 214) నామాహాత్మ్యపఠనమున నే సమస్తదుష్ప్రవృత్తిదురాచార<br>(4) దూషితులు మిక్కిలిబలహీనులై నశింతురు. రాక్షస,భూత<br>పిశాచములు నిర్మూలము లగును. |
| 215) సర్వంమన్మైతన్మాహాత్మ్యం<br>మమ సన్నిధికారకమ్।<br>పశుపుష్పార్ఘ్యధూపైశ్చ<br>గన్ధదీపై స్తథోత్తమైః ॥ | 215) నాపూజాశ్రవణమాహాత్మ్య ఫలము నాసన్నిధిని ఘటింప<br>జేయును. అంతియేగాక శ్రేష్ఠములైన, గంధ, పుష్ప,<br>ధూప, దీపార్ఘ్యముల నొసగిన నాకు సంతృప్తి గలుగును. |
| 216) విప్రాణాం భోజనై ర్హోమైః<br>ప్రోక్షణీయై రహర్నిశమ్। | 216) ప్రతిసంవత్సరము శరన్నవరాత్రములలో నాపూజాపారా<br>యణ హోమాదులు అభిషేకాదులు గావించుచు, బ్రాహ్మణ |

అన్నైశ్చ వివిధైర్భోగైః
ప్రదానైర్వత్సరేణ యా॥

217) ప్రీతి ర్మే క్రియతే సాస్మిన్
సకృత్సుచరితే శ్రుతే।
శ్రుతం హరతి పాపాని
తథారోగ్యం ప్రయచ్ఛతి॥

218) రక్షాం కరోతి భూతేభ్యో
జన్మనాం కీర్తనం మమ।
యుద్ధేషు చరితం యన్మే
దుష్టదైత్యనిబర్హణమ్॥

సంతర్పణ మొనర్చి, వారి కనేక భోగప్రదము లగు దానముల నొసంగిన నాకెంతయో ప్రీతి గలుగును.

217) మఱియు, నాప్రభావమును, మహిమను ప్రకటించెడి నాపూజాపారాయణాదుల జీవితమునందు ఒక్కమారు సలిపినను నాకు మిక్కిలి ప్రీతి గలుగును. అద్దాన తక్షణమే సర్వపాపములు నశించును. సంపూర్ణాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి, మోక్షము సిద్ధించును. వారిజన్మకృతార్థత జెందును. (భుక్తిముక్తిప్రదాయినీ-అని ప్రమాణము)

218) నాయీచరిత్ర శ్రవణపఠనమహిమము భూతగ్రహాది బాధ నుండి రక్షించును. నాయుద్ధచరిత్ర వినిన శత్రునాశనము దుష్టదైత్యనాశనము గలుగును. యుద్ధములు ప్రాప్తించి నపుడు నాపూజాస్తోత్రాదుల సలిపిన నాఅనుగ్రహముచే



49)

శత్రువులు సమూలము నశింతురు. (5వ చరిత్ర చూడుడు)

219) తస్మిఇచ్ఛ్రితే వైరికృతం
భయం పుంసాం న జాయతే।
యుష్మాభిః స్తుతయో యాశ్చ
యాశ్చ బ్రహ్మర్షిభిః కృతాః ॥

219) మీచేతను బ్రహ్మఋషులచేతను చేయబడినయాస్తోత్రములు వినినపురుషులకు శత్రువులభయ మెన్నటికిని గలుగదు. యుద్ధమున విజయము తప్పక సిద్ధించును

(ధర్మరాజు దేవియనుగ్రహముచే కౌరవులను యుద్ధమున సమూలము సంహరించి నిష్కంటకమైనరాజ్యము సుఖముగా అనుభవించినట్లు ఇందలి 5వ చరిత్ర చాటుచున్నది.)

220) బ్రహ్మణా చ కృతాస్తాస్తు
ప్రయచ్ఛన్తి శుభాం మతిమ్।
అరణ్యే ప్రాన్తరే వాపి
దావాగ్నిపరివారితః ॥

220-224) బ్రహ్మచేతను మీచేతను చేయబడినయాస్తోత్రములు పఠించినవారికి విశుద్ధ మగుబుద్ధి యేర్పడును. అద్దాన బ్రహ్మజ్ఞానము సిద్ధించును. నిర్జనారణ్యామధ్యప్రదేశమందున్నను, దావాగ్నిచే చుట్టుకొనబడినను, తోడు

221) దస్యుభిర్వా వృత శ్శూన్యే
గృహీతో వాపి శత్రుభిః।
సింహవ్యాఘ్రానుయాతో వా
వనే వా వనహస్తిభిః।

222) రాజ్ఞా క్రుద్ధేన చాజ్ఞప్తో
వధ్యో బన్ధగతోఽపి వా।
ఆఘూర్ణితో వా వాతేన
స్థితః పోతే మహార్ణవే ॥

223) పతత్సు చాపి శస్త్రేషు
సఙ్గ్రామే భృశదారుణే।
సర్వాబాధాసు ఘోరాసు
వేదనాభ్యర్దితోఽపి వా ॥

224) స్మరన్ మమైతచ్చరితం
నరో ముచ్యేత సఙ్కటాత్।

లేనిచోట దొంగలచే చుట్టుకొనబడినను, శత్రువులచే బట్టుకొనబడినను, సింహవ్యాఘ్రవనగజాదిభయంకరజంతువులడవులయందు వెంబడించినను, రాజుచే తఱుమబడినను, కట్టివేయబడినను, వధకాజ్ఞప్తుడైనను, సముద్ర, విమాన, (రైలు, పడవ) ఇత్యాదియానములలో పయనించునపుడును, తుపాను తటస్థించినను భయంకరమైనయుద్ధమున శస్త్రాస్త్రములచే నలగజేయబడినను, మఱియనేకఘోరబాధలు సంప్రాప్తించినను 'హేదుర్గే' అని సంబోధించి, నాచరిత్రను స్మరించిన మాత్రమున నే మానవులు సర్వసంకటములనుండి విముక్తులగుదురు. నాప్రభావమువలన సింహాదిమృగములు, చోరులు, శత్రువులు దూరముగా పరుగెత్తి పోవుదురు.

మమ ప్రభావా త్సింహోద్యా
దస్యవో వైరిణ స్తథా ॥
దూరాదేవ పలాయన్తే
స్మరత శ్చరితం మమ ॥

ఋషిరువాచ

225) ఇత్యుక్త్వా సా భగవతీ
చణ్డికా చణ్డవిక్రమా।
పశ్యతామేవ దేవానాం
తత్రైవా న్తరధీయత ॥

226) తేఽపి దేవా నిరాతఙ్కాః
స్వాధికారాన్యథా పురా।
యజ్ఞభాగభుజ స్సర్వే
చక్రు ర్వినిహతారయః ॥

ఋషి చెప్పుచున్నాడు.

225) బహుపరాక్రమ ప్రభాపరిపూర్ణయైన చండిక యీప్రకారము తనమహిమ నెరిగించి, దేవతలు చూచుచుండగ అచటనే అంతర్ధాన మొందెను.

226) దేవతలును పూర్వమువలె స్వస్వాధికారములను నిరాటంకముగా పొందిరి. నమ స్తశత్రువులు నశించుటచే వారంతటినుండి తమతమ యజ్ఞభాగములను పొందగల్గిరి

227) దైత్యాశ్చ దేవ్యా నిహతే
శుమ్భే దేవరిపౌ యుధి ।
జగద్విధ్వంసిని తస్మిన్
మహోగ్రేఽతులవిక్రమే ॥
నిశుమ్భే చ మహావీర్యే
శేషాః పాతాళమాయయుః॥

227) దేవతాశత్రువైన శుంభుడును, జగద్విధ్వంసకుడు, మహోగ్రుడు, మహావీర్యవంతుడునైన నిశుంభుడును దేవిచే సంహరించబడగా తక్కిన రాక్షసులు పాతాళమున తలదాచుకొన పరుగెత్తిరి.

"న్యూనాతిరిక్తాది దోషపరిహారార్థం దుర్గాదేవీసూక్తపఠన నమస్కారం కరిష్యే"-అని చెప్పి నె99రు మంత్రపుష్పము, నె100రు నమస్కారములు పారాయణ చేయవలయును - లేక నె99రు లోని 166 167 పేజీలలోని దుర్గాదేవీసూక్తము పఠించవలెను. లేక 5వ చరిత్ర ధర్మరాజు చేసిన దుర్గాస్తవమైనను పఠించవలెను. అనేన మయాకృతేన దుర్గాసప్తశతీ పారాయణేన దుర్గామహాలక్ష్మీః ప్రీతా భవతు. దుర్గామహాలక్ష్మీ ప్రసాదేవమమ సర్వాభీష్టఫల సిద్ధిరస్తు (అని చెప్పి) ఉదకము వదలి ఆయుదకము నె103రు ఆత్మార్చనలోని శ్లో - అకాలమృత్యుహరణం=దుర్గామహాలక్ష్మీ పాదోదకం పిబేత్-అని మూమ్మారుపుచ్చుకొని పారాయణము సమాప్తిచేయవలయును.

## (110) చతుర్థ చరిత్ర

### మూలము :

1) సావర్ణిః సూర్యతనయో
యో మనుః కథ్యతేఽష్టమః।
నిశామయ తదుత్పత్తిం
విస్తరాద్గదతో మమ ॥

2) మహామాయానుభావేన
యథా మన్వన్తరాధిపః।
స బభూవ మహాభాగః
సావర్ణిస్తనయో రవేః ॥

3) స్వారోచిషేఽన్తరే పూర్వం
చైత్రవంశసముద్భవః।
సురథో నామ రాజాఽభూ
త్సమస్తే క్షితిమణ్డలే ॥

### తాత్పర్యము :

1) రాజా! అష్టమమను వైన సావర్ణి యనుసూర్యపుత్రునియొక్క యుత్పత్తినిగూర్చి సవిస్తరముగా వివరించెదను వినుము.

2) పుణ్యాత్ము డైన సావర్ణి యనుసూర్యపుత్రుడు మహామాయాభగవతీప్రసాదముచే మన్వంతరాధిపతి యెటులాయెనో వినుము.

3) పూర్వము స్వారోచిషమన్వంతరమున చైత్రవంశమునందుద్భవించిన (సూర్యవంశము) సురథు డనురాజు సమస్తపృథ్వీమండల మేలుచుండెను.

4) తస్య పాలయతః సమ్యక్
ప్రజాః పుత్త్రానివౌరసాన్
బభూవుః శత్రవో భూపాః
కోలావిధ్వంసిన స్తదా ॥

4) ఆ రాజు తనప్రజలను పుత్రులవలె లెస్సగా పాలించుచుండగా కోలావిధ్వంసు లనురాజులు శత్రువు లయిరి.

5) తస్య తై రభవ ద్యుద్ధ
మతిప్రబలదణ్డినః ।
న్యూనై రపి స తై ర్యుద్ధే
కోలావిధ్వంసిభి ర్జితః ॥

5) సురథరాజు విశేషబలము గలవాడయ్యును కొద్దిబలము గలకోలావిధ్వంసు లనురాజులచే యుద్ధమున నోడిపోయెను.

6) తతః స్వపుర మాయాతో
నిజదేశాధిపోఽభవత్ ।
ఆక్రాన్త స్స మహాభాగ
స్తై స్తదా ప్రబలారిభిః ॥

6) పిమ్మట ఆప్రబలశత్రువులచే ఆవరించబడియు తప్పించుకొని తనస్వపురమునకు వచ్చి తనరాజ్యాధిపత్యము వహించి పాలించుచుండెను.

7) అమాత్యై ర్బలిభి ర్దుష్టై
ర్దుర్బలస్య దురాత్మభిః ।

7) దురాత్ములు, దుష్టులు, బలవంతులు నయిన,తనమంత్రులు తనపట్టణములో దుర్బలుడై యుండుచున్న రాజుయొక్క-

కోశో బలం చాపహృతం
తత్రాపి స్వపురే తతః ॥

8) తతో మృగయావ్యాజేన
హృతస్వామ్యః స భూపతిః।
ఏకాకీ హయ మారుహ్య
జగామ గహనం వనమ్ ॥

9) స తత్రాశ్రమ మద్రాక్షీ
ద్ద్విజవర్యస్య మేధసః ।
ప్రశాన్తశ్వాపదాకీర్ణం
మునిశిష్యోపశోభితమ్ ॥

10) తస్థౌ కఞ్చిత్స కాలం చ
మునినా తేన సత్కృతః ॥
ఇతశ్చేతశ్చ విచరం
స్తస్మిన్ మునివరాశ్రమే ॥

సేనాధనముల నపహరించిరి.

8) అప్పుడు సురథరాజొంటరిగా అశ్వారూఢుడై వేటాడుటకు వెళ్ళునెపమున దట్టమైన ఒకయడవికి జనెను.

9) మునిశిష్యులతోడను, వైరరహితపశుపక్ష్యాదిమృగముల తోడను నిండియున్న యరణ్యమునం దుండు మేధానామక ద్విజవర్యుని యాశ్రమమును చూచెను.

10) ఆయాశ్రమనివాసి యగుమునిచే సురథరాజు సత్కరించబడియు ఆయరణ్యమునలువంకల పిచ్చివానివలె తిరుగుచు కొంతకాలము నివసించెను

11) సోఽచిన్తయత్తదాతత్ర
మమత్వాకృష్టమానసః
మత్పూర్వైః పాలితం పూర్వం
మయా హీనం పురం హి తత్ ॥

12) మద్భృత్యైస్తైరసద్వృత్తైః
ర్ధర్మతః పాల్యతే న వా?
న జానే స ప్రధానో మే
శూరో హస్తీ సదామదః॥

13) మమ వైరివశం యాతః
కాన్ భోగానుపలప్స్యతే?
యే మమానుగతా నిత్యం
ప్రసాదధనభోజనైః ॥

14) అనువృత్తిం ధ్రువం తేఽద్య
కుర్వన్త్యన్యమహీభృతామ్

11) అక్కడ ఆ రాజు మమకారముచే చుట్టుకొనబడిన మనస్సు గలవాడై దిక్కుదోచక తనలో 'అయ్యో! నిష్కంటకముగ బరిపాలించుచు వచ్చిన రాజ్యమును నా చేతగానితనముచే పోగొట్టుకొని దుఃఖములపాలైతినే' యని చింతించెను.

12-13) దురాచారు లయిన నాభృత్యులు నా ప్రజలను ధర్మయుక్తముగా పరిపాలించుచున్నారో లేదో అనియు, ప్రసాదధనభోజనాదులచే నన్నెల్లప్పుడు ననుసరించి యుండు నాఆంతరంగికమంత్రియు సదా మదముచే నానందించు నా పట్టపుటేనుగయు నా వైరులవశమై ఏ భోగముల ననుభవించుచున్నది తెలియకున్నది.

14) దుర్వ్యయము చేయు స్వభావముగలనాభృత్యులు అన్య రాజును సేవించుచు, నిల్వయుంచినధనము నంతయు విప

అసమ్యగ్వ్యయశీలైస్తైః
కుర్వద్భిః సతతంవ్యయమ్॥

15) సఞ్చితః సోఽతిదుఃఖేన
క్షయం కోశో గమిష్యతి।
ఏతచ్చాన్యచ్చ సతతం
చిన్తయామాస పార్థివః॥

16) తత్ర విప్రాశ్రమాభ్యాశే
వైశ్య మేకం దదర్శ సః।
స పృష్టస్తేన కస్త్వం భో
హేతుశ్చాగమనేఽత్ర కః?

17) సశోక ఇవ కస్మాత్త్వం
దుర్మనా ఇవ లక్ష్యసే?
ఇత్యాకర్ణ్య వచస్తస్య
భూపతేః ప్రణయోదితమ్॥

రీతముగ వ్యర్థవ్యయము చేయుచుందురు.

15) లోగడ సూచించిన విషయములనుగూర్చియేగాక యింక ననేకవిషయముల నిజ్ఞప్తికి తెచ్చుకొనుచు సురథరాజు మిక్కిలివ్యసనముతో నుండెను.

16–17) సురథరాజు ఆమున్యాశ్రమమున నొకవైశ్యుని చూచి 'నీ వెవరు? ఇక్కడికి వచ్చుటకు కారణ మేమి? దుఃఖముచే మనోవైకల్యము గలవానివలె గనిపించుచుండుటకు కారణ మేమి?' యని ప్రశ్నించెను.

18) ప్రత్యువాచ స తం వైశ్యః
ప్రశ్రయావనతో నృపమ్॥

వైశ్య ఉవాచ॥

19) సమాధిర్నామ వైశ్యోఽహ
ముత్పన్నో ధనినాం కులే।

20) పుత్రదారైర్నిరస్తశ్చ
ధనలోభా దసాధుభిః।
విహీనశ్చ ధనైర్దారైః
పుత్రైరాదాయ మేధనమ్॥

21) వన మభ్యాగతో దుఃఖీ
నిరస్త శ్చాప్తబన్ధుభిః।
సోఽహంన వేద్మిపుత్రాణాం
కుశలాకుశలాత్మికామ్॥

18) ఇట్లు వినయముతో పృచ్ఛ చేసినసురధ రాజునకు ఆవైశ్యు డిట్లు నమ్రతతో సమాధానము చెప్పు చున్నాడు.

వైశ్యుడు చెప్పుచున్నాడు–

19–20) నేను ధనవంతులకులమున పుట్టినవాడను. సమాధి యను పేర పిలువబడుచున్నాను. స్వజన, స్త్రీ (భార్య) పుత్రాదులు దుర్మార్గులయి, ధనలోభముచే నా ధన మంతయు అపహరించి, నన్ను స్వగృహామునుండి వెళ్ళ గొట్టిరి.

21) ఆప్తబంధువులచే వెళ్ళగొట్టబడి దుఃఖముతో నీవనమునకు వచ్చితిని. భార్యాపుత్రాదుల సుఖదుఃఖాదులు నాకు తెలియరాకున్నవి.

22) ప్రవృత్తిం స్వజనానాం చ
దారాణాం చాత్రసంస్థితః॥
కిం ను తేషాం గృహే క్షేమ
మక్షేమం కింనుసామ్ప్రతమ్॥
కథం తే కింను సద్వృత్తా
దుర్వృత్తాః కింను మేసుతాః?
రాజోవాచ ॥

23) యై ర్నిరస్తో భవాన్ లుబ్ధైః
పుత్త్రదారాదిభి ర్ధనైః ।
తేషు కిం భవతః స్నేహ
మనుబధ్నాతి మానసమ్?
వైశ్య ఉవాచ॥

24) ఏవమేత ద్యథా ప్రాహ
భవా నస్మద్గతం వచః ।

22) ఇక్కడ నే నుండుటచే నాభార్యాపుత్రాదులయొక్క—సుఖదుఃఖములు ప్రస్తుత మెట్లున్నదిగాని, మరియు వారు దురాచారపరులుగ నున్నారో లేక సదాచారపరులుగానే యున్నారో తెలియకున్నది.

రాజు చెప్పుచున్నాడు—

23) ఓసమాధీ! ధనాపేక్షచే నిన్ను వెళ్ళగొట్టిన భార్యాపుత్రాదులవలన ఏమిలాభ మపేక్షించి నీమనస్సున వారిని తలపోసి చింతించుచున్నావు?

వైశ్యు డనుచున్నాడు—

24) రాజా! మీ రనినట్లే వారినిగురించి చింతించగూడ దని నామనస్సునం దున్నను, ధనలోభముచే నాధనము సహా

| | |
|---|---|
| కిం కరోమి న బధ్నాతి<br>మమ నిష్ఠురతాం మనః ॥<br>యైః స న్త్యజ్య పితృస్నేహం<br>ధనలుబ్ధై ర్నిరాకృతః ॥ | రించి నన్ను స్వగృహమునుండి వెళ్ళగొట్టినను కుమారుని యందు భార్యయందు ప్రేమ యుండుట సహజ మగుటచే నా మనస్సు కాఠిన్యము నొందకున్నది. |
| 25) ప్రీతిః స్వజనహార్దం చ<br>హార్ది తేష్వేవ మే మనః ।<br>కిమేత న్నాభిజానామి<br>జానన్నపి మహామతే! ॥ | 25) విశాలమతీ! నన్ను నిరసించినస్వజనమందే మనస్సు హత్తుకొనుచుండుటకు ముఖ్యహేతు వేదియో తెలియకున్నది |
| 26) యత్రప్రేమప్రవణం చిత్తం<br>విగుణేష్వపి బన్ధుషు ।<br>తేషాంకృతే మే నిఃశ్వాసో<br>దౌర్మనస్యం చ జాయతే॥ | 26) మరియు అవగుణులైనభార్యాపుత్రాదులయందు నా మనస్సు విరక్తి చెందక వారినే ప్రేమించుచున్నది. పలుమారు యత్నించియు కాఠిన్యమును పొందకుండుట కేమి హేతువో తెలియకున్నది. |

కరోమి కిం యన్నమన
స్తేష్వప్రీతిషు నిష్ఠురమ్ ॥
27) తత స్తౌ సహితౌ విప్ర!
తం మునిం సముపస్థితౌ
సమాధిర్నామ వైశ్యోఽసౌ
స చ పార్థివసత్తమః॥
కృత్వాతు తౌ యథాన్యాయ్యం
యథార్హం తేన సంవిదమ్।
ఉపవిష్టౌ కథాః కాశ్చి
చ్చక్రతు ర్వైశ్యపార్థివౌ॥
రాజోవాచ ॥
28) భగవంస్త్వా మహంప్రష్టు
మిచ్ఛామ్యేకం వదస్వ తత్
దుఃఖాయ యన్మే మనసః

27) వారిద్దరును ఒకేవిధముగ చింతాక్రాంతులై యున్నందున ఒకరివిషయ మింకొకరితో చెప్పుకొని సమాలోచించి సమాధియు సురథుడును గలిసి, మేధోమహర్షి సన్నిధికి బోయి, విధిప్రకారము వినయముతో సత్కరించి వారిద్దరు నిట్లు ప్రశ్నించిరి.

రా జిట్లు ప్రశ్నించుచున్నాడు–

28) ఓమహానుభావా! నే నొకసంగతి యడుగదలచి యున్నాను. తాము సెలవీయవలయు నని ప్రార్థించు చున్నాను. నేను రాజ్యము కోల్పోయియున్నను, రాజ్యాం

స్వచిత్తాయత్తతాం వినా
మమత్వం గతరాజ్యస్య
రాజ్యాఙ్గేష్వఖిలేష్వపి ।
29) జానతోఽపి యథాజ్ఞస్య
కిమేతన్మునిసత్తమ!
అయం చ నికృతః పుత్రై
ర్దారైర్భృత్యైస్తథోజ్ఝితః॥
30) స్వజనేన చ సన్త్యక్త
స్తేషు హార్దీ తథాప్యతి।
ఏవమేష తథాహం చ
ద్వావప్యత్యన్తదుఃఖితౌ ॥
31) దృష్టదోషేఽపి విషయే
మమత్వాకృష్టమానసౌ ॥
తత్కేనైతన్మహాభాగ!

గములయందు మమత విడువక దుఃఖముచే చిత్తస్వాధీనత లేక యున్నాను.

29) మునిసత్తమా! తెలిసియుండియు అజ్ఞానివలె నిట్లుండుటకు కారణము తెలియకున్నది. ఈ వైశ్యుడును భార్యాపుత్ర భృత్యాదులచే నిరాదరణచేయబడి గృహమునుండి వెళ్ళగొట్టబడియున్నాడు.

30) అట్లయ్యును వారియందే యీ సమాధికి మన స్సీడ్చుచున్నది. ఇట్లు మే మిద్దరము నత్యంతదుఃఖముతో నేమియు తెలియకున్నవారము.

31) దోషములు కనుపించుచున్న విషయములందు గూడ మనస్సు లగింపబడుచున్నది. ఓ మహాభాగా విషయము తెలిసినవారినిగూడ మోహ మింతగ బాధించునా? మే

యన్మోహో జ్ఞానినోఽపి ।
మమాస్య చ భవ త్యేషా
వివేకాన్ధస్య మూఢతా॥

మిద్దరము అజ్ఞానముచే గ్రుడ్డివారలమై యున్నారము.

ఋషి రువాచ ॥ రఽ

ఋషి యిట్లు చెప్పుచున్నాడు–

32) జ్ఞాన మస్తి సమస్తస్య
జన్తో ర్విషయగోచరే ।
విషయాశ్చ మహాభాగ !
యాన్తిచైవంపృథక్పృథక్
దివాన్ధాః ప్రాణినః కేచి
ద్రాత్రా వన్ధా స్తథాపరే ॥
కేచి ద్దివా తథా రాత్రౌ
ప్రాణిన స్తుల్యదృష్టయః ॥

32) ఓ రాజా! కనబడుచున్నసమస్తజంతుజాలమునకు జ్ఞానము కలదు. ఆయావిషయవాసనల ననుసరించి భిన్నభిన్నములుగా జ్ఞానముకల్గుచుండును. పట్టపగలే యంధత్వము గల జంతువులు కొన్ని, రాత్రియం దంధత్వము గలజంతువులు కొన్ని; మరికొన్ని జంతువులో దివారాత్రములందును అంధత్వము గలవి.

33) జ్ఞానినో మనుజాః సత్యం
కిన్తు తే న హి కేవలమ్ ।

33–34) మనుష్యులు జ్ఞానము గలవారగుట సత్యము. అయినను వారికి బ్రహ్మజ్ఞానము లేనందున పశుపక్షిమృగాదుల

యతో హి జ్ఞానినః సర్వే
పశుపక్షిమృగాదయః ॥

34) జ్ఞానంచ తన్మనుష్యాణాం
యత్తేషాం మృగపక్షిణామ్
మనుష్యాణాంచ యత్తేషాం
తుల్యమన్యత్తథోభయోః॥

35) జ్ఞానేఽపి సతి పశ్యైతాన్
పతఙ్గాఞ్ఛాబచఞ్చుషు ।
కణమోక్షాదృతాన్ మోహాత్
పీడ్యమానానపి క్షుధా॥

36) మానుషా మనుజవ్యాఘ్ర!
సాభిలాషాః సుతాన్ ప్రతి।

కెట్టిజ్ఞానము గలదో వారికిని అట్టి జ్ఞానమే గలదు.

దారేషణ, ధనేషణ, పుత్రేషణ, మనుష్యులకును పశుపక్షిమృగాదులకును సమాన మగుటచే మనుజులు దివారాత్రులం దీషణత్రయమునందే మగ్నులై భగవతి తమ కిచ్చినవిశేషబుద్ధిబలమున బ్రహ్మజ్ఞానము సంపాదించుకొని మోక్షము నొందుట కవకాశ ముండియు దానిని లక్షింపజాలకుండుటచే నట్టిమనుష్యులు దివారాత్రాంధులని యిక్కడ చెప్పబడినది.

35) రాజా! యిటు చూడుము. అవిగో ఆపక్షులు ఆకలిచే పీడింపబడుచుండియు, తాము తిరిగి తిరిగి సంపాదించి తెచ్చిన గడ్డిగింజపలుకులను తాము తినక ప్రేమాంధములై తమ శిశువులనోటియందు పెట్టుచున్నవి.

36) మనుజశ్రేష్ఠా! మనుష్యులు వానికంటె బుద్ధిశాలులయ్యును పుత్రులవలన ప్రత్యుపకారము గలుగునను

లోభాత్ ప్రత్యుపకారాయ
నన్వేతాన్ కిం న పశ్యసి॥
తే సర్వే మమతాగర్తే
మోహావర్తే నిపాతితాః॥

*   *   *

ఆశాపాశముచే చుట్టివేయబడి మమత్వమనెడిగుంటలోను, మోహమనెడి సుడిగుండమునను పడి గిరగిర తిరుగుచు బయటబడజాలకుండుట కనులార కాంచుచున్నాము.

*   *   *

37) శ్రీమద్భగవతీ దేవీ
సా నిత్యాపి పునః పునః,
సముద్భూయ కురుతే భూప!
జగతః పరిపాలనమ్ ॥

37) ఓరాజా! భగవతీదేవి నిత్యురాలయ్యును, దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించునిమిత్తము, అప్పుడప్పుడు భూమిపై అవతరించి ధర్మసంస్థాపన చేసి పాలించుచున్నది. (గీ॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే)

38) తయైతన్మోహ్యతే విశ్వం
సైవ విశ్వం ప్రసూయతే
సా యాచితా చ విజ్ఞానం
తుష్టా బుద్ధిం ప్రయచ్ఛతి॥

38) ఆదేవిచే జగత్తు మోహింపజేయబడుచున్నది. ఆమెచే సృష్టిస్థితిలయములు కావింపబడుచున్నవి. ఆమెను ఆరాధించిన సంతోషించి ఐశ్వర్యసమృద్ధిని, కేవలజ్ఞానమును (బ్రహ్మజ్ఞానమును) ఇచ్చుచున్నది.

39) వ్యాప్తం తయైతత్సకలం
బ్రహ్మాణ్డం మనుజేశ్వర! ।
మహాకాళ్యా మహాకాలే
మహామారీస్వరూపయా॥

40) సైవ కాలే మహామారీ
సైవ సృష్టి ర్భవ త్యజా ।
స్థితిం కరోతి భూతానాం
సైవ, కాలే సనాతనీ॥

41) భవకాలే నృణాం సైవ
లక్ష్మీ ర్వృద్ధిప్రదా గృహే।
సైవా భావే తథాఽలక్ష్మీ
ర్వినాశా యోపజాయతే॥

42) స్తుతాసమ్పూజితా పుష్పై
ర్ధూపగన్ధాదిభి స్తథా।

39) అనేకకోటిబ్రహ్మాండములను ఆమెయే వ్యాపించియున్నది. ప్రళయకాలమున మహాకాళియే మహామారీస్వరూపముచే వ్యాపించియుండును. (అనేక కోటిబ్రహ్మాండజననీ–అని ప్రమాణము గలదు )

40) ఆసనాతనీదేవియే మహామారీస్వరూపముచే సర్వలోకములను సంహారించి, తిరిగి సృష్టిరూపమున లోకములను, అందలిజీవులను వెనుకటివాసనారూపము గలవారినిగానే సృష్టించి, సకలభూతములను రక్షించుచున్నది.

41) ఆ దేవి నారాధించువారలగృహమందు లక్ష్మీరూపమున నుండి ఐహికాముష్మిక సుఖములను వృద్ధిని ఇచ్చును. ఆమెనారాధించనివారు ధనధాన్యసంతానహీను లగుదురు.

42) ఆ దేవిని గంధపుష్పధూపాదులచే పూజించి, స్తోత్రములుచేసిన ధనపుత్రాదులను సర్వశుభములను, ధర్మగుణ

దదాతి విత్తం పుత్త్రాంశ్చ
మతిం ధర్మే గతిం శుభామ్॥

ఋషి రువాచ॥

43) ఏతత్తే కథితం భూప!
దేవీమాహాత్మ్యముత్తమమ్॥
ఏవంప్రభావా సా దేవీ
యయేదం ధార్యతే జగత్।
యువాం తథైవ కుర్వాతే
భగవద్విష్ణుమాయయా॥

44) తయా త్వమేష వైశ్యశ్చ
తథైవాన్యే వివేకినః।

మును సద్గతిని, మోక్షమును ప్రసాదించును.

ఋషి చెప్పుచున్నాడు-

43) రాజా! ఈయుత్తమమైన దేవీమాహాత్మ్యము నీకు చెప్పితిని. ఈజగత్తును ధరించినమహాలక్ష్మీదేవి ఇట్టిమాహాత్మ్యము గలది. జగదీశ్వరుని యోగనిద్రారూపయు, జగద్రూపిణియు, సంసారస్థితిమూలకారణ (అజ్ఞాన)రూపిణియునైనవిష్ణుమాయాభగవతీప్రభావమువలన మీరును భార్యాపుత్రవిత్తాదులయందలిమమత్వమును త్యజింపలేకున్నారు. దీని కాశ్చర్యపడ పనిలేదు-

44) విష్ణుమాయయైనయాభగవతీదేవియొక్క మాయచే వివశులై నీవును, ఈవైశ్యుడును, ఇతరబుద్ధిమంతులును

మోహ్యా న్తే మోహితా శ్చైవ
మోహా మేష్య న్తి చాపరే ॥

45) తాముపైహి మహారాజ !
శరణం పరమేశ్వరీమ్ ।
ఆరాధితా సైవ నృణాం
భోగస్వర్గాపవర్గదా॥

46) ఇతి తస్య వచః శ్రుత్వా
సురథః స నరాధిపః।
ప్రణిపత్య మహాభాగం
త మృషిం సంశితవ్రతమ్॥

47) నిర్విణ్ణోఽతిమమత్వేన
రాజ్యాపహరణేన చ ।
జగామ సద్య స్తపసే
స చ వైశ్యో మహామునే!॥

మోహింపజేయబడుచున్నారు. మోహింపజేయబడిరి,
మోహమును పొందుదురుసుమా !

45) రాజా! పరమేశ్వరియైనఆ దేవిని శరణుపొందుము. ఆపరా దేవి పూజింపబడి సంతోషించెనేని మనుష్యులకు ఇహపర సుఖములనే గాక మోక్షమునుగూడ ప్రసాదించును.

46) మేధోమహర్షి విశదముగ నిట్లు బోధింపగా సురథరాజు, సమాధి యనువైశ్యుడు విని, మహాపుణ్యాత్ము డగునా ఋషికి నమస్కరించిరి.

47) రాజ్యాదులు భోగ్యభోగములు కోలుపోయినందునను, మమత్వముచే వ్యామోహముగ్ధు లయినందునను వా రిరువురు మిక్కిలి వ్యాకులు లైరి.

| | |
|---|---|
| 48) సన్దర్శనార్థ మమ్బాయా నదీపులినసంస్థితః ।<br>స చ వైశ్య స్తప స్తేపే దేవీసూక్తం పరం జపన్ ॥ | 48–49) వా రంత తత్క్షణము దేవినిగూర్చి తపఃపూజాదులు చేయుటకు వెళ్ళిపోయిరి–<br>జగదంబాదర్శనార్థము రాజుగారును వైశ్యుడును నది యొక్క యిసుకతిన్నెలపై కూర్చుండి, మట్టితో అమ్మవారి సుందరాకృతిని నిర్మించుకొని, యెదుట నుంచుకొని, దేవీ సూక్తములెన్నగా జపించుచు, తపఃపూజాధ్యానాదులు చేసిరి. (దేవీసూక్త మన దుర్గాసూక్తము. నె 99 చ/ మంత్రపుష్పమునందు గలదు.) |
| 49) తౌ తస్మిన్ పులినే దేవ్యాః కృత్వా మూర్తిం మహీమయీమ్॥ | |
| 50) అర్హణాం చక్రతు స్తస్యాః పుష్పధూపాగ్నితర్పణైః।<br>నిరాహారౌ యతాహారౌ తన్మనస్కౌ సమాహితౌ॥ | 50) యథోచితాహారముతోడను, నిరాహారముగను స్థిరచిత్తులయి తన్మయులై యర్హములైన పుష్ప, ధూప, హోమ, తర్పణాదులు దేవీప్రీతికొరకు చేసిరి– |

51) దదతుస్తౌ బలిం చైవ
నిజగాత్రాసృగుక్షితమ్ ।
ఏవం సమారాధయతో
స్త్రిభిర్వర్షై ర్యతాత్మనోః॥

52) పరితుష్టా జగద్ధాత్రీ
ప్రత్యక్షం ప్రాహ చణ్డికా॥

దేవ్యువాచ ॥

53) యత్ప్రార్థ్యతే త్వయాభూప!
త్వయా చ కులనన్దన!।
మత్తస్తత్ప్రాప్యతాం సర్వం
పరితుష్టా దదామి తత్ ॥

54) తతో వవ్రే నృపో రాజ్య
మవిభ్రంశ్యన్యజన్మని ।

51) మరియు స్వశరీరములనుండి స్రవించెడు రక్తముచే, బలి ప్రదానము చేసిరి. వారిట్లు మూడుసంవత్సరములు నియతమనస్కులై దుర్గాదేవి నారాధించిరి-

52) అప్పుడు జగద్ధాత్రి యైనచండికాదేవి (కౌశికి) వారి కుభయులకు ప్రత్యక్షమయ్యెను-

దేవి చెప్పుచున్నది-

53) రాజా! ఓవైశ్యప్రముఖ! మీరు నాకు గావించినపూజచేతను, స్తోత్రములచేతను, చాలసంతుష్ట నైతిని. అందుచే మీ రుభయులు దేనిని కావలెనని కోరుచున్నారో యది సర్వము మీకు లభించునుగాక!

54) అప్పుడు సురథరాజు ముందుజన్మలో తనకు నశించని రాజ్యము ననుగ్రహించుచు. శత్రువులచే హరించబడిన

అత్ర చైవ నిజం రాజ్యం
హతశత్రుబలం బలాత్ ॥

55) సోఽపి వైశ్య స్తతో జ్ఞానం
వవ్రే నిర్విణ్ణమానసః ।
మమే త్యహ మితి ప్రాజ్ఞః
సఙ్గవిచ్యుతికారకమ్ ॥

దేవ్యువాచ॥

56) స్వల్పైరహోభిర్నృపతే!
స్వరాజ్యం ప్రాప్స్యతే భవాన్ ॥
హత్వా రిపూ నస్ఖలితం
తవ తత్ర భవిష్యతి ॥

57) మృతశ్చ భూయః సమ్ప్రాప్య
జన్మ దేవా ద్వివస్వతః ।

రాజ్యము నిప్పుడే తనకు నిప్పించుమని కోరెను–

55) వైరాగ్యపూర్ణుడు వివేకి యగుసమాధి యనువైశ్యుడు వ్యాకులతామూల మగు "ఇది నాది, వీరు నావారు," ఇత్యాది, నేను అనుచిత్తమే సంసార మగుటచే అట్టిసంసార తరణోపాయమైన అపరోక్షసాక్షాత్కారరూపబ్రహ్మజ్ఞానము ను ప్రసాదింపు మని వేడెను.

అమ్మవారు చెప్పుచున్నది–

56–57) అంతట దేవి రాజా! కొలదిదినములలోనే నీవు నీ శత్రువుల నెల్లరను సంహరించి, నీయఖండమహారాజ్యమును పొందజాలుదువు. మరియు, నీశరీరపతనానంతరము తిరిగి సూర్యునికి పుత్రుడవుగా జన్మించి, సావర్ణికమనునామమున భూమిపై నవతరించి చక్రవర్తి వగుదువు.

సావర్ణికో నామ మను
ర్భవా న్భువి భవిష్యతి ॥

58) వైశ్యవర్య! త్వయా యశ్చ
వరోఽస్మత్తోఽభివాఞ్ఛితః।
తం ప్రయచ్ఛామి సంసిద్ధ్యై
తవ జ్ఞానం భవిష్యతి॥

59) ఇతి దత్త్వా తయో ర్దేవీ
యథాభిలషితం వరమ్ ।
బభూ వా న్తర్హితా సద్యో
భక్త్యా తాభ్యా మభిష్టుతా॥

60) ఏవం దేవ్యా వరం లబ్ధ్వా
సురథః క్షత్రియర్షభః।
సూర్యా జ్జన్మ సమాసాద్య
సావర్ణి ర్భవితా మనుః॥

58) ఓ వైశ్యశ్రేష్ఠా! నీవు నావలన పడయకోరిన వరమును నీకు సిద్ధించున ట్లనుగ్రహించుచున్నాను- అద్దాన నీకు అఖండబ్రహ్మజ్ఞానసిద్ధి యగును. కైవల్యము నొందుదువు. (జ్ఞానా దేవ తు కైవల్యమ్)

59) ఈప్రకారముగా ఆమహాలక్ష్మీదేవి వారు కోరినవరములను పరమానుగ్రహముతో వారి కిచ్చి వారు భక్తితో స్తోత్రముచేయుచుండ తత్క్షణమే యంతర్ధానమయ్యెను-

60) ఈరీతిగా సురథమహారాజు దేవివలన వరమును పొంది, స్వశతృసంహార మొనర్చి తనరాజ్యమును బడసి చాల కాలము సుఖముగ పరిపాలించి సూర్యునివలన జన్మను పొంది సావర్ణికమనుప్రభువుగా ప్రఖ్యాతుడయ్యెను-

# (111) పంచమావతార చరిత్ర

## విరాటపర్వాంతర్గత పాండవప్రవేశపర్వణి దుర్గాస్తవః (మహాభారతము)

| మూలము | తాత్పర్యము |
|---|---|
| 1) విరాటనగరం రమ్యం<br>గచ్ఛన్ రాజా యుధిష్ఠిరః।<br>అస్తువ న్మనసా దేవీం<br>దుర్గాం త్రిభువనేశ్వరీమ్॥ | 1) ధర్మరాజు మనోహర మగువిరాటనగరమునకు వెళ్ళుచుఁ ద్రిభువనములకు నధీశ్వరియు దుర్గమము లగుసంకటముల నుండి తరింపఁ జేయునదియు అగు దుర్గాదేవిని మనస్సులో స్తుతించెను. |
| 2) యశోదాగర్భసంభూతాం<br>నారాయణవరప్రియామ్।<br>నందగోపకులే జాతాం<br>మంగల్యాం కులవర్ధినీమ్॥<br>3) కంసవిద్రావణకరీం<br>అసురాణాం క్షయంకరీమ్। | 2-3-4-5) యశోదాగర్భమునుండి యావిర్భవించినదియు, ఉమాదేవీ! భద్రకాళీ! అని దేవతలు నిన్నుఁ బూజింపఁ గల రని శ్రీనారాయణమూర్తిచే నీయఁ బడిన వరము లందుఁ బ్రీతి గలదియు, నందగోపకులమునఁ బొడమినదియు, మంగళప్రదురాలును, కులమును వర్ధిల్లఁ జేయునదియు, కంసుని బరుగెత్తింప జేయునదియు, రాక్షసులను జెండాడు |

శిలాతటవినిక్షిప్తా
మాకాశం ప్రతి గామినీమ్॥

నదియు, కంసునిచే శిలపై నుంచఁబడి యాకాశమునకెగిరి పోయినదియు, శ్రీకృష్ణునకు సోదరియైనట్టిదియు, దివ్యమాల్యములచే నలంకృత యైనదియు, దివ్యవస్త్రమును ధరించిన దియు, కత్తిని డాలును (చర్మమును) దాల్చినదియు, ఎల్ల వేళల మంగళస్వరూపిణియు నగుదుర్గాదేవిని కష్టములనుండి విడుదలఁ జెందఁ గోరుచు నెవరు స్మరింతురో, వారి నీతల్లి బురదనుండి దుర్బల యగుగోవునువలెఁ బాతకములనుండి తరింపఁ జేయును. ఈయది యథార్థము.

4) వాసుదేవస్య భగినీం
దివ్యమాల్యవిభూషితామ్।
దివ్యాంబరధరాం దేవీం
ఖడ్గఖేటకధారిణీమ్॥

5) భారావతరణే పుణ్యే
యే స్మరంతి సదాశివామ్।

తాన్ వై తారయతే పాపాత్
పంకే గా మివ దుర్బలామ్॥

6) స్తోతుం ప్రచక్రమే భూయో
వివిధైః స్తోత్రసంభవైః।
ఆమంత్ర్య దర్శనాకాంక్షీ
రాజా దేవీం సహానుజః॥

7) నమోఽస్తు వరదే! కృష్ణే!
కుమారి! బ్రహ్మచారిణి!
బాలార్కసదృశాకారే!
పూర్ణచంద్రనిభాననే! ॥

8) చతుర్భుజే! చతుర్వక్త్రే!
పీనశ్రోణిపయోధరే!
మయూరపింఛవలయే!
కేయూరాంగదధారిణి! ॥

6) ధర్మరాజు తమ్ములతోఁ గూడ స్తోత్రమునకే యేర్పడిన 'ఉమా, భద్రకాళీ' త్యాదివివిధము లగునామముల చేత దేవిని సంబోధించి దర్శనమును గోరుచు మరల స్తుతింప నారంభించెను.

7) వరప్రదురాలా! కృష్ణస్వరూపిణీ! కుమారీ! బ్రహ్మచారిణీ! (లౌకికలక్ష్మివలెఁ జాంచల్యము లేనిదానా!) బాలసూర్యునితో సమానమగు ఆకారము గలదానా! నిండుచందురుని బోలుమోము గలదానా! నీకు నమస్కారము.

8) నాల్గుభుజములు గలదానా! (విష్ణుస్వరూపురాలా! యని భావము) నాల్గుమొగములు గలదానా! (బ్రహ్మస్వరూపురాలా! యని భావము) ఉన్నతము లగుపిఱుదులు స్తనములు గలదానా! నెమిలిపించెములవంటి గాజులు, గల

9) భాసి దేవి! యథా పద్మా
నారాయణపరిగ్రహః ॥

10) స్వరూపం బ్రహ్మచర్యం చ
విశదం తవ ఖేచరి!!
కృష్ణచ్ఛవిసమా కృష్ణా
సంకర్షణసమాననా ॥

11) బిభ్రతీ విపులౌ బాహూ
శక్రధ్వజసముచ్ఛ్రయౌ ।
పాత్రీ చ పంకజీ ఘంటీ
స్త్రీ విశుద్ధా చ యా భువి ॥

దానా! (ఇంద్రనీలాదిమణిఖచితము లగుగాజులు గలది యని తెలియ నగు) కేయూరములను (బాహుపురులను) అంగదములను (భుజమునకలంకరించుకొనునగలు) దాల్చిన దానా! నీకు నమస్కారము.

9) ఓ దేవీ! నీవు శ్రీమన్నారాయణుని ధర్మపత్ని వగులక్ష్మి దేవివలెఁ బ్రకాశించు చున్నావు.

10) ఓ గగనసంచారిణీ! నీ స్వరూపము బ్రహ్మచర్యము సర్వ విదితము. తల్లీ! నీవు నీలమేఘసమానవు. కృష్ణవర్ణ శోభి తవు. నీ మోమున సంకర్షణమూర్తిపోలిక గలదు. (బల రామునిఁబోలినమోముగలదానవు.) దేవీ! నీకు జోహారు.

11–12) ఇంద్రధ్వజమువలె దీర్ఘములును, వరములను, అభయ మును భక్తుల కొసఁగుటవలన ఉత్తమములు నగుబాహు వుల (రెంటిని) మఱియు పాత్రమును, పద్మమును, ఘంటను, పాశమును, ధనుస్సును, పెద్దచక్రమును, వివిధము లగు

| | |
|---|---|
| 12) పాశం ధను ర్మహాచక్రమ్<br>వివిధా న్యాయుధాని చ । | నాయుధములను దాల్చినయష్టభుజములతో నొప్పు విశుద్ధ దేవత వీవు తల్లీ ! నమస్కారము. |
| 13) కుండలాభ్యాంసుపూర్ణాభ్యాం<br>కర్ణాభ్యాం చ విభూషితా॥ | 13) కుండలములచే నిండుతనమును జెందిన కర్ణములచే నలంకరింపఁబడితివి. తల్లీ ! నీకు నతులు. |
| 14) చంద్రవిస్పర్థినా దేవి !<br>ముఖేన త్వం విరాజసే ।<br>ముకుటేన విచిత్రేణ<br>కేశబంధేన శోభినా ॥ | 14) ఓదుర్గాదేవీ! నీవు చంద్రుని ధిక్కరించుముఖముతోను, విచిత్ర మగుకిరీటముతోను, శోభను గూర్చు కేశపాశముతోను, మిక్కిలి ప్రకాశించు చున్నావు. |
| 15) భుజంగాభోగవాసేన<br>శ్రోణిసూత్రేణ రాజతా।<br>విభ్రాజసే చ బద్ధేన<br>భోగే నే వేహ మందరః॥ | 15) సర్వశరీరాకారము గలదియై ప్రకాశించు మొలత్రాటిచే నుపలక్షితవై తల్లీ! నీవు సర్పరాజగు వాసుకిశరీరముచే బద్ధ మగు మందరమువలెఁ బ్రకాశించు చున్నావు. |
| 16) ధ్వజేన శిఖిపింఛానాం,<br>ముచ్ఛ్రితేన విరాజసే। | 16) ఓ దేవీ! నీవు ఉన్నత మగు నెమిలిపించెముల జెండాతో రాణించు చున్నావు. కౌమారవ్రతముచేత నీవు స్వర్గ |

| | |
|---|---|
| కౌమారం వ్రత మాస్థాయ<br>త్రిదివం పావితం త్వయా॥ | లోకమును పవిత్ర మొనర్చితివి. |
| 17) తేన త్వం స్తూయసే దేవి !<br>త్రిదశైః పూజ్యసేఽపి చ।<br>త్రైలోక్యరక్షణార్థాయ,<br>మహిషాసురనాశినీ!<br>ప్రసన్నా మే సురశ్రేష్ఠే!<br>దయాం కురు, శివా భవ॥ | 17) అందువలనఁ దల్లీ! నీవు వేల్పులచేత స్తుతింపఁ బడు చున్నావు. మఱియుఁ బూజింపఁ బడు చున్నావు. ఓ జననీ! నీవు ముజ్జగములఁ గాపాడుటకు మహిషాసురుని మర్దించినావు ఓ భద్రకాళీ! నాకుఁ బ్రసన్నురాల వగుము. నన్ను అనుగ్రహింపుము. మంగళములఁ గటాక్షింపుము. |
| 18) జయా త్వం విజయా చైవ<br>సంగ్రామే చ జయప్రదా।<br>మమాపి విజయం దేహి<br>వరదా త్వం చ సాంప్రతమ్॥ | 18) ఓ దేవీ ! నీవు జయవు. మఱియు విజయవు. యుద్ధమునందు జయము నొసఁగుదానవు. నాకును విజయము ననుగ్రహింపుము. ఇప్పుడు వరములఁ గటాక్షింపుము. |
| 19) వింధ్యే చైవ నగశ్రేష్ఠే<br>తవ స్థానం హి శాశ్వతమ్। | 19) మద్యమాంసములందుఁ బశువులయందుఁ బ్రీతి గలవో కాళీ! మహాకాళీ! పర్వతశ్రేష్ఠ మగువింధ్యమునందు నీకు |

| | |
|---|---|
| కాళి ! కాళి ! మహాకాళి !<br>సీధుమాంసపశుప్రియే ! | శాశ్వతనివాసము. |
| 20)కృతానుయాత్రాభూతైస్త్వం<br>వరదా కామచారిణీ ।<br>భారావతారే యే చ త్వాం<br>సంస్మరిష్యంతి మానవాః ॥ | 20-21) కామచారిణి వగునీవు భక్తులచేత ననుసరింపఁ బడిన దానవై వారికి వరముల ననుగ్రహింతువు. ఏ మానవులు కష్టకాలమున నిన్ను స్మరింతురో, ఏనరులు ప్రాతః కాలమున నిన్నుఁ బ్రణమిల్లుదురో వారికిఁ బుత్త్రిలవిషయమునఁ గాని ధనవిషయమునఁ గాని ఏమియుఁ గొఱఁత యుండదు. |
| 21) ప్రణమంతి చ యే త్వాం హి<br>ప్రభాతే తు నరా భువి ।<br>న తేషాం దుర్లభం కించిత్<br>పుత్త్రితో ధనతోఽపి వా॥ | |
| 22) దుర్గాత్ తారయసే దుర్గే !<br>తత్ త్వం దుర్గాస్మృతాజనైః | 22) ఓదుర్గాదేవీ ! నీవు భక్తులను కష్టములనుండి దాఁటింతువు. అందువలన నిన్ను జనులు 'దుర్గ' అని పిలుతురు. |

23) కాంతారే ష్వవసన్నానాం
మగ్నానాం చ మహార్ణవే॥
24) దస్యుభి ర్వా నిరుద్ధానాం
త్వం గతిః పరమా నృణామ్॥
25) జలప్రతరణే చైవ
కాంతారే ష్వటవీషు చ।
యే స్మరంతి మహాదేవి!
న చ సీదంతి తే నరాః॥
26) త్వం కీర్తిః శ్రీ ర్ధృతి స్సిద్ధిః
హ్రీ ర్విద్యా సంతతి ర్మతిః।
సంధ్యా రాత్రిః ప్రభా నిద్రా
జ్యోత్స్నా కాంతిః క్షమా
దయా॥

23–24) అడవులలో అష్టకష్టములకు గుఱియైనవారికిని, మహా సముద్రములో మునిఁగిపోవువారికిని, దొంగలచే నడ్డగింపఁ బడినవారికిని తల్లీ ! నీవె పరమగతివి.

25) నదీజలముల దాఁటునపుడు, సామాన్యవనములలో నడుచునపుడు, దుర్గమారణ్యముల సంచరించునపుడు, ఏనరులు నిన్ను స్మరింతురో! యోదుర్గాదేవీ! వారు కష్టములకు గుఱి గారు.

26) ఓతల్లీ! నీవే కీర్తివి, శ్రీవి, ధృతివి, సిద్ధివి, లజ్జవు(హ్రీదేవివి) విద్యవు, సంతతివి, మతివి, సంధ్యవు, రాత్రివి, ప్రభవు, నిద్రవు, జ్యోత్స్నవు (వెన్నెలవు), కాంతివి, క్షమవు (ఓర్పువు) దయవు నై యున్నావు.

| | |
|---|---|
| 27) నృణాం చ బంధనం మోహం<br>పుత్త్రనాశం ధనక్షయమ్ ।<br>వ్యాధిం మృత్యుం భయం చైవ<br>పూజితా నాశయిష్యసి॥ | 27) తల్లీ! నిన్నుఁ బూజించుమానవులకుఁ గారాగారబంధనమును, మూర్ఛను, (లేదా) యజ్ఞానమును, పుత్రనాశనమును, ధననాశనమును, వ్యాధిని, అకాలమృత్యువును, భయమును, నశింపఁ జేసి వారిని గాపాడుదువు. |
| 28) సోఽహం రాజ్యాత్ పరిభ్రష్టః<br>ప్రపన్న శ్శరణం గతః<br>ప్రణత శ్చ యథా మూర్ధ్నా<br>తవ దేవి! సురేశ్వరి! | 28–29) సురేశ్వరీ! ఓదుర్గాదేవీ! నేను రాజ్యభ్రష్టుఁడనై నిన్ను శరణు చొచ్చి తలతో మ్రొక్కు చున్నాను. ఓపద్మదళాక్షీ! నన్ను రక్షింపుము. ఓసత్యస్వరూపురాలా! నాకు ఆశ్రయమ వగుము. భక్తవాత్సల్యము గలయోదుర్గా! రక్షకురాలా! నన్ను రక్షింపుము. |
| 29) త్రాహి మాం పద్మపత్త్రాక్షి!<br>సత్యే! సత్యా భవస్వ నః। | |

శరణం భవ మే దుర్గే!
శరణ్యే! భక్తవత్సలే!॥

30) ఏవం స్తుతా హి సా దేవీ
దర్శయామాస పాండవమ్॥
ఉపగమ్య తు రాజాన
మిదం వచన మబ్రవీత్॥

దేవ్యువాచ

31) శ్రుణు రాజన్!
మహాబాహో!
మదీయం వచనం ప్రభో!
భవిష్య త్యచిరా దేవ
సంగ్రామే విజయ స్తవ।

30) ఈరీతిగా ధర్మరాజుచేత స్తుతింపఁబడి దుర్గాదేవి ధర్మరాజునకు దర్శన మిచ్చి దగ్గఱకు వచ్చి రాజుతో నిట్లనెను.

దుర్గాదేవి యిట్లనెను,

31) మహాభుజుఁడ వగు ఓధర్మరాజా! నామాట వినుము. కొలఁదికాలములోనే యుద్ధమునందు నీకు విజయము చేకూరఁ గలదు. నాయనుగ్రహమువలన కౌరవసేనను జయించి, నాశ మొనర్చి నిష్కంటకముగా రాజ్యము నొనర్చి మరల భూమి ననుభవింపఁ గలవు.

| | |
|---|---|
| మమ ప్రసాదా న్నిర్జిత్య<br>హత్వా కౌరవవాహినీమ్॥<br>రాజ్యం నిష్కంటకం కృత్వా<br>భోక్ష్యసే మేదినీం పునః॥ | |
| 32) భ్రాతృభి స్సహితో రాజన్!<br>ప్రీతిం ప్రాప్స్యసిపుష్కలామ్।<br>మత్ప్రసాదా చ్చ తే సౌఖ్య<br>మారోగ్యం చ భవిష్యతి ॥ | 32) ఓ రాజా! సోదరులతోఁ గూడ నీవు నిండుసంతోషమును బొందఁగలవు. నాయనుగ్రహమువలన నీకు సౌఖ్యము, ఆరోగ్యమును గలుగఁ గలవు. |
| 33) యే చ సంకీర్తయిష్యంతి<br>లోకే విగతకల్మషాః।<br>తేషాం తుష్టా ప్రదాస్యామి<br>రాజ్యమాయుర్వపు స్సుతమ్॥ | 33) నిష్కల్మషచిత్తముతో ఎవరు నన్ను సంకీర్తన చేయుదురో వారియెడల సంతుష్టురాలనై వారికి రాజ్యమును దీర్ఘాయువును దేహబలమును పుత్రసంపదను ఒసఁగుదును. |

34) ప్రవాసే నగరే చాపి
సంగ్రామే శత్రుసంకటే ।
అటవ్యాం దుర్గకాంతారే
సాగరే గహనే గిరౌ ॥
యే స్మరిష్యంతిమాంరాజన్!
యథాఽహం భవతాస్మృతా
న తేషాం దుర్లభం కించి
దస్మిన్ లోకే భవిష్యతి॥

35) ఇదం స్తోత్రవరం భక్త్యా
శ్రుణుయాద్వా పఠేత వా।
తస్య సర్వాణి కార్యాణి
సిద్ధిం యాస్యంతి పాండవాః॥

34) ఓరాజా! దేశాంతరమునఁ గాని, నగరమునఁ గాని, యుద్ధమునఁ గాని, శత్రుసంకటమునఁ గాని, సామాన్యవనమునఁ గాని, దుర్గమారణ్యమునఁ గాని, సముద్రమునఁ గాని, దుర్గ గాహము లగు కొండలయందుఁ గాని, నీవు స్మరించినట్లు న న్నెవ్వరు స్మరింతురో వారికష్టములు తక్షణము నివారించును. వారి కిలోకమునందు దుర్లభ మగువస్తువే యుండదు. (నాయనుగ్రహముచేత వారి కన్ని వాంఛలును నెఱవేఱు నని భావము.)

35) ఈ యుత్తమ స్తోత్రమును భక్తితో నెవఁడు వినునో! పఠించునో! పాండవులారా! వారి సమస్తకార్యములు సిద్ధిని జెందును.

36) మత్ప్రసాదా చ్చ వ
స్సర్వాన్
విరాటనగరే స్థితాన్ ।
న ప్రజ్ఞాస్యంతి కురవో
నరా వా తన్నివాసినః॥

37) ఇత్యుక్త్వా వరదా దేవీ
యుధిష్ఠిర మరిందమమ్।
రక్షాం కృత్వా చ
పాండూనాం
తత్రైవాంతరధీయత॥

ఇతి పంచమోఽధ్యాయః ॥

36) ఓపాండవులారా! నాయనుగ్రహమువలన విరాటనగరములో నుండుమిమ్ములఁ గౌరవు లెవ్వరును దెలిసికొనలేరు. విరాటనగరవాసు లగుజనులుసైతము తెలిసికొనలేరు.

37) అని యిట్లు దుర్గాదేవి శత్రుదమనుఁ డగుధర్మజునితోఁ బలికి వరము ననుగ్రహించి పాండవులకు రక్షగట్టి యచ్చటనే యదృశ్య యయ్యెను.

పంచమచరిత్ర సంపూర్ణము.

## (112) బాలాత్రిపురసుందరీ ధ్యానము.

శ్లో॥ అరుణకిరణజాలారంజితాశావకాశా
వరమణిజపమాలా పుస్తకాఽభీతిహస్తా
నవదినమణిచేలా, ఫుల్లకల్హారసంస్థా
నివసతు హృది బాలా నిత్యకల్యాణశీలా.

## (113) లలితామహాలక్ష్మీధ్యానమ్

శ్లో॥ సకుంకుమవిలేపనా మలకచుంబికస్తూరికాం
సమందహసితాననాం సశరచాపపాశాంకుశామ్
అశేషజనమోహినీ మరుణమాల్యభూషాంబరాం
జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరే దంబికామ్.

శ్లో॥ చతుర్భుజే! చంద్రకళావతంసే!
కుచోన్నతే! కుంకుమరాగశోణే!
పుండ్రేక్షుచాపాంకుశబాణహస్తే!
నమో నమస్తే జగదేకమాతః!

**శ్రీం హ్రీం క్లీం శ్రియం కురు కురు స్వాహా.**

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు.

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః। పృథివీ సస్యశాలినీ
దేశోఽయం క్షోభరహితో। బ్రాహ్మణా స్సంతు నిర్భయాః.

శ్లో॥ అపుత్త్రాః పుత్రిణ స్సంతు। పుత్రిణ స్సంతు పౌత్రిణః
అధనా స్సధనా స్సంతు। జీవంతు శరదాం శతమ్.

ఓమ్-తత్-సత్.

సర్వము సంపూర్ణము

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 27 | 5 | పత్నీ | పత్న్యై |
| 29 | 4 | మాతుం | మాత్రీం |
| 52 | 2 | దస్వ | దస్య |
| 86 | 7 | యాన్ | యాత్ |
| 109 | 1 | పశ్ని | పశ్చి |
| 114 | 4 | హ్రీ | హ్రీం |
| 162 | 5 | ఇం | ఐం |
| | 6 | దక్షిణ | వామ |
| 164 | 2 | తికోణ | త్రికోణ |
| 168 | 10 | పరి... | తస్యాధీ రాఃపరి... |
| | 12 | తస్యాధీ రాః | (తొలగించుడు) |
| 171 | 7 | పూర్ణ | పూర్ణం |

| | | | |
|---|---|---|---|
| 212 | 11 | పురుణా | పురుషా |
| 215 | 13 | దురాచా | దురాచార |
| 231 | 7 | కాశికి | కౌశికి |

+ ఫారము నె 33 రు పుటసంఖ్యలను 225 నుండి 232 గా సవరించుకొనుడు.